శ్రియై నమః,     శ్రీ వేంకటేశాయ నమః

# శ్రీ వైఖానస శాస్త్రే

# శ్రీ వైఖానసోపాఖ్యానము


శ్రీ వాడపల్లి కృష్ణమాచార్య

విరచితము






ప్రచురణ :

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

1998

**SRI VAIKHANASA UPAKHYANAM**
**by**
**SRI VADAPALLI KRISHNAMACHARYA**

T.T.D. Religious Publications Series No. 507
T.T.D. First Edition 1998
Copies : 500

*Published by :*
**SRI M.K.R. VINAYAK,** I.A.S.
Executive Officer
Tirumala Tirupati Devasthanams
Tirupati

*Printed at :*
**OMKARS GRAPHICS**
2/9, Brodiepet,
✆ : 232653
GUNTUR - 2

# ముందుమాట

''**శ్రీ వైఖానసోపాఖ్యానము**'' – అనే ఈ గ్రంథం శ్రీ వైఖానస సంప్రదాయానికి ఆద్యులైన మహర్షుల్నిగూర్చి, ఈ సంప్రదాయానికి చెందిన ఆయా ఆచార్యుల జీవిత విశేషాల్ని గూర్చి వివరిస్తూ ఉంది. ఇది శ్రీమాన్ వాడపల్లి కృష్ణమాచార్యులవారిచే రచింపబడింది.

తిరుపతి వృత్తాంతము (వివిధ పురాణాల నుండి సేకరించబడిన శ్రీ వేంకటేశ్వరస్వామివారి అవతార వృత్తాంతము), తిరుమలలో తొలుతనుండీ వైఖానస ఆగమాన్ని అనుసరించే పూజాదికం కొనసాగుతుండటం, శ్రీ మద్రామానుజాచార్యుల వృత్తాంతం – మొదలైనవి ఇందులో ఆసక్తికరమైన మరికొన్ని అంశాలు.

ఆ యా పురాణాల నుండి ఉదాహరింపబడిన సంస్కృత శ్లోకాలకు తెలుగు తాత్పర్యాలు ఇవ్వడం ఇందలి ఇంకో విశేషం. ఇది శ్రీ వైఖానస గ్రంథమాల (ఈగావారిపాళెం)వారిచే 1923లో ముద్రింపబడింది. శ్రీ వైఖానస సంప్రదాయంయొక్క పుట్టు పూర్వోత్తరాలను సంగ్రహంగా వెల్లడిస్తున్న ఈ గ్రంథం అర్చకులకు, భక్తులకు, పరిశోధకులకు చాల ఉపయోగకరమై ఉంది.

ఈ గ్రంథ ప్రచురణలో సహకరించిన శ్రీ మాడంబాకం కృష్ణస్వామి శ్రీనివాస భట్టాచార్యులు (తి.తి.దే.ఆస్థాన పండితులు) గారికి, శ్రీవైఖానస దివ్య సిద్ధాంత వివర్ధనీ సభ వారికి కృతజ్ఞతలు.

తిరుపతి
*27.11.97*

**M.K.R. వినాయక్, I.A.S.**
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానము

# పీఠిక

మానవ జాతికి చరిత్ర మైలురాయి వంటిది. చరిత్ర జాతి యొక్క పూర్వ వైభవమును అనుభవమును తెలుపుచూ వర్తమానమున మంచి నడవడిని ప్రసాదించుచు భవిష్యత్ జీవనమునకు, గమనమునకు కరదీపిక కాగలదు. చరిత్ర పరిశీలన వల్ల సృష్టి రహస్యములను, మానవజాతి మనుగడయు స్పష్టముగా తెలియుచున్నది. చరిత్రకు ఇతిహాసం, ఉపాఖ్యానము పర్యాయ పదములు. వైఖానస జాతి సృష్టి నుండి నేటి వరకు మహోన్నతమైనదని తెలియుటకు ఉపాఖ్యానము శరణ్యము. వేదముల యందున్న రహస్యార్థములను స్పష్టముగా తెలుసుకొనుటకు ఇతిహాస పురాణములు సాధనములగుచున్నవి. అటులనే వైఖానసుల సంస్కృతి, సంప్రదాయం, జీవన విధానం, యుగయుగముల నుండి వచ్చుచున్న ఉపాఖ్యానముల ద్వారా తెలియబడుచున్నవి. కావున చరిత్రను ప్రతి వ్యక్తీ చదివి అందలి సత్యాసత్యములను గుర్తించవలెను.

అట్టి గ్రంథములలో ఈ వైఖానస – ఉపాఖ్యానము వైఖానసులకు ఆరాధ్య దైవమైన విఖనసుని సృష్టి క్రమము నుండి మహర్షుల యొక్కయు పూర్వాచార్యుల యొక్కయు జీవిత చిత్రణమును తెలుపుచున్నది. వైఖానసుల సంస్కృతి అనగా విష్ణు బలి సంస్కారము. దానిని నిర్వర్తించుటచే వైఖానసులు అని చెప్పబడుచున్నారు. ఇందు రెండవది భగవదారాధన. ఈ రెండు సంప్రదాయాలు వైఖానసులకు పెట్టని కోటలు. మరియు ఈ గ్రంథమందు అనేక పుణ్య క్షేత్రములయందు వైఖానసులు నిర్వహించిన పూజావిధానం క్షేత్ర మాహాత్మ్యము, అనేక ప్రమాణములతో వర్ణింపబడినది. గురు పరంపర చెప్పబడింది. ఇది రెండు భాగములు. పూర్వభాగము, ఉత్తర భాగము. పూర్వ భాగమున వైకుంఠ పుర వర్ణనము నుండి మంగళాద్రి యందు చక్రాకృతిలో నున్న నరసింహస్వామిని విఖనస మహర్షి పూజించుట శతప్రోదుని స్వామి అర్చన యందు నియమించుట, వర్ణింపబడినది. ఉత్తర భాగమున గురుపరంపర నుండి శ్రీనివాసాచార్యుల వారి చరిత్రము వరకు వర్ణింపబడినది.

ఈ రెండు గ్రంథములను వాడపల్లి గోపాల కృష్ణమాచార్యుల వారు ఎంతయో శ్రమకోర్చి ఉపపత్తులతో పురాణాది శ్లోకములతో రచించి 1923 ప్రాంతమున ఈగావారిపాలెం వైఖానస గ్రంథమాల సంపాదకులకు సమర్పించిరి. వారు దానిని

వైఖానసులకు అందించి వారి మనః ఫలకమున శాశ్వతముగా నిలచిపోయిరి. కాని నేడు ఆ గ్రంథములు రెండు (పూర్వభాగం, ఉత్తరభాగం) శిథిలమైపోయినవి. వాటిని రెంటినీ కల్పి ఒకే పుస్తకముగా ముద్రించి వైఖానసులకు అందజేయవలెనని సంకల్పంతో శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానముల పాలక వర్గమునకు తెలుపగా వారంగీకరించిరి. వారికి నా కృతజ్ఞతలు. సమస్త కార్య నిర్వహణాధికారులు సహృదయులు శ్రీనివాసానుగ్రహమునకు పాత్రులు అగు ఎమ్.కె.ఆర్. వినాయక్ I.A.S.గారికి, ఈ ముద్రణను ఆమోదించి సహకార మందించినందులకు కృతజ్ఞతలు తెలుపుచున్నాను. టి.టి.డి. సంపాదకులు ఎన్. శ్రీరామమూర్తిగార్లకు వినతులు.

శ్రీ వైఖానస దివ్య సిద్ధాంత వివర్ధినీ సభ యొక్క కార్యదర్శి, ఆగమ గ్రంథ ముద్రణకై దీక్షాధురంధరులు, దీవి విఖనసాచార్యులు (రిటైర్డు ఇంజనీరు) గారికి హృదయ పూర్వక ఆశీస్సులు - గ్రంథ ముద్రణలో సహకరించిన శ్రీ పండిత దీవి వేంకట్రామాచార్యులు (గుంటూరు) వారికి హృదయ పూర్వక అభినందనలు. గ్రంథమును చక్కగా ముద్రించి స్వల్పకాలములో అందించిన ''ఓంకార్స్ ప్రెస్'', గుంటూరు వారికి శుభాశీస్సులు.

వైఖానసార్యదివ్యాజ్ఞా వర్ధతా మభివర్ధతాం,
సర్వేజనాః సుఖినోభవంతు.

ఇట్లు
విభుధ జన విధేయుడు
**మాడంబాకం కృష్ణస్వామి**
**శ్రీనివాస భట్టాచార్యులు**
ఆస్థాన పండితులు
తిరుమల తిరుపతి దేవస్థానములు

తిరుమల
పుష్య శుద్ధ ఏకాదశి
5-1-98

# భూమిక

మహాశయులారా !

నేను కొన్ని దివసములకు ముందు విఖనసోత్పత్తి, శ్రీ వైఖానస చరిత్రములను చిన్న పొత్తములను రచించి సంఘజనుల కడ బెట్టి యుంటిని. నేడు శ్రీ వైఖానస గ్రంథమాలా సంపాదకులగు శ్రీమాన్, బాలకలానిధి, డి. శేషాచార్యులవారు గ్రంథమాలకై రచించి యిమ్మని పదే పదే వ్రాయుగడంగిరి. కించిజ్ఞుడనగు నే నిట్టి మహాకార్యమునకు దొడంగుట హాస్యాస్పదమైనను వారి యుత్సాహమునకు భంగము జేయుజాలక నాయోపినంతవరకు అందందు ప్రమాణములను దిలకించి సత్యముగ నాకు దోచినంత వరకు వ్రాసి యొసంగ గలిగితిని. చరిత్రములలో ప్రమాణ శ్లోకములు వ్రాయునాచారము లేకున్నను ప్రకృతకాలమున నుండు సంఘ పరిస్థితులను బట్టి ఆయా ప్రమాణ శ్లోకములతో గూడ వ్రాసితిని.

మహాశయులందులంగల దప్పుల తెలిపిన ద్వితీయముద్రణమున దిద్దికొన సిద్ధముగా ఉన్నాడను. సంపాదకులు నాచే రచించిన ఈ పొత్తమును వ్యయ ప్రయాసములకోర్చి ముద్రించి సంఘమున కంద జేసినందులకు నేను వారికి మిగుల కృతజ్ఞుడను. మహాశయు లిం దేమాత్రమైన సత్యమున్న గ్రహించి నన్ను ప్రోత్సహించి సంఘసేవకు పురికొల్పుదురని ప్రార్థించుచున్నాడను.

ఇట్లు
గ్రంథకర్త,
**వాడపల్లి కృష్ణమాచార్యులు**

యానాం
1923



భృగుః　　అత్రిః　　విఖనసాచార్యః　　కాశ్యపః　　మరీచిః

# శ్రీ వైఖానసోపాఖ్యానము
## పూర్వభాగము

# శ్రీ వైఖానసోపాఖ్యానము
# ఉత్తర భాగము

శ్రీరస్తు
శ్రీమద్విఖనసదేశికాయనమః

# శ్రీ వైఖానసోపాఖ్యానము

## పూర్వభాగము

సీ. శ్రీనివాసుని పాద – సేవనంబొనరించి
లోకమాతనుమది తోదలంచి
శంఖ చక్రములకు సాష్టాంగ మొనరించి
శేషాహికంజలి జేసి మ్రొక్కి
వైనతేయునివత్ర్వ భావంబుగొనియాడి
సేనాపతికినమస్కృతులొనర్చి
ద్వారపాలకులకు వందనంబొనరించి
వైకుంఠభువనస్త వంబొనర్చి

గీ. విఖనసార్యాది సూరుల వినుతిజేసి
భృగుమరీచ్యత్రికశ్యపా భిధులగొలచి
భాష్యకారుని శ్రీశ్రీని వాసమఖిని
విఖనసకులావతంసుని వినుతి జేసి.

సకల శృతిస్మృతీతిహాస పురాణ సుప్రసిద్ధంబయిన శ్రీవైఖానస మహార్ణవంబు సర్వతంత్ర స్వతంత్ర శ్రీవేంకటనాథ వేదాంతదేశిక శ్రీనివాసాధ్వరీంద్రాది మహా మంధానంబులందరి యింపబడి మహిమాసుధారసంబు సజ్జనసంభవ, పాంచరాత్ర రక్ష, న్యాయపరశుద్ధి, మహిమ మంజరీ, ఉత్తమ బ్రహ్మవిద్యా ద్యగ్రి మగ్రంధరూపంబున నఖిల భూవలయాలంకృతంబై యున్నయది. అది కేవలం పండితైక వేద్యంబగుట చేనాయా గ్రంధముల నుండియు శ్రీమహాభారతాది గ్రంధముల నుండియు గ్రహింపబడి కించిద్ జ్ఞుడనయిన నా శక్తికొలది పండితపామర మనః పరితోషణార్థమై పూర్వాచార్య చారిత్రమను నామాంతరము గలిగి నాచే వ్రాయంబూనిన శ్రీవైఖానసో పాఖ్యానంబునకుం గథావిధానం బెట్టిదనిన.

## శ్రీ వైకుంఠ పురవర్ణనము

క. నిరుపమమై నిత్యంబై పరమపవిత్రంబు భాగ
వతనిలయమునై, పరమపదంబై మంగళ
కరమై వైకుంఠపురము కరమలరారున్.

మరియు నప్పురవరంబు సంతత సంతానో ద్యానపరివృతంబును సంతతామృత పరిపూరిత పరిఘావలయితంబును, హిరణ్య ప్రాకార ప్రకాశమానంబును, నవరత్న ఖచిత తోరణ ద్వారశోభితంబును, వివిధ సౌందర్య వీథీవిరాజితంబును, దివ్యవిలాసినీ సంఖ్యాకీర్ణం బును విష్వక్సేనాది ప్రధాన కింకర మందిర సందోహ విస్తృతంబును, బహిరంగణ చిత్ర విచిత్రిత స్తంభ సహస్ర భాస్కర మహితతేజో విశేష విన్ప్రాజితంబును, మహనీయ సభామంటపా లంకృతంబును సర్వసంవత్సరి పూజితంబును, జయవిజయాది ద్వారపాలక శోభితంబును నై యొప్పునట్టి శ్రీవైకుంఠ నగరంబునం దొల్లి పరమాత్మయు సనాతనుండును. సృష్టిస్థిత్యువ సంహారకారణైక ధురంధరుండును లోకస్వామియు సర్వాధారుండును సర్వసాక్షియునైన శ్రీమన్నారాయణుండు, (నారాయణుండన.) (భారతము అరణ్యపర్వము 19వ అధ్యాయము)

శ్లో. ఆపోనారా ఇతిప్రోక్తా స్థా నామ కృతంమయా
తేననారాయణోప్యుక్తో మమతత్త్వయవం సదా.

తా. ఉదకములకు నారములని నాచే నామధేయము సేయుబడినది. అవి నాకు నివాస స్థానము లగుటచేత నన్ను నారాయణుడని చెప్పుదురు. అని భగవద్వాక్యము.

## శ్రీ విష్ణు పురాణము

శ్లో. బ్రహ్మాదిషుప్రలీనేషు నష్టేస్థావర జంగమే
ఏకస్థిష్ఠతు విశ్వాత్మా సతునారాయణః ప్రభుః

తా. సచరాచరములు బ్రహ్మాదులు నశించిన పిమ్మట నొక్కడయి యెవ్వడుండునో అతడే ప్రభువయిన నారాయణుడు. అనియు,

(నారాయణానువాకే)

యచ్చకించి జ్జగత్యస్మిన్ దృశ్యతే శ్రూయతేఽపివా
అంతర్బహిశ్చతత్సర్వం వ్యాప్యనారాయణః స్థితః

తా. ఈ జగంబున చూడబడునది గాని వినబడునది గాని యేదికలదో దాని లోపల వెలుపల నంతటను వ్యాపించి నారాయణుడుండెను. అనియు చెప్పుచుండుటచే నారాయణుడే సకల జగత్కారణ భూతుండని తెలియుచున్నది.

శ్లో. అథపురుషోహవై నారాయణోఽకామయత,
ప్రజాస్సృజేయేతి.

తా. అట్టి నారాయణుండు ప్రజలను సృజించవలెనని కోరిక గలవాడయ్యెను.

శ్లో. తతస్స్వయం భూర్భగవా నవ్యక్తో వ్యంజయన్నిదం
మహాభూతాది వృత్తౌజాః ప్రాదురాశీత్త మోనుదః

తా. అటుపిమ్మట స్వయంభువైన భగవంతుడగు నారాయణుండు అవ్యక్తములయిన పృధివ్యప్తేజో వాయువ్యాకాశములను పంచభూతములను సృజించెను.

శ్లో. సోఽభిధ్యాయ శరీరాత్స్వా త్సిసృక్షు ర్వివిధాః ప్రజాః
అపఏవ ససర్జాదౌ తాసువీర్య మవాసృజత్,
తదండమ భవద్హైమం సహస్రాంశు సమప్రభం
తస్మిన్ జజ్ఞేస్వయంబ్రహ్మా సర్వలోకపితామహః

తా. ఆ నారాయణుడు తన శరీరము నుండి యనేక విధములగు ప్రజల సృజింప నిచ్ఛగలవాడై ముందుగ నుదకములను సృజించి వాటి యందు బీజావాపమొనరించెనది వేయిమంది సూర్యులతో సమానమైన కాంతికలిగి సువర్ణాండమైనది. అందు సర్వలోక పితామహుడైన బ్రహ్మస్వయముగా జనియించెను. అదియెట్లన.

## నారాయణుండు బ్రహ్మను సృజించుట

### శ్రీరంగ మాహాత్మ్యము.

శ్లో. ఏకఏవా భవద్ధరిః దేవోనారాయణః ప్రభుః
స జగత్సృష్టి సంహారై ర్విహర్తుమకరోన్మనః
స్వాం శం కలయా లక్ష్మ్యా స్వయామూర్త్యా జగన్మయః
స్వకలానంతశయనే విశేష్యే ప్రళయోదధిం
తస్యకామ స్సమజని మనసోవీర్య మాదితః
తదావిష్టస్స్వదేహేతు సోపశ్యత్స చరాచరం
తస్యనాభేర భూన్నాళం నానారత్నమనోహరం
తస్మిన్ హిరణ్మయంపద్మం సర్వగంధమధూత్కటం
తస్మిన్ చతుర్ముఖో బ్రహ్మ సంకల్పాత్పరమాత్మనః
సమష్టిస్సర్వజీవానా మాసీల్లోక పితామహః.

తా. నారాయణ దేవుడొక్కడే ప్రభువై యుండెను. అతడు జగములను సృజించి సంహరించుట యందు విహరించుటయందును మనస్సుగలవాడై తన అంశలో నంశయగు మహాలక్ష్మితో గూడి తనకళయైన యనంతునిపై ప్రళయోదధి యందుశయనించెను. అతని మనస్సునకు వీర్యమే యాదియగుటచే కోరిక గలిగెను. అప్పుడు తన దేహమందున్న సచరాచరములను జూచెను. అప్పుడా నారాయణుని నాభియందుండి యొకనాళ ముద్భవించెను. అది నానారత్నములతో గూడి మనోహరమై యుండెను. ఆనాళమందనేక పరిమళయుక్తమై పుష్పరసముతో గూడిన సువర్ణపద్మముదయించె. అందు నారాయణ దేవుని సంకల్ప మాత్రమున సర్వజీవులకు సమష్టి సృష్టి కారణభూతుండును, లోక పితామహుండును అయిన చతుర్ముఖ బ్రహ్మ యుదయించెను.

### భార్గవే నిరుక్తాధికారే

శ్లో. సోకయంద్రుష్ట్వా జలాక్రాంతం త్రైలోక్యమథ పద్మజః
మహాభయపరిత్రస్తో ముహుర్ముహు రుదైక్షత

కించిత్క దాచిత్కు త్రాపి నోదృష్ట్వా విహ్వలాంగధీః
స్తోత్రయామాసదేవేశం మస్తకేసంయుతాంజలిః

తా. ఆపద్మసంభవుడు త్రిలోకములు జలాక్రాంతము లగుటచే నెచ్చటనేమియు గానరాక వికలశరీరుడై మహాభయముతో గూడి శిరంబున కేలుదోయి గీలించి యాదేవదేవు నిట్లు స్తుతింప బ్రారంభించెను.

**బ్రహ్మనారాయణుని స్తుతించుట.**

శ్లో. యోఽసౌసర్వగత స్స్వామీ సర్వసాక్షీజగన్మయః
పితాచమమసర్వేషాం సోఽయందేవః ప్రసీదతు
యస్మిన్నంతగతంసర్వం సర్వస్మిన్యోవసత్యసౌ
మహాభయాంబుధౌమగ్నం పాతుమాంశరణాగతం
యస్యమాయామయాదేవీ దాసీవ వశవర్తినీ
అచింత్యశక్తి ర్భగవాన్ పాతుమాంభక్తవత్సలః

తా. సర్వగతుండును ప్రభువును సర్వసాక్షియు జగన్మయుండును నాకు ఇతరులకందరకు తండ్రియునెవ్వరో అట్టి దేవుడు నాకు ప్రసన్నుడగు గాక. ఎవరి యందీ సర్వము నంతర్గతమై యున్నదో యీ సర్వమందెవరు వసించియుండిరో అట్టి దేవుడు మహా భయాంబుధి నిమగ్నుండనగు నన్ను రక్షించుగాక, మాయాదేవి దాసివలె యెవరివశవర్తిని యైయున్నదో అట్టి అచింత్యశక్తియు భక్తవత్సలుండునునగు భగవంతుండు శరణాగతుడనగు నన్ను రక్షించుగాక.

శ్లో. ఇత్యేవం ప్రార్థితో విష్ణుః బ్రహ్మణాదీన చేతసా
ప్రాదుర్బభూవ భగవాన్ కృపయాబ్రహ్మణోఽగతః.

తా. అని యిట్లు దీనచేతనుడైన బ్రహ్మచే ప్రార్థింపబడి భగవంతుడయిన విష్ణుదేవుడు దయచేత నాబ్రహ్మదేవుడు కెదుట సాక్షాత్కరించెను.

శ్లో. సోఽపిదృష్ట్వా మహాత్మానం ప్రణమ్యచముహుర్ముహుః
సాంజలిర్గద్గదగళః ప్రోవాచమధుసూధనం.

తా. ఆ బ్రహ్మదేవుడా మహాత్ముడైన విష్ణుదేవుని జూచి మాటి మాటికి నమస్కరించుచు గద్గదధ్వనితో గూడిన కంఠము గలవాడై కేలుముకుళించి యామధుసూదనునితో నిట్లు చెప్పుచున్నాడు.

శ్లో. కోభవాన్ కేనసృష్టోఽహం మయోకర్తవ్య తాంవద.

తా. నీవెవ్వరవు, నే నెవరిచే సృజింప బడితిని, నాచే చేయదగిన కార్యం మెయ్యదియో యానతీయవలయును.

శ్రీ భగవానువాచ.

శ్లో. మాభైష్ఠవత్సతుష్టోఽస్మి స్తోత్రేణానేన పద్మజ
సృష్టింకురుమదాజ్ఞాంవై ధారయన్ భద్రమస్తుతే
దేవతిర్యఙ్మనుష్యాది స్థావరాణిచరాణిచ
తత్తత్క ర్మానుసారేణ తత్తత్పాపానుసారతః
ఇత్యుక్త్వోంకా రసహితవ్యాహృతీశ్చ తథాశృతీః
ఉపాదిశచ్చస్వాంశేన ప్రవిశ్యాంతరధీయత.

తా. భగవంతుడిట్లు చెప్పెను. ఓ చిన్న వాడా భయపడకుము. నీ స్తోత్రముచే నేను సంతుష్టి నొందితిని. నాయాజ్ఞ ప్రకారముగా దేవతిర్యఙ్మనుష్యాది చరాచరములను ఆయాకర్మానుసారముగను ఆయాపాపానుసారముగను సృష్టిచేయుము. అందువలన నీకు శుభముగలుగును. అనిచెప్పి ఓంకారముతో గూడిన వ్యాహృతియు శృతులును ఉపదేశించి తన అంశచే నాచతుర్ముఖునియం దావేశించి యంతర్ధానమొందెను.

## బ్రహ్మసృష్టి జేయుట

శ్లో. యధాభగవతాజ్ఞప్తం తథాభూరాది సంఖ్యయా
చతుర్దశ చసంఖ్యాని భువనాని సురాసురాన్
గంధర్వయక్షనాగాదీన్ మనుష్యాన్ స్థావరాదికాన్
పాపపుణ్యానుసారేణ కృతవాన్ కమలాసనః

తా. కమలాసను డాభగవదాజ్ఞా ప్రకారము భూలోకము మొదలు పదునాలుగు లోకములను, దేవదానవులను గంధర్వయక్ష నాగాదులను, మనుష్యులను స్థావరములు మొదలగు సర్వమును వాటి కిందగిన పాపపుణ్యాను సారముగా సృజించిన వాడయ్యెను.

శ్లో. తతస్తాన్ వీక్ష్యభగవాన్ దేహినః పాపసంశ్రితాన్
కేనోపా యేన సంసారం తారయేయురమీజనాః
కథంపాత్మన స్స్వాత్కైవల్యం ప్రాప్నువంతిః
ఇతి సంచింత్యకృపయా దేవదేవోజగత్పతిః
మదర్చనంవినానాన్యం మల్లోక ప్రాప్తయేధ్రువం.

తా. అటు తరువాత భగవంతుడా బ్రహ్మచే సృజింపబడి పాపసంశ్రితులయిన దేహులనుజూచి వీరు పాపనివృత్తులయి సంసారమును తరించికైవల్య ప్రాప్తు లెట్లగుదురని యాలోచించి దేవదేవుడైన జగన్నాధుండు దయారసము గలవాడయి వీరలు నాలోక ప్రాపులగుటకు నాయర్చనచేయుటకు మించిన యుపాయ మింకొకటి లేదని నిశ్చయించెను.

### బ్రహ్మండపురాణము, అర్థపంచక వివరణము
### అర్చావతారసూచిక, తృతీయాధ్యాయము
### నారాయణుండు చతుర్ముఖున కర్చాశాలభ్య మెఱిగించుట

ఇట్లు నిశ్చయించి భక్తవత్సలుండైన హరిబ్రహ్మను జూచి యిట్లనియె. ఓకమలాసనా! వర్తమాన కాలంబున నీచేసృజింపబడిన జీవ కోటులలో నన్నారాధించు వారు గాని మదారా ధనోపాయజ్ఞేయులు గాని లేరు. ఆకారణము చేతనే నీ సృష్టి యందు దుర్భిక్షాది దోషములు గలిగి దేహులు పానాప శ్రితులై యున్నారు. సంయుపాసనము భూమియందు స్థాపించిన నిర్దుష్ట శ్రమంబు కాగలదు. భూమియందు స్థాపించినచో నర్చించుటయే నాయుపాసన మనబడును. ఇంతకు మించిన యుపాయంబు లేదు. గావున నేనర్చాస్వరూపముతో భూమియందవతరించెదను. అందువలన లోకవృద్ధియు ముక్తియు గలుగ గలదు. నాకు పర, వ్యూహ, విభవ, అర్చ, అంతరాత్మలను నయిదు రూపములు గలవు. పర వ్యూహ స్వరూప మఖిలాండస్సృష్టి ప్రయోజన మయినవి. విభవము, వైభవముతో గూడి రాక్షస సంహారార్థమై ధరింపబడునది. అర్చ, ఉపాస నాపద్ధతి, అంతర్యామి, సకల జీవులయందు నిండి యుండునది. ఇట్టి రూపములలో పరవ్యూహాదులు కష్టసాధ్యములు పూజా నమస్కారాదులచే సులభముగా ముక్తినిచ్చుట కర్చారూపమే యుక్తమైనది. ఇందుల

సౌలభ్యమించుక నీకెరింగిం చెదనాలకింపుము. అర్చారూపధారి నయిన నా కొకసారి ప్రదక్షిణము మొనరించి వారు సర్వపాప విముక్తులగుదురు. రెండు ప్రదక్షిణములచే స్వర్గలోక ప్రాప్తియు, మూటిచే నింద్ర సంపదయు, నాలుగింటిచే సత్యలోక ప్రాప్తియు, అయిదింటిచే బ్రహ్మసంపదయు, నారింటిచే మహదైశ్వర్యమును ఏడింటిచే నాకింకరత్వమును, యెనిమిదింటిచే నాసాలోక్యమును తొమ్మిదింటిచే సామీప్యమును, పదింట సారూప్యమును, పదనొకండుచే మత్సామ్యమును, పదిరెండింట నాసాయుజ్య పదవియును పొందుదురు. సాయుజ్యమునకు మించిన పదవిలేదు. ప్రదక్షిణ నమస్కారముల యందలి విశేషము లియ్యవియని యెరుంగుము. మరియు మదీయాలయ సంమార్జనా కైంకర్యపరాయణుల పాపపుంజములు మహావాతోపహత పరాగ పటలంబు కయివడి నెగిరిపోవును. గోమయముచే గాని జలముచే గాని నాయాలయ పరిశుద్ధిగావించిన వారలకు గూడ నిట్టిదియె ఫలితము. కోమలములయిన తులసీదళములచే నా పాదముల నర్చించువారు నాలోక ప్రాప్తులగుదురు. ఇట్టి రీతిగ నాయర్చా రూపమందు సౌలభ్యముగలదు గాన నట్టిరీతిగ భూమియం దవతరించి లోకమ్ముల నాదరించుచున్నాడనని యానతి యిచ్చుటయు వినయావనతకంధరుడు వినమిత కరకమలుండునయి చతురాననుం డిట్లనియె.

**బ్రహ్మనారాయణుని వేడికొనుట.**

క. స్వామీ నీదయచే ని, చ్ఛామాత్రములో సృజింప జాలితి లోక
స్తోమములు వానిగావం, గామది నూహింపవలయు గారుణ్యనిధీ.

గీ. దేవదేవదయానిధి దీనవరద, సర్వలోకైక రక్షణోత్సవ జగత్ర
యాధినాయక భవభయ హరణనిపుణ, వేగరాగదె నామొరవినవె శౌరి.

వ. ఓ దేవా నేను నిమిత్తమాత్రుండను. సృష్టి స్థితిలయ స్వరూపుడవయిన నీమాయాంధకార నిమగ్నుడనగు నన్నుద్ధరించి నాయందంతర్గతుండవై సృజియించిన యీచరాచరంబుల దరింపంజేయు యత్నంబుగావించి యచిర కాలంబున నర్చాస్వరూపుండవై యవతరించి భక్తసౌలభ్య ప్రదాయకంబయిన విధి విధానంబులతో పూజాక్రమంబు సృజించి లోకసంరక్షణంబు గావించుమని యనేక విధంబులం

బ్రస్తుతించుటయు నా చతుర్ముఖున కా విరాట్పురుషుడయిన నారాయణదేవుండిట్లనియె. ఓ కమలాసనా ! నేను శ్రీభూదేవులతో భూలోకంబున పుణ్యభూమియు కర్మభూమియునైన భారతవర్షంబున గృహనద నదీసంగమ పర్వతవనాది పుణ్యస్థలంబుల యందర్చా స్వరూపధరుండనై యవతరింపబోవుచున్నాను. గృహార్చనా పరతంత్రుడు గృహాధిపతియే కాగలడు. తదితరస్థలా ర్చాస్వరూపార్చనాధురంధరు నాత్మతేజో విరాజమాను నప్రాకృత శరీరు. మదీయార్చనా విధివిధాన నిర్ణాయక శృతిప్రమాణ పరమవైదిక వైష్ణవ సాంప్రదాయ ప్రతిపాదక సూత్రప్రణేతయు భవదీయాం శసముద్భవుండును. భవత్సమానుండును నగు నొక్క మహర్షి పుంగవు నచిరంబున సృజింపవలయునని యాజ్ఞాపించుటయు నా పద్మ సంభవుండా శ్రీహరి చరణారవిందమ్ములకు సాష్టాంగ దండ ప్రణామంబు లాచరించి వినయవినమితోత్త మాంగుడగుచు. యోగసమాధియందు బ్రవేశించి యిట్టి మహత్కార్యమెట్లు సేయగలనని వేద వేదాంతములను ఆత్మ యందు విశేషముగా ఖననము (ఆలోచన) సేయుచుండెను.

## బ్రహ్మ విఖనసుని సృజించుట

అప్పుడా పద్మ సంభవుని పరిశుద్ధాంతరాత్మయందు వేద వేదాంతసార మొక మునిరూపము ధరించి యాబ్రహ్మదేవుని యెదుట సాక్షాత్కరించెను. (ఇచ్ఛామాత్రాః ప్రభోఃసృష్టిః, అను న్యాయమునే తలంచినంతలో నవతరించిన వేదరూపమగు నామునీంద్రుని జూచి విరించి యిట్లనియె.

శ్లో. విశేష ఖననాజ్జాత స్తస్మాత్త్వం విఖనాభవ.

తా. విశేషముగ నాలోచించుటచే పుట్టినవాడవుగావున విఖనుడవు కమ్మని నామకరణంబు గావించె (విఖనుడనగ) విః పక్షి పరమాత్మనోః, అని నిఘంటు వుండుట చేతవి శబ్దమునకు పరమాత్మ (బ్రహ్మమర్థము) ఖన, యనగ విచారము, బ్రహ్మవిచారము. విఖనశ్శబ్దమునకు బ్రహ్మవిదుడని యర్థము. బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి, అని ఉపనిషత్ప్రమాణ ముండుటచేత విఖనుడు, బ్రహ్మమయుడు అని భావము. ఇది మహర్షి పరమైన యర్థము.

## (౭) విఖనుడనగ.

## వేంకటేశ్వర సహస్ర నామము

## మధ్వాచార్యకృతభూషణాఖ్యటీక యందు

విం, బకాసుర సంజ్ఞకం పక్షిణం ఖనతి, విదార యతీతి విఖనః, కర్మణ్యాణ్, విః పక్షిపరమాత్మ నోరితి కోశః, తతః స్వార్థే ప్రజ్ఞా, ద్యణ్ విఖనసి చతుర్ముఖో జాతః, వరాహరూపేణ తద్ఘ్రాణత ఆవిర్భూతః, జాతార్థే ప్రతి ప్రసూతోऽణ్వాడిదితి టులోపః అను శతికా దిత్వా దుభయ పదవృద్ధిః, విఖనసార్థితో విశ్వగుప్తయే, ఇతి భాగవత టీకాయాం విఖన సాచతుర్ముఖేనేతి ఉక్తం, ఇతి ప్రాఞ్చః తత్ర అణః ప్రతి ప్రసూతత్వం కథమితి. చింత్యం. ప్రతి ప్రసూతత్వంహి అణ్బాధక బాధకత్వ మితిశేఖరే.

తా. వి. అనునది పక్షియందును పరమాత్మయందును వర్తించును. ఇచ్చట వి శబ్దము పక్షిపరము. పక్షియన బకాసురుడు. వానిని సంహరించినవాడు భగవంతుడు గావున నిచ్చట విఖనః అను శబ్దమునకు విష్ణుమూర్తి యని అర్థము. ఇదియే స్వార్థమునందు అణ్ ప్రత్యయుముచేసినచో అనుశతికాదులచే నుభయుపదవృద్ధి గలిగి వైఖానః అని చెప్పబడుచున్నది. వైఖాన స్సామగాయనః. అని భారతము.

ఆత్మ సంహిత.

శ్లో. మహాభూతేన యేనేదం, వ్యాప్తంవిఖనసాజగత్
తమేవ శరణంగచ్ఛ జగత్కారణ మచ్యుతం.

తా. మహాభూతమైన యేవిఖనసునిచే నీవిశ్వమంతయు వ్యాప్తమై యున్నదో అట్టి జగత్కారణుడైన యచ్యుతుని శరణు పొందుమని శతానందునితో శాండిల్యమహర్షి చెప్పుచున్నాడు. సహస్రనామా ధ్యాయములో

శ్లో. ఏకోవిష్ణు ర్మహాభూతః పృథగ్భూతాన్యనేకశః,
త్రీన్లోకాన్ వ్యాప్యభూతాత్మా భుజ్తే విశ్వభుగవ్యయః.

తా. విష్ణుడొక్కడే మహాభూతము. వేరైన భూతము లనేకములు కలవు. సర్వ భూతాత్మయైన విష్ణువు భుజించినచో విశ్వమంతయు భుజించినట్లుగా నెన్నవచ్చును. అని చెప్పుచున్నది. ఈ ప్రమాణములచే మహాభూతమనగ శ్రీమహావిష్ణువనియు ఆ విష్ణువు

విఖనస శబ్దవాచ్యుడనియు తెలియుచున్నది. గాన యిచ్చట విఖనుడనగ శ్రీమహావిష్ణువని యర్థము.

### (3) విఖనుడనగ.

### భాగవతటీకయందు.

శ్లో. నఖలుగోపి కానందనో భవా నఖిల దేహినా మంతరాత్మదృక్
విఖనసార్థితో విశ్వగుప్తయే సఖఉదేయివాన్ సాత్వతాంకులే.

తా. సఖా! నీవఖిల దేహులయొక్క అంతరాత్మ యందు చూడబడుచు, విఖనసునిచే (బ్రహ్మచే) కోరబడి ప్రపంచ సంరక్షణార్థమై సాత్వతకులమందు దయించిన శ్రీ మహావిష్ణుడవు గాని, గోపికానందనుడవు గావు సుమా! అని గోపికలు శ్రీకృష్ణ పరమాత్మను గానముచేయుచున్నారు. ఇందు విఖనః, అనుపదము చతుర్ముఖ పరముగా ప్రయోగింప బడినది గావున యిచ్చట విఖనుడనగ, బ్రహ్మదేవుడని యర్థము.

ఇట్లు సకల జగత్కారణుడైన శ్రీమహావిష్ణుండును, అతని నాభీకమల సంభూతుడయిన చతురాననుండును, వాని మనస్సంకల్ప సంభవుండైన యీ మహర్షియు విఖన శ్శబ్ద వాచ్యులై యొప్పిరని తెలియబడుచున్నది.

### ఈ మహర్షి జన్మప్రకారమును గురించి ఘటికాచల మాహాత్మ్యము. (3) ఆశ్వాసములో

సీ. అనఘనిరుక్తవే దాంగోక్తమైధర
బొగడొందునీకథ పుణ్యమగుచు
నంబుధీశ్వరునియా గంబునజలదద
యనెడునచ్చరజూడ నజానికపుడు
వీర్యంబుజారత ద్వీర్యం బితడు పర్ణ
పుటినుంచి వహ్నిలో బోయ నందు
నర్చియును భృగుండు నంగార పిండంబు
నందంగిరుండును నత్రిమునియు

గీ. విఖన సాంగత్యమున జేసి విఖనసుండు
బొడమి రా యన్వ యంబున బుట్టుగనిరి
వేదశాస్త్రార్థ నిరతులు విప్రవర్యు
లఖిల మంత్రతంత్రార్థరహస్యవిదులు.

క. పంచవిధబేర పూజా
చుంచువులై వారలెపుడు శుద్ధాత్మకులై
పంచాయుధ శోభితు నర
పంచాస్యుని గొలుచుచుంద్రు భాగ్యము కలిమిన్.

అనియున్నది. ఇందువలనను విఖనసమహాఋషి బ్రహ్మమానస పుత్ర
తెలియబడుచున్నది. భృగుమహర్షి తన నిరుక్తాధి కారంబున నిట్లు చెప్పియు

శ్లో. మదర్చనం వినా నాన్య న్మల్లోక ప్రాప్తయే ధృవం
ఇతి వేదాంత తత్వార్థ ఖననం కృతవాన్ హరిః
తస్మాద్వేదాంత సారోఽయం ముని రూపంసమాస్థితః
శుద్ధసత్వమయోయోగీ జటామకుటభూషణః
చతుర్బాహు సమాయుక్త శ్శంఖ చక్రధరః ప్రభుః
శిఖాయజ్ఞోపవీతాభ్యా మూర్ధ్వపుండ్ర ధరోఽవ్యయః
కమండలుఘటాభ్యాంవై త్రిదండేన విరాజితః
ప్రాదురాసీ న్మని శ్రేష్ఠః ప్రభాకరసమద్యుతిః

తా. నారాయణుండు నాలోక ప్రాప్తికి నాయర్చన, వినాగా మరియొక
వేదాంత తత్వార్థఖనన మొనరించె. అందువలన నావేదాంత
శుద్ధసత్వమయుండును యోగియు జటామకుట భూషణుండును. చతుర్
శంఖచక్రములు శిఖాయజ్ఞోపవీతములు ఊర్ధ్వపుండ్రములు కమండలము
త్రిదండము వీటితో గూడి సూర్యునితో సమానమయిన తేజస్సు గలిగి మునీం
యుద్భవించెను.

శ్లో. తంవీక్ష్యమానసాజ్జాతం పుత్రమౌరస మాదరాత్
నామ్నావిఖనసం చక్రే సహోవాచహరిస్స్వయం.

తా. శ్రీహరి తన మనస్సు వలన జన్మించినట్టి యౌరసపుత్రు నాదరముతో జూచి విఖనసుడని నామకరణము గావించి స్వయముగా నిట్లుపలికెను.

శ్లో. ఖనిత్వాచాత్మనాత్మానం జ్ఞానాది గుణసంయుతః
ధ్యానమావిశ్యయోగేన హ్యాసీద్విఖనసోమునిః.( భృగుః)

తా. ఆత్మచే నాత్మను ఖననము చేయగా జ్ఞానాది గుణములతో గూడి ధ్యానము ననుసరించి యోగముచేత నీవిఖనసుడు మునియయ్యెను. అని భృగువాక్యము. మరీచ్యత్రి కశ్యపులు గూడ నిట్టి రీతిగనే చెప్పియున్నారు. మరియు నీ మహర్షి పురాణముల యందు చతుర్ముఖునిచే సృజింపబడెననియు, సూత్రకర్తలైన భృగుమరీచ్యత్రి కశ్యపుల వలన శ్రీమహావిష్ణునిచే సృజింపబడెననియు చెప్పియున్నది. ఇందును గురించి సర్వతంత్ర స్వతంత్ర శ్రీవేంకటనాథ వేదాంత దేశికేంద్రులచే తనసజ్జన సంభవంబున.

విఖనా నామకశ్చిదృషిః సృష్ట్యాదౌ భగవచ్ఛాస్త్రా వతారణాయ పరమాత్మనాదిష్టేన సమష్టి పురుషేణ విశేష వేదఖననాత్మక వేదవేద్యధ్యానమయమనోవ్యాపార రూప తపసాఽవిర్భావితో విష్ణునుప్రవిష్ట బ్రహ్మణోమూర్త్యంతర భూతోమహర్షిః.

తా. విఖనసుడను నొక ఋషి సృష్ట్యాది యందు భగవచ్ఛాస్త్రము నుద్ధరించుట కొరకు పరమాత్మచే నిర్దేశింపబడిన సమష్టిపురుషుడగు బ్రహ్మచే విశేషముగా వేదవిచారణ చేతను వేదములచే తెలియదగిన ధ్యానమయమై మనో వ్యాపార రూపమగు తపస్సు చేత నావిర్భవించెననియు విష్ణును ప్రవిష్టుడగు బ్రహ్మయొక్క మూర్త్యంతర భూతుడనియు చెప్పియున్నారు. ఇందువలన శ్రీమహావిష్ణువు బ్రహ్మశరీరమందు ప్రవేశించి తన్నారాధించుటకు యొగ్యుడగు మహర్షిని సృజించెనని తెలియుచున్నది. మరీచి ప్రోక్తమైన యానందసంహితలో మదారాధనా ధురంధరుండగు మహర్షిని సృజింపుమని బ్రహ్మకాజ్ఞాపించినట్లును తానందులకు సమర్థుడను కానని వేడుకొనినట్లును. అప్పుడు విష్ణుండు స్వయముగానే విఖనసుని సృజించినట్టును చెప్పియున్నది. బ్రహ్మచే సృజింపబడిన వారిలో చతుర్భుజ శంఖచ్రక ధారులు గనుపించరు. ఈ మహర్షి చతుర్భుజ శంఖచక్ర

ధారియైనట్టు సూత్రకర్తల వాక్యములు కనుపించుచున్నవి. కాబట్టి శ్రీ మహావిష్ణువుచే తనే యీ మహర్షి సృజింపబడెనని నిస్సంశయముగ నొప్పుకొనవచ్చును. బ్రహ్మయందను ప్రవిష్టుడై విష్ణుడే సృజించెనని లోకసృష్టి విషయమై నిర్వివాదము గావున నీ మహర్షి బ్రహ్మచే సృజింపబడెననియు గొందరు విష్ణునిచే సృజింపబడెననియు చెప్పియున్నారు. కాబట్టి సచరాచర సృష్టి నిమిత్తమై సృజింపబడిన చతుర్ముఖుండు తనయందంతర్యామియై యున్న శ్రీ మహావిష్ణుని యనుగ్రహంబున విష్ణురూప ధరుండను విష్ణుపూజా ధురంధురుండును నగు శ్రీవిఖనస మహామునీంద్రుని సృజించెనని నిశ్చయార్థము.

**విష్ణుండు విఖనసునకు జాతకర్మాదు లొనరించుట.**

**మంగళాద్రి మాహాత్మ్యము**

**(౨౨) అధ్యాయము**

శ్లో. విశేషఖననాజ్జాతస్త స్మాస్త్వం విఖనాభవ
ఇత్యుక్త్వాతం మునివర మాత్మ పుత్రం పితామహః
దేవస్యపురతఃస్థాప్య ప్రోక్తవాన్ కమలాపతిం.

తా. పితామహుండు విశేషముగా నాలోచించుటచే జనించితివి గావున విఖనుడవుగమ్మని తన కుమారుడైన మునీంద్రునకు నామ ధేయంబుగావించి శ్రీహరియెదుట నిలిపి యిట్లనియె.

శ్లో. దేవదేవహరే విష్ణో సృష్టిస్థిత్యంత కారణ
త్వన్ని యోగేన సృష్టోకయం భగవన్మునిసత్తమః
మదంశాత్ సంభవో దేవ మత్సమస్తపసాంనిధిః

తా. సృష్టి స్థిత్యంత కారణుడవైన యోదేవా ! నీనియోగంబున నాయంశ సంభవుండును నాతో సమానుండును తపోనిధియునైన నీమునిసత్తముండు నాచే సృజింపబడెను.

శ్లో. ఇతివిజ్ఞాపితశ్శ్రీశో దృష్టవాన్విఖనోమునిం
అష్టాదశతుసంస్కారాన్ శ్రియాసహస్వయంహరిః
వేదాన్ వేదార్థమాదిశ్య మునిమాహజనార్దనః

మయానియుక్తోవిఖనః మదారాధనకృద్భవ
మామారాధ్యముని శ్రేష్ఠ మల్లోకే నివసిష్యసి
సూత్రంకురుమహాభాగ త్వన్నామ్నా యాజుషి శ్రుతౌ

ఔఖేయసూత్రం విఖ్యాతం భూలోకే విస్తరిష్యతి
భృగు ర్మరీచి రత్రిశ్చ కశ్యపశ్చతథైవచ
బ్రహ్మచర్యస్యవిఖన స్తవశిష్యా భవంతుతే
కశ్యపోఽత్రిర్భరద్వాజో విశ్వామిత్రోఽథగౌతమః
శ్లో. వసిష్ఠో జమదగ్నిశ్చ మునయశ్చతవానుగాః
సప్తైతే సూత్రకర్తారః తవ సూత్రానువర్తినః.

తా. ఇట్లా బ్రహ్మదేవుడు విజ్ఞాపనము చేసికొనగా శ్రీహరియాలకించి యావిఖనస మునీంద్రుని జూచినవాడై శ్రీమహాలక్ష్మితో గూడి స్వయముగా నామునీంద్రునకు జాతకర్మాది పదునెనిమిది సంస్కారములు గావించి వేద వేదార్థముల నుపదేశించి వానితో నిట్లనియె. ఓ విఖనసమునీ! నీవు నాచేనియమింపబడి నన్నారాధింపుము. నన్నారాధించి నాలోకమందు నివసింపగలవు. యజుర్వేదము ననుసరించి నీపేర బ్రఖ్యాతి నొందు సూత్రము రచింపుము. అదిలోకమందౌఖేయ (వైఖానస) సూత్రమనుపేరుచే విస్తరిల్లగలదు. భృగుమరీచ్యత్రి కశ్యపులు. బ్రహ్మచర్యవ్రతము సలుపుచు శిష్యులయ్యెదరు. కశ్యప, అత్రి, భరద్వాజ, విశ్వామిత్ర, గౌతమ, వసిష్ఠ, జమదగ్నులను సప్తఋషులు నీకు శిష్యులై నీ సూత్రము ననుసరించి సూత్రకర్తలయ్యెదరు. అని చెప్పెను.

## విష్ణుండు విఖనసుని తన్నారాధింప నియోగించుట

## బ్రహ్మాండ పురాణము

మరియు నోమునీంద్రా బ్రహ్మవిద్యా విశారదులైన అరుణకేతువాతరశనాది మునీంద్రులుగలరు. నీచేరచింపబడిన సూత్రోక్త విధి విధానార్చనయే నాకు మిగుల సంతోషదాయకము. నేనర్చారూపముగ భూలోకంబున భారతవర్షమున నదీనదవనపట్టణ పర్వతాదులయందంతట నవతరించి లోకంబులకు గలుగు దుర్భిక్షానావృష్టి రాజబాధాది యరిష్టశమనం బొనరించెద. నే నవతరించిన చోటుల నెల్ల నీ సూత్రానుష్ఠాతలే నన్నర్చించు

చుండవలయును. వారు నాయనుగ్రహపాత్రులై లోకోపకారం బొనరించి నాసాయుజ్య ప్రాప్తులయ్యెదరు. అని యానతిచ్చిన శ్రీహరి వాక్యము అమృతప్రాయములై కర్ణానంద దాయకంబులగుటయు నారాయణచరణారవిందంబులకు సాష్టాంగదండ ప్రణామంబు లాచరించి యావిఖనస మునిపుంగవుండిట్లనియె. ఓ దేవా! దీన దయానిధీ! నీవు సర్వజగత్కారణుండవు. సర్వేశ్వరుండవు. సృష్టిస్థితిలయ స్వరూపుడవు. సర్వాంతర్యామివి. సర్వలోకకర్తవు. నీమాహాత్మ్యమెరుంగను నీమాయా మోహితుడ గాకుండటకును నాకు శక్యంబుగానేరదు. నాపై నీ యారాధనా రూపకంబైన మహాభారంబు నిక్షిప్తంబుగావించు చుంటివి. ఇది యథావిధ్యుక్తంబుగా నెరవేర్చు కొనునంతటి సామర్థ్యంబు నాకుంగలదని యొప్పుకొనజాలను. ద్రవ్యవస్తు క్రియాలోపంబులు గలిగి యపరాధ దోషము సంప్రాప్త మగునను భయంబు నన్నుం గలచుచున్నది. నా సూత్రానుష్ఠాతలైన బ్రాహ్మణులందరు నీయర్చనాకార్య నిర్వాహకులై యుండ నియమించుచుంటివి. వారికే విధంబున భుక్తి ముక్తి శ్రేయః ప్రాప్తికాగలదో యెరింగింప బ్రార్థించుచుంటిని. భవత్సర్వ కాలికార్చనాపర తంత్రులైనవారికి ముక్త్యర్థ పర్యటనావశ్యంబు లేదుగాని భుక్త్యర్థమైన పర్యటనం బావశక్యము. సార్వకాలికార్చనా పరతంత్రులకు నన్యథా పర్యటనానురూపవ్యాపారంబుల కావంతయేని సావకాశంబు గానేరదు. వారలు నిజదారాపుత్రాది పోషణార్థమై యేమి చేయువలయు నానతీయ వలయునని గోరుటయు.

## విష్ణుండు విఖనసునకు వృత్త్యాదుల నిర్ణయించుట.

నావిష్ణుండా మునీంద్రుని వాక్యంబు లాలకించి వానికి సమాధాన పూర్వకంబుగా నిట్లనియే. ఓ విఖనస మునీంద్రా! బ్రాహ్మణ శ్రేష్ఠులైన నీ సూత్రానుష్ఠాతలకు శ్రుతిస్మృతీతి హాస పురాణాదులయందు మోక్షార్థము, మూడును, జీవనార్థము, మూడును, ప్రసిద్ధమైన వృత్తులు నియమింపబడి యున్నవి. అవి యేవియున, 1. యజనము. 2. యాజనము. 3. అధ్యయనము. 4. అధ్యాపనము. 5. దానము. 6. ప్రతిగ్రహము ఇందులో యజన, అధ్యయన, దానములు, మోక్షార్థములు. యాజన అధ్యాపన, ప్రతిగ్రహములు, జీవనార్థములు.

మోక్షార్థమైన వృత్తులెట్లన

1) యజనము, తాను మోక్ష ప్రదాతనైన నన్నారాధించుట.

2) అధ్యయనము, తాను వేదపారాయణ మొనరించుట.

3) దానము. తాను దానఫలప్రదాతనైన నాకు సమర్పణముగా సమస్తదానములు చేసికొనుట.

జీవనార్థమైన వృత్తులు.

1) యాజనము, ద్రవ్యము పుచ్చుకొని నన్నారాధించుట.

2) అధ్యాపనము, ద్రవ్యము పుచ్చుకొని వేదమితరులకు చెప్పుట.

3) ప్రతి గ్రహము పరులచే నీయబడిన దానధర్మాదులను స్వయముగా గాని మరియొకరి పరముగా గాని గ్రహించుట. ఇవి జీవనార్థమైన వృత్తులు. వీటిలో అధ్యాపన మందు వేదవిక్రయ దోషమును, ధనప్రతి గ్రహమందు స్వార్జిత శ్రేయఃక్షయంబును గలుగుచున్నవి. గావున నీ రెండింటిని పరిత్యజించి సకల శ్రేయోభివృద్ధి దాయకంబును భుక్తి ముక్తి ప్రదాయకంబును సర్వారిష్ట శమనంబును, సర్వపాప నివృత్తి కారకంబును నయిన మదీయ యాజకత్వ మవలంబింతురు గాత! లోకగురుడనైన నాకు పూజావిధి వలన సంతుష్టి గలుగుచున్నది. అందువలన పుణ్యము నశించదు. జీవనము జరుగును. అగ్నియు, అర్చనయు,నాకు రెండు ముఖములు. యజ్ఞాదిక్రతువులొనర్చి హోమము జేయు మాంసాదిహవిస్సు నగ్నిముఖముగాను, అన్నహవిస్సు నర్చాముఖముగాను భుజించెదను. అర్చనయు హోమమును వేదవిహితములగు మహాయజ్ఞములు. యీ యజ్ఞములయందు నాయర్చకులచే హోమము చేయబడిన హవిర్ద్రవ్యమును, ముఖద్వయముచే నేను గ్రహించుచున్నాను. వేదవేదాంగ పారంగులును, నీసూత్రానుష్ఠాతలను నయిన బ్రాహ్మణులందరు వేదవిధ్యుక్తముగ యజ్ఞభోక్తనైన నన్నర్చింప హోమము చేసి వేదవిహితమైన యజ్ఞమునకు జెప్పబడిన యాధ్వర దక్షిణ గ్రహించి యందు వలన జీవింతురు గాత! నిత్యపూజా విధి యందు వైష్ణవేష్టియందు జెప్పబడిన దక్షిణ రీతిగా ద్రవ్యము గ్రహించి యందువలన జీవింతురు గాత! పక్షోత్సవమునకు అగ్నిష్టోమ మహాయాగమునకు నిర్మింపబడిన రీతిగ దక్షిణ గ్రహించి జీవింతురు గాత! మాసోత్సవమునకు అతిరాత్రమును యజ్ఞమునకు విధింపబడిన రీతిగ దక్షిణ గ్రహించి

జీవింతురుగాత! వర్షోత్సవమునకు, మహాపుణ్యప్రదమైన వాజపేయయాగమునకు, నియామకమైన రీతిగ దక్షిణ స్వీకరించి జీవింతురు గాత! నాయొక్క బేర ప్రతిష్ఠా విధియందును, శ్రీభూదేవీ ప్రతిష్టల యందును, అశ్వమేధ యాగ విధ్యుక్త దక్షిణ రీతిగా ధనమును గ్రహించి జీవింతురు గాక! యజమానుల కాయా పూజావిధుల యందాయారీతిగా దక్షిణలు గ్రహించి, ఆయా యాగఫలముల నొసంగి వారలదరింప జేయుచుందురు గాత! యాగాదులవలె పూజయు గూడ నిది యొక మహాయాగము. ఇందు దక్షిణాగ్రహణము జనులు ముక్తికొరకే యని తెలియదగినది. యాగములయందు అధ్వర్యులకు దక్షిణ నీ యనివారికి ఫలితమెట్లు గలుగకుండునో, ఆ రీతిగనే యీ పూజా యాగమునందు గూడ దక్షిణ నీయనివారల కాయాఫలంబులు లభింపజాలవు. యాగాదులయందు దక్షిణాగ్రహణమెట్లు శ్రేయస్కరమును మోక్షప్రదమును, అగునో యిదియు గూడ నట్టిదియే యగును. మనుజులచే నా కొరకు నీయబడిన ద్రవ్యమునకు యజమానులు లేనియెడల నందు నాల్గవ భాగము, నాయర్చకు లనుభవింప వచ్చును. నిష్కామత్వముచే గాని సకామత్వముచేగాని, భక్తులవలన నీయబడిన ద్రవ్యమును గ్రహించి నిత్యము నన్నర్చించు వారు నాసాయుజ్య పదవినందగలరు. నాచేయనుగ్రహ పూర్వకముగా నీయబడిన ద్రవ్యమునకు దేవ ద్రవ్యమను నిషేధము లేదు. భక్తిచేతగాని, భయము చేతగాని, కోరిక చేతగాని, ద్రవ్యార్థము గాని, నన్ను పూజించిన వారు మోక్షము నొందుదురు. ద్రవ్యార్థమై యొక మనుజుని రాత్రింబవళ్ళు లాశ్రయించి భయాతురులగుచున్నారు. ఒక ఘడియ గృహమునందు నన్నారాధించి మోక్షప్రాప్తులగు చున్నారు. అట్టి విషయములో జీవనార్థము గాని మోక్షార్థము గాని, యెల్లకాలము నన్నర్చించువారు మోక్షమే పొందుదురు లోకములో నరుల నాశ్రయించి జీవించువారికి, యెల్లప్పుడును తా నాశ్రయించిన మనుజుల యందే దృష్టి గలిగి యే సమయమునందు వారల కనుగ్రహము గలిగి యే రూపకముగా నేమి యొసంగెదరో యనునాశచే సర్వకాల సర్వావస్థల యందును, వారల యందే నిలుపబడిన చిత్తములు గలవారలై యడుగులకు మడుగులొగ్గుచు, నింటసంధ్యాది స్వమతోచిత క్రియా కలాపములు నిర్వర్తించుట మాని యానరుల యందెట్లు బద్ధానురాగులై యుందురో, అట్టిరీతిగనే నన్నాశ్రయించి నావలన జీవింపదలంచిన వారలు, భయముచేతగాని, భక్తిచేతగాని, నాయందే యుంచబడిన చిత్తములు గల వారలయి మనోవాక్కాయ కర్మములచే జాగ్రత్స్వప్న సుషుప్త్యాద్యవ

స్థలయందు గూడ నన్నేదలంచు చుందురు. గావుననే నా యర్చకుల యింద్రియములు పరమపవిత్రములయి యుండగలవు. అందుచేతనే వారలకెట్టి దోషములును ఘటింపక కేవల పరమపవిత్రత గలిగి మోక్ష ప్రాప్తులయ్యెదరు. ఇట్టి యీరహస్యాభి ప్రాయముల నెరుంగ జాలక, కేవల మసూయా పరవశత్వముచే ద్రవ్యమునకై దేవుని పూజించుచుండిరని నా యర్చకుల నెవరు దూషింపరాదు. నా యర్చకులే నా భక్తులు. నా యర్చకులే నా శరీరము. వారినెవ్వరు నిందింతురో యానింద నాదిగా భావింపబడును. నాయర్చకుల నెవరు పూజింతురో ఆ పూజనాదిగా భావించి వారలకు మోక్షమిచ్చు చున్నాను. అన్నముగాని, వస్త్రముగాని, ధనముగాని, నాయర్చకుల కెవ్వరొసంగుదురో అవి నాకొరకీయబడినవిగా దలంచెద. నా పుణ్యము వటబీజమువలె వృద్ధి బొందును. నాయర్చకులకు మహాదానముల నెవ్వరిచ్చెదరో వారలకు కోటిగుణితముగా ఫల మొసంగుటయే గాక పరమ పదముగూడ నొసంగెదను. నా భక్తుల కందరకు నాయర్చక ముఖముగా సర్వామ్నాయ రహస్యములను జెప్పుచుందును. నాయర్చక ముఖముగా నామంత్రమెవ్వరు గ్రహింతురో వారికి శీఘ్రముగా మంత్రసిద్ధియు మోక్షమును గలుగుచున్నది. నాయర్చన యందు శిలాబుద్ధియు, నాయర్చకుని యందు, సాధారణ మనుష్యభావమును నియమించి యెవరు వర్తింతురో అట్టివారు పాషండు లగుదురు. విస్తరించి చెప్పుటయేల ఓ విఖనసమునీ! నీ రూపమే నారూపము, నా రూపమే నీ రూపము. మన కిర్వురకును భేదము లేదు. నీ సూత్రానుష్ఠాత లందరు నాయంశ సంభూతులుగా నెరుంగుము అని యుపదేశించి చతుర్ముఖుం జూచి యతనితో నాహరి యిట్లనియె.

**విష్ణుండు బ్రహ్మకు వైష్ణవ ధర్మంబులు చెప్పుట.**

ఓ పద్మసంభవా! బాహ్యమనియు, అభ్యంతరమనియు, నా భక్తులయిన వైష్ణవ లక్షణంబులు రెండు విధములు. అందు, లలాటమందు ఛిద్రయుక్తముగా శ్వేత మృత్తికచే ఊర్ధ్వ పుండ్రధారణము చేయుట. భుజములయందు వగైరా ధారణ చేసికొనుట, నామంత్రముచ్చరించుట, నాకు నమస్కరించుట, నన్ను స్తుతించుట, నా భక్తులను పూజించుట, నాపాదపద్మముల నెల్లప్పుడు పూజించుట, స్మరదోషాదులు వర్జించుట, సర్వభూతములయందు దయగల్గుట, సర్వము సమముగా జూచుట, సర్వసంపూర్ణుడును, జగమే శరీరముగా గల నా నామస్మరణము చేయుట, నామంత్రార్థము

నెరుంగుట, యిట్టివినాభక్తులగు వైష్ణవుల బాహ్యలక్షణమని యెరుంగుము. సర్వదా నా నామస్మరణమంత రంగమున జేయుచుండుటయే ముఖ్యమైనది. మనోవాక్కాయ కర్మములచే నిరంతర చింతనము, నాయర్చకులకే గాని యితరులకు లభింపదు.

శ్వేతమృత్తికా మహిమ-

అని చెప్పిన భగవంతుని జూచి బ్రహ్మ కరకమలంబులు మొగిడ్చి, ఓ దేవా! శ్వేత మృత్పుండ్ర ధారణము వైష్ణవ లక్షణములలో మొదటిదిగా చెప్పితివి. మృత్తిక పీతరక్తాది వర్ణములు గలదిగా నున్నది. దీనిలో శ్వేతమృత్తిక యందుగల మహిమ నా కెరింగింపుమని కోరుటయు నారాయణుండిట్లనియె. పూర్వమందొక నాడులోక సృష్టి రక్షణాదులను గురించి శ్వేత ద్వీపమునకు బోయి యచ్చట బ్రవేశించు వరకు నాకు లోక సృష్టి యందుగాని, రక్షణ మందుగాని, విలాసమందు గాని స్వానందాను భవంబు నందుగాని, లేశమైనను బ్రీతిజనింపకుండినప్పుడు వైరాగ్య కారణ మాశ్వేత మృత్తికగా దలంచి యిది శ్వేత మృద్వీపమని యెరింగి, యీమృత్తికాధారణముచే నా భక్తులకు సుకరంబుగా మోక్ష సంప్రాప్తము కాగలదని తలంచి గరుడునిపై యీమృత్తికనుంచి, భారతవర్షములో నచ్చట నచ్చట నదులు పుణ్యస్థలములు తీర్థములు క్షేత్రములు మొదలయిన పుణ్యస్థలముల యందును వేయించితిని. నేనును శ్వేతమృత్పుండ్రమునే ధరించితి. నీరహస్యమెరింగి యీ శ్వేత మృత్పుండ్ర ధారణము చేసినవారు మోక్షము నొందుదురు గాన నీవిఖనసమునియు నీవు నూర్ధ్వపుండ్రమును శ్వేతమృత్తికచే ధరించి నాచే మంత్రదీక్ష పొంది మంత్రద్వయ గ్రహణ మొనరింప వలయును అని చెప్పిన విని బ్రహ్మకృతకృత్యుడ నైతినని సంతసించె. ననంతర మా నారాయణ దేవు డాచతుర్ముఖునకును విఖనసునకును మంత్ర విధిదీరిచి ద్వయ మంత్రమూల మంత్రములను వేదమును వైఖానస నామప్రతి పాదకమైన సర్వవేదసముదాయము నుపదేశించె. పిమ్మట నా చతుర్ముఖుం డా నారాయణదేవుని వేద వేదాంతములచే స్తుతించి, తాను జేయువలసిన సృష్టి క్రియాకలాప నివృత్తికై సత్యలోకంబునకు బోయెను. అనంతర మాయబ్జభవుండఖిల లోకములను స్వాయంభువాది మనువులను, సృజించి స్వాయంభువ మనువుం జూచి నీవు భూలోకంబున కేగి, ప్రజావృద్ధి జేయు మన నతండు జలా క్రాంతమై భూమిగాన

రాకుండుటచే నివాసంబునకు స్థలంబుగాన బ్రహ్మకుంజెప్ప నతండు హరిం బ్రార్థించె. నాహరి వరాహరూపము ధరించి, భూమిని రసాతలంబునుండి యుద్ధరించి. అప్పటికి, జరుగుచున్న కార్తీకమాసంబున శుద్ధనవమీ దివసంబున కృతమును ద్వాదశీదివసంబున ప్రజాభివృద్ధిజేయుటకు, స్వాయంభువ మనువును భూలోక మలంకరించిరి.

## మహర్షుల జన్మ ప్రకారము మత్స్యపురాణం (3) అధ్యాయం

శ్లో. వేదాభ్యాస రతస్యాస్య ప్రజాకామస్య మానసాత్
మనసః పూర్వసృష్టావై జాతాస్తేనైవ మానసాః
మరీచిరభవత్పూర్వం తతోఽత్రిర్భగవాన్ ఋషిః
అంగిరాశ్చాభవత్పశ్చా త్పులస్త్యస్తదనంతరమ్
తతఃపులహనామావై తతఃక్రతురజాయత
ప్రచేతాశ్చతతఃపుత్రో వసిష్ఠశ్చాభవత్పునః
పుత్రోభృగురభూత్తత్ర నారదోఽపి చిరాదభూత్
దశైతాన్ మానసాన్ పుత్రాన్ జీవపుత్రానజీజనత్.

తా. ప్రజాకాముడై వేదాభ్యాసము చేయుచున్న బ్రహ్మమానసము నుండి, మరీచి, అత్రి, అంగిరస, పులస్త్య, పులహ, క్రతు, ప్రచేతస, వసిష్ఠ, భృగు, నారద, అనునీపదుగురు జీవపుత్రులుదయించిరి.

శ్లో. తత్పుత్రానథవక్ష్యామి హ్యాత్మహీనాన్ప్రజాపతేః
అంగుష్ఠాద్దక్షిణాద్దక్షః ప్రజాపతిరజాయత.

తా. ఆ బ్రహ్మ యొక్క దక్షిణాంగుష్ఠము నుండి దక్షప్రజాపతి యుదయించెను.

భారతము అనుశాసన పర్వము అ. 132.

శ్లో. మరీచేః కశ్యపోహ్య భూత్.

తా. మరీచి మహర్షి వలన కశ్యపుడు జన్మించెను. అని యున్నది. బ్రహ్మనారాయణుని యొద్ద శెలవుగైకొని సత్యలోకంబునకు బోయి లోకాభి వృద్ధికొరకు తన మానసము నుండి పైన జెప్పిన మహర్షులను సృజించెను.

**విఖనసమహర్షి బదరీవనంబునకు వేంచేయుట.**

**బ్రహ్మాండ పురాణము. అ.వి. 2 అధ్యాయము.**

శ్లో. విఖనాశ్చమునిశ్రేష్ఠో భగవంతం ప్రపూజ్యచ
స్తుత్వాప్రణమ్యానుజ్ఞాతో బదరీమాయయౌముదా.

అనియు, మంగళాద్రిమహాత్మ్యము. అ. 22.

శ్లో. గోవిందేన సమాజ్ఞాతో విఖనాశిరసావహన్
రమానాథం సమభ్యర్చ్య బదరీవనమాయయౌ.

అని యున్నది. ఇందుచే విఖనసమహర్షి నారాయణు నర్చించి వారిచే ననుజ్ఞవడసి బదరీవనమునకు వచ్చెనని తెలియుచున్నది.

**ఆనందసంహిత 17, అధ్యాయము.**

శ్లో. స్వాయంభువ మనోఃకాలే యుగాదౌశుక్లవత్సరే
శ్రవణే శ్రావణే శుక్ల పౌర్ణమ్యామిందువాసరే
సింహలగ్నేచ సంయుక్తే విఖనాః ప్రాపనైమిశం.

తా. స్వాయంభువమనువు కాలమందు కృతయుగమున శుక్ల సంవత్సర శ్రావణశుద్ధ పూర్ణిమా సోమవారమున సింహలగ్నమందు విఖనసమహర్షి నైమిశారణ్యమునకు వచ్చెను. అని యున్నది. ఇట్లు ద్వివిధముగా నుండుటచే నిందు నెయ్యది నిశ్చయమైనది నిర్ణయింపరాకున్నది. బదరీవనమునకు వచ్చెనా నైమిశారణ్యమునకు వచ్చెనా ఇవి రెండు నొక్కటియేనా అని సంశయము గలుగుచున్నది.

**దేవీ భాగవతము, 1. అధ్యాయములో**

మహర్షులు కలిభయముచే బ్రహ్మను ప్రార్థించినట్లును, అతడు మానసికమగు చక్రమిచ్చి యాచక్రమెచ్చట శిథిలమగునో యచ్చట కలిభయముండదనియు, నివసింపవచ్చు ననియు, చెప్పినట్లును, దానిని గ్రహించి యామునులు దేశసంచారము చేయుచుండగా నదియచ్చోట శిథిలమైనట్లును, అనేమి యచ్చట శిథిలమగుటచే యా

ప్రదేశమునకు నైమిశమని పేరు వచ్చినట్టును అది యరణ్య ప్రదేశమునకు నైమిశమని పేరువచ్చినట్టును అది యరణ్య ప్రదేశమగుటచే నైమిశారణ్యమని చెప్పబడుచున్నట్టును గలదు. విఖసన మహర్షి యానంద సంహితను బట్టి నైమిశారణ్యమునకును బ్రహ్మాండాది పురాణములను బట్టి బదరీవనమునకు వచ్చినట్టును కనుపించు చున్నది. లోకసంరక్షణార్థమైన భగవ దవతారములలో ప్రప్రథమము నరనారాయణావతారము, అట్టి స్థలము బదరీవనమనియు బదరికాశ్రమమనియు, బదరీనారాయణ మనియు, భారతాదులవలన దెలియుచున్నది. ఆనందసంహితలో నీవు నైమిశారణ్యము బ్రవేశింపుము. నేనచ్చట నరనారాయణ ఋషినై యవతరించెదనని విష్ణుండు విఖనసునితో చెప్పుచున్నాడు. ఈ కారణములచే యావనంబునకు నైమిశారణ్యమనియు అందు నరనారాయణులవతరించిన స్థలము బదరీవృక్షములచే నిండి యున్న ప్రదేశమగుటచేనది బదరీవనమని చెప్పు చుండిరనియు బదరీవనము నైమిశారణ్యములో నొక భాగమనియు, అందువలన విఖనస ఋషినైమిశారణ్యమునకు వచ్చెనని కొందరును, బదరీవనమునకు వచ్చెనని కొందరు చెప్పుచుండిరనియు, యెట్లు చెప్పినను ప్రదేశము మాత్ర మొక్కటియే యనియు నా నమ్మకము.

## బదరీవనమాహాత్మ్యము

శ్లో. కణ్వాశ్రమంసమారభ్య యావన్నందగిరీభవేత్
తావత్ క్షేత్రంపరంపుణ్యం భుక్తిముక్తి ప్రదాయకం
యేతత్రవాసినోలోకా బదర్యాశ్రమమండలే
విష్ణురూపధరాస్సర్వే భవంతివరవర్ణినీ.

తా. కణ్వాశ్రమము మొదలు నందగిరి వరకు భుక్తి ముక్తి ప్రదాయకమైన బదరీక్షేత్రంబు గలదనియు, ఆ బదరీ వనవాసులందరు విష్ణు రూపధారులనియు, వసిష్ఠుడరుంధతితో చెప్పుచున్నాడు. కావున కణ్వాశ్రమము మొదలు నందగిరి వరకు వ్యాపించి దేవభూలోకంబులకు మధ్యస్థమైన నైమిశారణ్యములో నొక భాగమైన బదరీవనంబునకు భగవదనుజ్ఞాపురస్సరులగు శ్రీవిఖనస మహామునీంద్రులు శ్రీవైకుంఠనగరంబునుండి స్వాయంభువ మనువుకాలమందు శుక్ల సంవత్సర శ్రావణ శుద్ధ పూర్ణిమా సోమవాసరంబున శ్రవణనక్షత్ర సింహలగ్నమందుద్భవించిరని తెలియనగును

స్వాయంభువమనువు కార్తీకశుద్ధ ద్వాదశి రోజున భూలోకమునకు వచ్చినట్లు మాత్రమే చెప్పి వత్సర నిర్దేశములో గడచేయబడలేదు. దీనిని బట్టి విఖనస ఋషికంటె స్వాయంభువ మనువు ముందు వచ్చినవాడు గావున విఖనసునకు ముందు ప్రభవ సంవత్సరము గాని విభవ సంవత్సరము గాని కార్తీకశుద్ధ ద్వాదశియందు మనువును శుక్లసంవత్సరం, శ్రావణ శుద్ధ పూర్ణిమ విఖనస మునీంద్రులును భూలోకమలంకరించిరని స్పష్టముగా చెప్పవచ్చును. స్వాయంభువ మనువు భూలోకమునకు వచ్చినది మొదలు ఇంతవరకు జరిగిన మన్వంతరయుగ ప్రమాణవత్సరాది వివరము.

కృతయుగ ప్రమాణము.

17,28000 పదియేడు లక్షల యిరువది యెనిమిది వేలు.

త్రేతాయుగ ప్రమాణము.

12,96000 పంద్రెండులక్షల తొంబది యారువేలు,

ద్వాపరయుగ ప్రమాణము.

8,64,000 యెనిమిది లక్షల ఆరువది నాలుగు వేలు.

కలియుగ ప్రమాణము.

4,32,000 నాలుగు లక్షల ముప్పది రెండు వేలు.

వెరశి 43,20000 నలువది మూడులక్షల యిరువది వేలు.

ఈ మొత్తం మొక మహాయుగమనబడును. ఇట్టి మహాయుగములు డెబ్బది యొక్కటి జరిగిన నొక మన్వంతరము. ఇట్టి మన్వంతరము లీవర కారుగతించినవి. మహాసంకల్పము సప్తమే వైవస్వత మన్వంతరే అష్టావింశతతితమే మహాయుగే కలియుగే అని యుండుటచే, యేడవదియైన వైవస్వతమన్వంతరములో నిరువది యెనిమిదవ మహాయుగములో కలియుగము జరుగుచున్నది. గాన స్వాయంభువ మనువు భూలోకమలంకరించినది మొదలు జరిగిన సంవత్సర పరిమితమే యీ మహాఋషికాలనిర్ణయమని తోచుచున్నది. ఇట్లు విఖనస ముని శ్రీ వైకుంఠ భువనంబు నుండి భూలోకంబున నైమిశారణ్యములో బదరీవనంబునకు వచ్చి గంగాతీరంబునం దుశాసనాసీనులై భగవదుపదేశితాష్టాక్షరీ మహామంత్రాను సంధాన మొనరించుచుండిరి. అది యెట్లనిన.

## అష్టాక్షర మంత్రార్ధ వివరణము

## ఓన్నమోనారాయణాయ.

ప్రణవ స్వరూపము అకార ఉకార మకార ఇతి. అకార ఉకార మకారములు గలసి, ఓం అను అక్షరమైనది. ఓమిత్యే కాక్షరం బ్రహ్మ. ఓం అనునట్టి యక్షరమొకటియె బ్రహ్మము. ఇదియే ఋగ్యజుస్సామమములు సత్వరజస్తమోగుణములు. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు అధిదేవతలుగా గలదియునయినది. మరియు

శ్లో. అకారార్థో విష్ణు ర్జగదుదయ రక్షాప్రళయకృ
న్మకారార్థో జీవస్త దుపకరణం వైష్ణవమిదం
ఉకారోకనన్యార్హం నియమయతి సంబంధమనయో
స్త్రయీసారస్త్ర్యాత్మా ప్రణవ ఇమమర్థం సమదిశత్.

తా. అకారమే సృష్టిస్థితి లయాధికారియైన శ్రీమహా విష్ణువనియు, మకారమే, ఆ విష్ణువున కుపకరణమైన జీవుడనియు, నిదియే వైష్ణవమనియు జెప్పుచున్నది. ఉకార మనన్యార్హమై జీవేశ్వర సంబంధము నియమించు చున్నది. ఈ మూడింటి సారమే ప్రణవము (ఓం) అయీయర్థము తెలియజేయుచున్నది. అని చెప్పుటచే (ఓం) అను ప్రణవము. మహావిష్ణు స్వరూపమని తెలియుచున్నది.

శ్లో. నారశబ్దేన జీవానాం సమూహః ప్రోచ్యతేబుధైః
తేషామయనభూతత్వా న్నారాయణ ఇహోచ్యతే.

తా. నారములన జీవసమూహములనియు, వాటి కాధారమైన వాడు కావున నారాయణుడని చెప్పబడు చుండెననియు విద్వాంసులు వక్కాణింతురు, అనుటచే సర్వజీవులకు ఆధారమైనవాడు గావున నారాయణుడను నామధేయము గలవాడయ్యెను. ఇది ఆంతర్యార్థము.

శ్లో. ఆపోనారాఇతిప్రోక్తా ఆపోవైనరసూనవః
యాదస్యాయనం పూర్వం తేననారాయణస్స్మృతః

తా. ఉదకములు నారములని చెప్పబడుచుండెను. ఆయుదకములే స్థానముగా గలవాడు (జలశాయి) గావున నారాయణుడను నామధేయము గలవాడయ్యెను. అని

బాహ్యార్థము. నమః సంపత్తిహేతవః అను వాక్యముచే నమః అనుపదము సర్వసంపత్సమృద్ధి దాయకము. (మహాలక్ష్మి సూచకము) గావున మహాలక్ష్మి సమేతుడును సర్వజీవాధారుడును నగు శ్రీ మహావిష్ణువు కొరకు నమస్కరించుచుంటినని యభిప్రాయము. అష్టాక్షరి యనగా అవరక్షణే అనుధాతువును బట్టి అక్షర, అనగా నాశరహితమైనదనియు, యెనిమిది యక్షరములు గలది యనియు, అకుంఠిత సంరక్షకమైనదనియు భావము.

ద్వయమంత్రార్థవివరణము

1) శ్రీ మన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే.

2) శ్రీమతేనారాయణాయనమః

3) శ్రీ మహాలక్ష్మి సమేతుడైన నారాయణుని పాదములను శరణం పొందితి ననుటచే శరణాగతుడ నయితినని భగవత్ప్రపత్తి ప్రతిపాదిత మగుచున్నది.

2) మహాలక్ష్మి సమేతుడైన నారాయణుని కొరకు నమస్కారము. అనుటచే నమస్కృతి సర్వక్రియా సమర్పణానంతర మొనరించునది గావున నిందువలన సర్వసమర్పణ ప్రతిపాదితమగుచున్నది. ఈ రెండు విషయములు నిందువలన సూచింపబడు చుండుటచే నిది ద్వయమంత్రమని చెప్పబడుచున్నది.

## చరమశ్లోకార్థ వివరణము

శ్లో. సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకంశరణంవ్రజ
అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః

తా. సర్వధర్మములను పరిత్యజించి ముఖ్యుడనయిన నన్ను శరణుపొందుము. నేను నిన్ను సర్వపాపముల నుండి విడిపించు చున్నాను. అని భగవద్వాక్యము.

సర్వధర్మములను పరిత్యజించి యనగా భగవదారాధన స్నానదాన తపోధర్మాదులను విడిచి యని కొందరు చెప్పుదురు. ఇట్లు చెప్పినచో గీతాదులయందు చెప్పబడిన, (మద్యాజీమాం నమస్కురు) అను నీ మొదలగు భగవద్వాక్యములకు విరోధము సంభవించునుగాన ఆశ్రమ ధర్మములు సక్రమముగా నడిపించు కొనుచు

తీర్థయాత్రాదాన ధర్మాదులొనరించుచు వాటి ఫలప్రాప్తి రూపములైన ధర్మములను మాత్ర మాసించక నా ధర్మములయందలి ఫలము నాకు సమర్పించి నన్ను శరణు పొందుమనియు, నా కర్మ ఫలప్రాప్యములయిన ఫలములకు నిన్ను నేను సర్వపాపముల నుండి విడిపించి యనన్యసాధారణమైన నాపరమపదము నొసంగెదనియు, భగవదభిప్రాయమని యెరుంగ నగును. బదరీవనంబున విఖనసఋషి అష్టాక్షర మంత్రాను సంధానము చేయుగా.

(విఖనస ఋషి సూత్రమురచించుట.)

గౌతమాన్వయ సంభూత సంజీవాచార్యయజ్వకృత

శ్రీ వైఖానసాహ్నికే.

శ్రీమన్నారాయణోపదిష్టాక్షర మంత్రం నిరంతరమను సంధత శ్రీ విఖనోమునేర్ముఖా దావిర్భూతం అష్టాక్షర మంత్రవర్ణాష్టక పరిణామరూపం మంత్ర ప్రశ్నాష్టకం విజయతే తరాం.

తథాచరమశ్లోక మనుసంధత శ్రీవిఖనోమునే ర్ముఖాదా విర్భూతం చరమ శ్లోక వర్ణ పరిణామ రూపం ద్వాత్రింశ త్ప్రశ్నాత్మకం శ్రీ వైఖానస సూత్రం మంత్ర ప్రశ్నాంతర్గత మంత్ర వినియోగ బోధకం విజయ తేతమాం.

తా. నారాయణునిచే యుపదేశింపబడిన అష్టాక్షరీ మంత్రము నెల్లప్పుడు ననుసంధానము చేయుచున్న శ్రీ విఖనస మహామునీంద్రుల వారి ముఖము నుండి అష్టాక్షర మంత్ర వర్ణాష్టక పరిణామ రూపములైన యెనిమిది మంత్ర ప్రశ్నము లుద్భవించినవి. తరువాత చరమ శ్లోకాను సంధాన మొనరించుచున్న శ్రీ విఖనసమునీంద్రుల వారి ముఖము నుండి, చరమ శ్లోక వర్ణపరిణామ రూపములైన ముప్పది రెండు ప్రశ్నములతో గూడి మంత్ర ప్రశ్నముల యందు గల మంత్ర వినియోగములను బోధించుచు వైఖానస సూత్ర ముద్భవించినది. అని యున్నది.

(ఆనంద సంహితలో)

శ్లో. వైఖానసేనమునినా ద్వాత్రింశ త్ప్రశ్న సంఖ్యయా
నిషేకాది స్మశానాంతం మానుషంకర్మసూచితం.

తా. వైఖానసమునిచే ముప్పది రెండు ప్రశ్నములుగా నిషేకాద్యామరణాంత చత్వారింశ త్సంస్కారాత్మకమైన మానుషకర్మసూచింపబడినది. (యెవ్వియన)

1. ఋతుసంగమనము 2. గర్భాధానము 3. పుంసవనము, 4. సీమంతము, 5. విష్ణుబలి, 6. జాతకర్మ, 7. ఉత్థానము, 8. నామకరణము, 9. అన్నప్రాశనము, 10. ప్రవాసాగమనము, 11. పిండవర్ధనము, 12. చౌళము, 13. ఉపనయనము, 14. పారాయణవ్రతము, 15. బంధవిసర్గము, 16. ఉపాకర్మ, 17. సమావర్తన, 18. పాణిగ్రహణము. అని 18. శారీరసంస్కారములును. 7 పాకయజ్ఞములు, 7 హవిర్యజ్ఞములు, 7 సోమయజ్ఞములు, మొత్తము 21 యజ్ఞములున్ను కలిసి శారీర సంస్కారములు 39 యను చరమకాండతో గూడి 40 సంస్కారములు గల శారీర సూత్రమును శ్రీవిఖనస మునీంద్రులు రచించిరి. అందు (ఓం నమోవిష్ణవే). అని యారు యక్షరములు గల విష్ణుమూర్తి మంత్రము ననుసరించి యారు వేద వ్రతములు సూచింపబడినవి. 1. ప్రాజాపత్యము, 2. సౌమ్యవ్రతము, 3. ఆగ్నేయ వ్రతము, 4. వైశ్వదేవవ్రతము, 5. బ్రహ్మవ్రతము, 6. శుక్రీయవ్రతము, యీ వ్రతబంధ విసర్గముల యందాహుతులు గూడా నారుగలవు. ఆయాహుతులకు 1. ధాతాదధాతు, 2. సదసస్పతి అనుమంత్ర ద్వయముతో గూడి యెనిమిది మంత్రములగుచున్నవి. అందువలన శ్రీమన్నారాయణ మూలమంత్రమున కష్టాక్షరత్వము సూచించుచు వైష్ణవత్వసిద్ధి ప్రతిపాదక మగుచున్నది. మరియు వైష్ణవ మంత్రములచే హోమము గావించి పాయసమందు శంఖచక్రములచే నంకనము గావించి యాపాయసమును అష్టమమాస గర్భవతి యగు భార్యచే ప్రాశనము చేయించవలయుననియు, అందువలన గర్భస్థ మైన శిశువునకు వైష్ణవత్వసిద్ధి గలుగుననియు, నారాయణుడా గర్భస్థ శిశువునకు స్వయముగా తనముద్రా ధారణము గావించుననియు నిదియే గర్భవైష్ణవత్వ ప్రాప్తి సాధనమనియు విధింపబడియున్నది. ఇట్లు వైష్ణవత్వ సిద్ధిగల వైఖానసులకు నారాయణుడే స్వయముగా ముద్రా ధారకుడును, గురువును అగుచుండెనని చెప్పియున్నది. యెట్లన.

శ్లో. మద్భక్తియుక్తస్య మదౌరసస్య నిషేకకర్మాది విరాజితస్య
వైఖానసస్యాస్య నతప్తముద్రాన మంత్రదీక్షాన గురుర్మయావినా.
అనియున్నది. ఇది శారీర విషయము.

ఇక దైవికము. ఆనంద సంహితలో

శ్లో. సూత్రంవిఖనసాప్రోక్తం సార్ధకోటి ప్రమాణకం
కర్షణాద్యుత్స వాంతంచ దైవికం తేనసూచితం.

తా. విఖనసునిచే చెప్పబడిన సూత్రము కోటియేబది లక్షలు ప్రమాణము గలిగి దానిచే దైవికము సూచింపబడినది. అనగా శారీర సంస్కార ప్రతిపాదకమైన సూత్రము ముప్పది రెండు ప్రశ్నములనియు దైవిక ప్రతిపాదకమైన సూత్రము కోటి యేబది లక్షలనియు తెలియుచున్నది. దైవికము నందు కర్షణాద్యుత్స వాంతము శ్రీమన్నారాయణుని యాలయగోపుర ప్రాకారమంటపోత్సవ బింబప్రతిష్ఠాదుల విధానములును, విగ్రహశోధనార్చక ప్రతిష్ఠ అర్చనావిధానంబులును, మానసాత్మాలయ గృహార్చనలను చతుర్విధార్చనా ప్రకరణంబులును వ్యతిరేకార్చనా విపరీతోద్భవములును వాటి యుపశాంతులు మొదలగు దైవిక తంత్రమంతయు సర్వస్వతంత్ర విధానంబుగా రచించిరి.

**శ్రీవిఖనసునకు భృగుమరీచ్యత్రి కశ్యపులు శిష్యులగుట.**

అటు పిమ్మట శ్రీవిఖనస మునీంద్రులా బదరీవనంబునం దపోనిష్ఠా గరిష్ఠులై యుండగా చతుర్ముఖు ఆదేశంబున భగవచ్ఛాస్త్రా వతరణంబునకై బ్రహ్మమానవస పుత్రులయిన భృగుమరీచ్యత్రి కశ్యపులను నలుగురు మునీంద్రులు భూలోకంబునకు వచ్చి సూత్రకర్తలును, భగవచ్ఛాస్త్రావతరణులును నైన శ్రీవిఖనస మునీంద్రుల దర్శించి, వారి యనుగ్రహంము వడసి, శిష్యత్వ ప్రాప్తికై యాచించి వారివలన యంగీకృతి నొంది భగవచ్ఛాస్త్ర మభ్యసించిరి. పిమ్మట.

శ్లో. సూత్రం విఖనసా ప్రోక్తం సార్ధకోటి ప్రమాణకం
కర్షణాద్యుత్స వాంతంచ దైవికం తేన సూచితం
గురోర్ముఖాచ్చ సంగృహ్య తత్సర్వం సముదాహృతం
కాశ్యపే నాత్రిణాచైవ మయాచ భృగుణాతదా
చతుర్లక్ష ప్రమాణేన సంక్షిప్య ప్రోచ్యతేఽధునా.

తా. కోటి యేబది లక్షల ప్రమాణము గలిగి దైవికము కర్షణా ద్యుత్సవాంతము చెప్పబడిన విఖనస సూత్రమును గురుముఖముగా గ్రహించి కశ్యపుని చేతను అత్రి భృగువుల చేతను నా చేతను నాల్గు లక్షల ప్రమాణమున సంక్షేపించి చెప్పబడినది. అని మరీచి మహర్షి వాక్యము.

కాబట్టి విఖనసునిచే చెప్పబడిన దైవికమును గ్రంధవిస్తర భీతి చేత భృగ్వాదులు సంక్షేప మొనరించిరని తెలియుచున్నది. అది యెట్లన. జయ, ఆనంద, సంజ్ఞాన, వీర, విజయ, విజిత, విమల కల్పములను నెనిమిది సంహితలుగ ఒక లక్ష యెనుబది నాలుగు వేల గ్రంథము మరీచి మహర్షియు, ఖిల,ఖిలాధికార, పురాధికరణ, వాసాధికరణ, అర్చాధికరణ, మానాధికరణ, క్రియాధికరణ, నిరుక్త, ప్రకీర్ణ, యజ్ఞాధికరణములన పది సంహితలుగా నరువది నాల్గువేల గ్రంధము భృగు మహర్షియు, పూర్వతంత్ర, విష్ణుతంత్ర, ఉత్తర తంత్ర, మహాతంత్రము నాలుగు తంత్రములుగా యెనుబది యెనిమిది వేల గ్రంథము అత్రి మహర్షియు, సత్యకాండ, కర్మకాండ, జ్ఞాన కాండములను మూడు కాండములుగా నరువది నాలుగు వేల గ్రంథము కశ్యప మహర్షియు, సంక్షేప మొనరించిరి. గావున శ్రీవైఖానస భగవచ్ఛాస్త్రము పంచవింశతి సంహితలుగా నాల్గు లక్షల గ్రంథమని విశదమగుచున్నది.

బదరీవన మాహాత్మ్యము. 2. అ.

102. శ్లో. తతఃక్రోశద్వయే దేవి వైఖానస మునిస్థలం
యజ్ఞభూమిశ్చ తత్రైవ తేషాం మునివరాత్మనాం.
నదీనాం ప్రవరాతత్ర మహాపాతకనాశనీ
హోతృస్థానే మునీనాంతు శృణు ప్రత్యయలక్షణం.
అధ్యాసితయజ్ఞ భూమౌ యవాదగ్ధాస్తిలాస్తథా
అంగారాశ్చాపిదృశ్యం తేహోతృస్థానేమహాత్మనాం. అనియు.

150. శ్లో. వైఖానసం పరంతీర్థం మహాపాప నివారణం
స్నాత్వా ఫలాది భక్షోऽత్ర జయేన్మృత్యుం ద్వివత్సరాత్.

తా. ఇంతకు పూర్వము గంగాబిందుమతీ సరోవరములను జెప్పియున్నారు గాన, అటు తరువాత అనగా బదరీవనంబున బిందు సరోవరంబునకు రెండు క్రోసులలో వైఖానస మునీంద్రుల నివాస స్థలములును, వారు యజ్ఞములు చేసిన భూమియు, అందు మహాపాతక నాశనమైన గంగానదియును గలదు. అందుకు ప్రత్యక్షముగా యిప్పటికిని అచ్చట దగ్ధమైన తిలలు యవలు అంగారములు దృశ్యమగుచున్నవి. తరువాత మహా పాపనివారణమైన యొక తీర్థమును స్థాపించిరి. దాని పేరు వైఖానస తీర్థము. అందు కృతస్నాతులై ఫలాదులను

భుజించి రెండు వర్షము లందు నివసించిన వారలు మృత్యువును జయింతురు. అని శివుండు పార్వతి కుపదేశించి యున్నాడు. కాబట్టి శ్రీ విఖనస మహర్షి శ్రీ వైకుంఠ భువనంబు నుండి భూలోకంబున బదరీవనంబునకు వేంచేసి బ్రహ్మమానస పుత్రులైన భృగుమరీచ్యత్రి కశ్యపులకు స్వసూత్రము నుపదేశించి, యచ్చట యజ్ఞాదులొనరించుచు తమ పేర నొక పుణ్య తీర్థమును స్థాపించి సుఖంబుగా నందు నివసించి యుండిరని తెలియవలసి యున్నది. తరువాత.

## యోనిజత్వ ప్రాప్తి క్రమము

చతుర్ముఖుండు తన మానస సృష్టియందుద్భవించిన మహాఋషులందరు వానప్రస్థ ధర్మాచరణులగుటచే లోకంబులు విస్తరింప కుండుటం జూచి తన శరీరము నుండి పుట్టిన స్వాయంభువ మనువును శతరూపయను కన్యకను మిథునంబు గావించె. వారలకు ప్రియవ్రతోత్తానపాదులను నిర్వురు పురుషులను, ఆకూతి, దేవహూతి, ప్రసూతులను ముగ్గురు కన్యలును గలిగిరి. అందా కూతిని రుచికునకును, ప్రసూతిని, దక్షునకును దేవహూతిని, కర్దమునకును, పరిణయములు గావించిరి. అందు,

భారతము శాంతిపర్వము. 351 అధ్యాయము
దక్షస్యయా వైదుహితరః షష్టిరాసన్ తాసాంకశ్యపాయత్రయో
దశ, ప్రాదాద్ధశధర్మాయ దశమనవే సప్తవింశతిమిందవే.

తా. దక్షునకు కుమార్తె లరువది మంది కలిగిరి. వారలలో పదముగ్గురును కశ్యపునకును, పదుగురను ధర్మునకును, పదుగురను మనువునకును, ఇరువది యేడ్వురను చంద్రునకును, ఇచ్చి మిథునంబులు గావించెను. అందు కశ్యపుని భార్యలైన పదముగ్గురిలో దితి యను నామె సంతాన కాంక్షచే కశ్యపుంగని సంధ్యాకాలంమున గామించినది. అందువలన నామెకు కలిగిన సంతతి వారందరు క్రూరకృత్యములు గలవారలై దైతేయులన నొప్పిరి. అదితి యను నామె పయోవ్రతం బొనరించుచు, లక్ష్మీనారాయణుల జిరకాల మారాధించె. నా మహా పురుష ప్రసాదంబున నామెయందు కశ్యప రేతోద్భూతులైన మహానుభావులందరు ఆదితేయులనంబరగి దేవత్వంబు నొందిరి. అందు మహేంద్రుడింద్రపదవియందభిషేకింపబడియె. కద్రూవినతలను వారిర్వురును సంతాన కాంక్షచే

కామించి కశ్యపుని గూర్చి తపంబుసేయుగా నాతండు ప్రత్యక్షుడై మీ కోరిక లొసంగెదననుటయు నగ్నిహోత్రునితో సమానమైన తేజము గలిగి దీర్ఘశరీరులైన వేపురుపుత్రులం గద్రువయును కద్రువపుత్రులకంటె బలాధికులైన యిర్వురు కుమారులను మాత్రమే వినతయు గోరిరి. అందుల కతండంగీకరించి వారలకు గర్భాధానం బొనరించె. పిమ్మట వారలు గర్భవతులై శేషవాసుక్యైరావతాదులనుగద్రువయును అనూరగరుడులను నిర్వురను వినతయు గనిరి.

## సహస్రకవచుని వృత్తాంతము

దితి సంతతిలో సహస్రకవచుడను నొక దానవుడు బ్రహ్మను గూర్చి తపంబు చేసి యతని వలన వరంబుగొని యా వరంబున మత్తుండై భూలోకంబునం గల మహర్షుల కపకారములు గావించుచు, వారల యాశ్రమములు బాగుసేయుచు దైవభక్తి శూన్యుడై లోకోపద్రపకారకుండయ్యె. నది గని మహాఋషులందరు బ్రహ్మలోకమునకు బోయి యా పరమేష్ఠి ననేక విధంబుల బ్రస్తుతించి తమకు దానవుని వలన గలిగిన బాధకమ్ముల నెరిగించిరి. యా చతుర్ముఖుడు వారల కభయ దాన మొనరించి నిజనివాసంబుల కనిపి తానును సపరివారముగా శ్రీ వైకుంఠ భువనంబునకు బోయి యచ్చట - జయవిజయాది ద్వారపాలక వంది మాగధ సందోహవందితుండును, అనంత కల్యాణగుణ గరిష్ఠుండును, అనంత గరుడ విష్వక్సేనాది ప్రధాన ప్రపన్న నిష్ఠాగరిష్ఠ సంస్తూయ మానాంఘ్రి సరోజుండును, శ్రీ భూసమాశ్లిష్ట భుజాంతరాళుండును అయిన శ్రీమన్నారాయణ దేవునింగని కరకమలంబులు ముకుళించి యనేక విధంబుల స్తుతించి లోకంబున గల దానవుని వృత్తాంతమును, మహర్షుల యారాటమును, లోకోపద్రవమును విన్నవించె. నా మహాపురుషు డది యాలించి యా చతుర్ముఖున కిట్లనియె. ఓ పద్మ సంభవా లోకంబున నా యుపాసనాపద్ధతి స్థాపింపవలయుననియు నందువలన లోకోపద్రవ శాంతియనియు నిదివరకే నీ కెరింగించి యుంటిని. అట్టి యుపాసనాపద్ధతి లోకంబున నిర్మించుట కిదియే యవసరము. గావున నేనర్చా స్వరూపముగా నవతరించి యా లోకోపద్రవము శాంతింప జేసెదను. గాన నీవు భయముడిగి స్వస్థచిత్తుడవై యుండుము అని యుపదేశించి యంతర్హితుండగుటయు నా పద్మసంభవుడును సంతుష్టాంతరంగుడై సత్యలోకంబునకు బోయి సుఖంబుండె. అటుతరువాత కొంత కాలమునకు నారాయణదేవుండు,

## నరనారాయణావతార ఘట్టము

కశ్యపుని భార్యయైన మూర్తియను నామెయందు దుష్టశిక్షణ శిష్టసంరక్షణార్థము నరనారాయణులను నిర్వురు మహాఋషులై జన్మించి నైమిశారణ్యమున గల బదరీవనంబునకు జని యచ్చట తపోనిష్ఠా గరిష్ఠులై యుండిరి. వారల జన్మకాలంబున దేవదుందుభులు మ్రోగె. దిశలు తెలివినొందె. మలయానిలుడు వీచె. సాగరము లుప్పొంగె. సంపూర్ణలహరీ సమాయుక్తములై నదులు విరాజమానములయ్యె, అప్సరః కామినీ నృత్యము లానందదాయకంబులై యొప్పె. మునీంద్రులానందామృత సంతుష్టులై యనేక విధంబుల నుతించిరి. అఖిల జగన్మంగళావహంబయ్యె. అట్టి కాలంబున భగవంతుండగు శ్రీ విఖనస మహామునీంద్రులు నరనారాయణుల నాదివిరాట్స్వరూపుని లీలావతారంబుగా నెరింగి సకల వేదవిహితార్చనా విధానంబున నారాధించి సపర్య లొనర్చుచుండగ నా మహాపురుషు లా బదరీతరుమూలంబులం దపోయోగపరులై యుండిరి. అట్టి నరనారాయణ తపో మహిమాగ్ని హోత్రంబున నా సహస్రకవచుడను దానవుడు వజ్రమయంబగు కవచము భస్మమై పోయినందులకు చింతాక్రాంతుడై కళారహితుడైపోయె. అటుపిమ్మట నా యాశ్రమవాసులైన మహాఋషులందరు దైత్యబాధానివృత్తి గలవారలై శ్రీ విఖనసమునీంద్రుల నత్యంతాదరాయత్త చిత్తములతో నుతించి నరనారాయణుల ననేక విధంబులం గొనియాడి వారల నారాధించి తమ తమ యాశ్రమంబులకు బోయి సుఖంబుండిరి. పిమ్మట,

శ్లో. ఋషయోஉపి బహూన్ సూత్రాన్ చక్రుస్తస్యానుసారతః
కేచిద్వర్ణా శ్రమాచారాన్ వదంతి స్మృతిరూపకాన్.

తా. ఆ సూత్రము ననుసరించి ఋషులందరు ననేక సూత్రములను రచించిరి. అందు గొందరు వర్ణాశ్రమాచారములను చెప్పిరి. ఆ సూత్రమనగా ప్రథమంబున విఖనస మహర్షిచే రచింపబడిన వైఖానస సూత్రమని యర్థము. ఎట్లన, విఖనసఋషి భూలోకంబునకు రాక ముందు దైవిక మానుషిక కర్మక్రియా కలాప ప్రబోధకంబులగు సూత్రంబులుగాని ధర్మశాస్త్రములు గాని లేవు. తరువాత మహర్షి సకల కర్మ

ప్రతిపాదకంబైన వైఖానస సూత్రమును రచించి భృగు మరీ చ్యత్రి కశ్యపులకును తదితర మహర్షులకు నుపదేశించె. నిందుకు ప్రమాణముగా మంగళాద్రి మాహాత్మ్యములో.

శ్లో. కశ్యపోక త్రిర్భర ద్వాజో విశ్వామిత్రోక థగౌతమః,
వసిష్ఠో జామదగ్నియశ్చ మునయ శ్చతవానుగాః,
సప్తైతే సూత్రకర్తార స్తవసూత్రాను వర్తినః

అని చెప్పుచున్నది. కాబట్టి విఖనస సూత్రము నాధారముగా జేసికొని ఋషులందరు ననేక సూత్రములను రచించిరని చెప్పబడినది. అవి యెవ్వియన.

బోధాయ నాపస్తంబ సత్యాషాఢ ద్రాహ్యాయణాగస్త్య శాండిల్యాశ్వలాయన శాంభవీయ కాత్యాయన శౌనక భారద్వాజాగ్ని వైశ్య జైమినీయ వాధూల మాధ్యంధిన కౌండిన్య కౌషీతకములని (17) సూత్రము లాయా ఋషి ప్రోక్తములయినవి. యీ సూత్రముల కాదియైన వైఖానస సూత్రముతో (18) సూత్రములు శారీర సంస్కార ప్రతిపాదకము లగుచున్నవి. ఈ సూత్రానుష్ఠానములను బట్టి వైఖానసులనియు బోధాయను లనియు నాపస్తంబులనియు భారద్వాజులనియు నీ మొదలైన సూత్రనామధేయములు గలవారలయిరి. వైఖానస సూత్రానుష్ఠాతలు ఔఖేయులనియు వైఖానసులనియు చెప్పబడిరి.

శ్రీరామ చంపూ ప్రబంధములో

ఉఖాయాం బ్రహ్మణో జఠరాగ్నికుండే జాతత్వా దౌఖేయాః,

బ్రహ్మ జఠరాగ్ని కుండమున బుట్టిన వారలగుటచే నౌఖేయులయిరి. అని యుండుటచే ప్రవర కాండమునందు గూడ నౌఖేయులనియు యజుశ్శాఖాధ్యయనులనియు ప్రతిపాదింపబడుచున్నది.

## భృగ్వాదులచే ప్రతిష్ఠింపబడిన స్థలములు

శ్లో. మరీచిర్మందరే విష్ణు మర్చయా మాసకేశవం
ఆ దేశా ద్భృహ్మణో విష్ణుం శ్రీనివాసేక త్రిరర్చయెత్

కశ్యపో విష్ణ్వ ధిష్ఠానే శుభక్షేత్రే భృగుర్మునిః
నందాయాం దక్షిణే సీమ్ని శ్రీనివాసోత్త రేనఘః
తత్సంధౌ శుచిషన్నామ భృగుణా స్థాపితోహరిః

తా. చతుర్ముఖా దేశంబున మందర పర్వంతంబున మరీచి మహర్షియు, శ్రీనివాస క్షేత్రంబున నత్రిమునియు, విష్ణ్వధిష్ఠానంబున గశ్యప మహర్షియు, నందానదికి దక్షిణంబును శ్రీనివాస క్షేత్రమున కుత్తరంబును నైన మధ్యప్రదేశంబున (శుచిషత్) అను పేరుగల శుభక్షేత్రంబున భృగుమహర్షియు విష్ణుదేవుని ప్రతిష్ఠించి యర్చించిరి.

అని యుండుటచేతను, బదరికాశ్రమంబున నరనారాయణుల నర్చించుచు, శ్రీ విఖనస మహర్షి యుండగా నా మహాముని వలన భగవాచ్ఛాస్త్రోపదేశమును పొంది లోక సంరక్షణార్థమై బయలుదేరి భృగ్వాదులు పైన జెప్పిన స్థలములయందు భగవంతుని బ్రతిష్ఠించి యర్చించుచుండిరని తెలియనగును.

## భృగుమహర్షి చరిత్రము

శ్లో. భృగుః పులోమ్నశ్చసుతాం దివ్యాం భార్యామవిందత
యస్యామస్య సుతాజాతా దేవా ద్వాదశ యాజ్ఞికాః
భువనో భౌవనశ్చైవ సుజస్య స్సజనస్తథా
శుచిః క్రతుశ్చ మూర్ధాచ యాజ్యశ్చ వసుధశ్చహ
ప్రభవశ్చా వ్యయశ్చైవ దక్షోకథ ద్వాదశస్తథా
ఇత్యేతే భృగవోనామ దేవా ద్వాదశకీర్తితాః,
పౌలోమ్యంజన యద్విప్రాన్దే వానాంచకనీయసః
చ్యవనంచ మహాభాగ మాప్నువానం తథైవచ
ఆప్నువానాత్మజ శ్చౌర్వో జమదగ్ని స్తథాత్మజః
ఔర్వోగోత్రకర స్తేషాం భార్గవానాం మహాత్మనాం.

తా. భృగుమహర్షి పులోమునిసుత దివ్యను పరిణయంబై యామె యందు భువనాది ద్వాదశపుత్రులంగనెను. వీరు భృగువులని పేర్కొనంబడి దేవతలుగ నెగడిరి. మరియు నా భృగు మహర్షి పౌలోమియందు చ్యవన ఆప్నువానులను నిర్వురు బ్రాహ్మణులను పుట్టించెను. ఆప్నువానునకు ఔరవుడును, ఔరవునకు జమదగ్నియు కలిగిరి. వీరిలో భృగువంశమున కౌరవుడు కర్తయయ్యెను. ఔర్వాది తొంబది గోత్ర కర్తలు. వీరు

పంచార్షేయులు ప్రవర ఋషులు భార్గవ చ్యవన అప్ను వాన ఔరవ జామదగ్నులు వీరు భార్గవులు భృగు సంతతివారు. అని యిట్లు చెప్పియుండుటచే గోత్రప్రవరాది నిర్ణయములకు భృగుమహర్షియే మూలపురుషుడని తెలియుచున్నది. ఇట్లే యితర గోత్ర ప్రవరాదులను నిర్ణయింపబడి యున్నది. గాన యీ విషయములను మత్స్య పురాణము, 194 అధ్యాయమున చూడదగును.

మరియు నీ మహాఋషి యనేక ఋషి ప్రేరణంబున త్రిమూర్తులలో సత్వగుణ ప్రధానుని నిరూపింప దలంచి, బ్రహ్మరుద్రుల పాలికింబోయి వారలను నిజపాదతలంబున తాడనం బొనరించి, వారలచే పరాభవింపబడి వారలను రజస్తమోగుణ బద్ధులుగా నిరూపించి, విష్ణులోకంబునకు బోయి యచ్చుట శేషపర్యంకంబున ననంతగరుడ విష్వక్సేనాది ప్రధాన కింకర సందోహవందితుడైన శ్రీ మహావిష్ణుని రమారమణీ రమణీయంబైన యురస్థలంబున బాదతాడనం బొనరించె. అది గని విష్ణుండు నిజవినోదంబు జాలించి యా మునీంద్రుని వెంట నంటి వాని పాదంబులు బట్టుకొని లక్ష్మీ సమానీతంబైన పావనజలంబులచే గడగి యా యుదకములను శిరసాధరించె. అది గని యా మునీంద్రు డామహావిష్ణుని కేవల సత్వగుణ ప్రధానునిగా నిర్ణయించె. అత్రి మహర్షియు నఖిల జగజ్జేగీయమానంబైన మహా తపంబొనరించి హరిహర హిరణ్య గర్భులచే వరంబులు గొని తన ధర్మపత్ని యైన యనుసూయయందు త్రిమూర్త్యాత్మకులైన కుమారులం గనియె. వారివలన క్రమంబుగా సంతతులు విస్తరిల్లి ఆత్రేయు లనంబరగిరి.

## మరీచి మహర్షి చరిత్రము

ఈ మహర్షి తమ గురువులైన శ్రీ విఖనోమునీంద్రుల వారిని తన యానందసంహితయందిట్లు స్తుతించిరి. ఇదియేతనియ.

శ్లో. స్వాయంభువమనోఃకాలే యుగాదౌ శుక్లవత్సరె
శ్రవణ్యాంశ్రావణే శుక్ల పౌర్ణమ్యా మిందువాసరే
సింహలగ్నేచ సంయుక్తే నైమిశారణ్య మాగతం
నారాయణశ్చ యస్యాత్మా విఖనా ఇతివర్తతే

వేదవేదాం గతత్వజ్ఞం తంవన్దేవిఖనోమునిం
పద్మనాభమనోజాతం విష్ణుపూజావిశారదం,
కుశాసనేసమాసీన మూర్ధ్వ పుండ్రపవిత్రకం
కిరీటహారాభరణం కుండలాంగద భూషితం,
శిఖాయజ్ఞోపవీతాభ్యాం త్రిదండేనవిరాజితం
వరదాభయహస్తంచ శంఖ చక్రధరం ప్రభుం,
పద్మంతుదక్షిణేహస్తే ధారిణం పీతవాససం
కమండలుఘటైర్యుక్తం బ్రహ్మర్షిగణసేవితం,
తులసీపద్మమాలాభి స్తపసాచసు శోభితం
పారమాత్మిక మంత్రజ్ఞం విఖనోముని మాశ్రయే.

శ్లో. శ్రీనారాయణ నాభిపంకజజను ర్జాతామరీచ్యాదయ
స్తత్సంతతి సంతతం జగదభూత్.

తా. శ్రీమన్నారాయణుని నాభి పద్మమునందు బుట్టిన బ్రహ్మ వలన మరీచ్యాది మహర్షులు పుట్టిరి. వారి వారి సంతతులచే జగమంతయు పరిపూర్ణమైనది అని యనేకములైన ప్రమాణములు కనుపించుచున్నవి. ఈ మహర్షి సంతాన వివహాదిక ధావిధానం బెట్లనిన.

## వాయుపురాణాంతర్గత గయామాహాత్మ్యము
## 3 అధ్యాయములో

దక్షకన్యలలో ధర్మునకిచ్చిన పదుగురిలో విశ్వరూపయను నామెయందు ధర్మునకు ధర్మవ్రతయను నొక కుమార్తె గలదు. ఆమె కనురూపుడైనవరుండు లభింపకుండుటచే తండ్రియాజ్ఞ శిరసావహించి, వనంబునకుం బోయి, బెక్కువర్షములు తపంబాచరించె నంతలో నీ మహర్షియు ధర్మపత్నీ సంఘటనార్థబై పృథివి యంతయు దిరుగుచు తపో నిష్ఠా గరిష్ఠురాలైన యాధర్మవ్రతను జూచి, యామె యందు బద్ధానురాగుడై యుండుటయు నామెయు నట్టి వృత్తిగలది యయ్యెనది గ్రహించి యామెతో నేను బ్రహ్మపుత్రుడను మరీచి యనుపేరు గలవాడను, నీయందనురాగము గలిగి యున్నవాడను. గాన నీవెవ్వరని యడిగెను. అప్పుడామె నేను ధర్మపుత్రికను, ధర్మవ్రతయనుదానను, పాతివ్రత్యంబునకై తపంబు సేయుచుంటిననుటయు, నతండేను ధర్మపత్నికొరకును నీవు పాతివ్రత్యమునకును తపంబు సేయుచుంటిమి, గావున నీవు

నన్ను వరియింపుమని కోరెను. అందుకామె సమ్మతించి తనతండ్రితో చెప్పుమనెను. అప్పుడా మరీచియు ధర్మునిపాలికింబోయి తనమనోరధం బాతని కెరుంగించెనందుల కాతండు సమ్మతించి తన కుమార్తెయగు ధర్మవ్రత నిచ్చి యగ్నిసాక్షిగ వివాహమొనరించె నతండట్లు పరిణయంబై తనయాశ్రమంబునకు గొనిపోయి సుఖించుచుండె. ననంతర మాధర్మవ్రతయందు విష్ణుతుల్యులగు నూర్గురుకుమారు లుద్భవించిరి. వారలతో సకల సంతోషము లనుభవించుచు కాలకృత్యములు నెరవేర్చుకొనుచు భగవదారాధనము సేయుచునుండగా నొక దివసంబున మరీచి పుష్పఫలాదులం గొని తెచ్చుటకై వనంబునకు బోయి తిరిగి వచ్చి మార్గాయాసనివృత్తికై కించిత్కాలము విశ్రమించి, భార్యను పాదసంవహనంబునకై నియమించి నిద్రించెను. ధర్మవ్రతయు నాపెనిమిటి పాదంబు లొత్తుచుండె నంతలో నామె మామయగు చతుర్ముఖుండాస్థలంబునకు విచ్చేయుటయు, నామె భర్తృశుశ్రూషనుండి తొలంగి బ్రహ్మనర్చించె నా బ్రహ్మయు తన కుమారుడగు మరీచి శయనించిన పర్యంకంబునం బరుండె, నా ధర్మవ్రత యచ్చటనుండి తొలగి దూరంబున నిలువంబడియె. నంతట నామరీచి మేల్కాంచి, ధర్మపత్ని సమీప మందు లేకుండుటయు సపర్య లొనరింప మానుటయు జూచి కోపావేశంబున శిలారూపంబు నొందుమని యాధర్మవ్రతను శపించె నామెయు నిర్దోషురాలగు నన్ను శపించితివి గావున నీవు నీశ్వరునిచే శాపంబు నొందగలవని ప్రతిశాపంబిచ్చి గార్హపత్యాగ్ని మధ్యంబున నిలచి, శ్రీ మహావిష్ణునుద్దేశించి యఖండమైన తపంబుసేసె నాతపంబునకు మెచ్చి విష్ణుండు ప్రత్యక్షమై, వరంబు గోరుమనుటయు, నా భర్త యిచ్చిన శాపంబు నుండి తొలగింపుమని కోరెను. విష్ణుదేవుడా ధర్మ వ్రత వాక్యంబు లాలకించి, యిది బ్రహ్మర్షి శాపంబు గాన మరలింపరాదనియు, మరియొక వరంబు గోరిన నిచ్చెదనియు, నాజ్ఞ యిచ్చె నందులకామె సంతసించి, నేను శిలారూపము ధరించుట పిమ్మట నాయందు దేవతలు ఋషులు సకలతీర్థంబులు నివసించియుండవలయును. నన్ను జూచిన లోకులందరు పాపముక్తులు గావలయును నాయందు పితృతర్పణ శ్రార్ధములను చేసిన వారి పితరులందరు విష్ణులోకంబునకు బోవలయును, కర్తతో వేయికులంబుల వారు తరింపవలయును. అని కోరుటయు, నామె కా కోర్కెల నొసంగి, యనంతరము శిలారూపము నొందిన యా ధర్మవ్రతను, గయాసురుని శిరంబున బెట్టి యందు దేవఋషి తీర్థంబుల బ్రతిష్ఠించి తన పాదంబును గూడ దాని యందుంచె నదియే గయ యని చెప్పబడుచున్నది. గాన

గయాక్షేత్రంబున బిండ ప్రదాన మొనరించు విష్ణుపాదము క్రింద నున్న శిల మరీచి మహర్షి భార్యయు, దక్ష ప్రజాపతి మనుమరాలును, ధర్ముని కుమార్తెయు, నగు ధర్మవ్రతయను నామె యని యెరుంగనగును. పిమ్మట నామరీచియు పార్వతీ పరమేశ్వరులు పారిజాతవనంబున విహరించుచుండగ నచ్చట పుష్పఫలాదులం గొని తెచ్చుటకు బోయి వారల సౌఖ్య కాల విఘ్నకర్తయయ్యె. నందులకు వారలు కోపించి నీవును దుఃఖవంతుడవగుదనని శపించిరి. యతండప్పుడా పార్వతీశ్వరుల బ్రార్థించి శాపావసాన మొనరింప బ్రార్థించె, వారలా మహామునితో నీవు గయాశిలయందు తపం బొనరించితి వేని, శాపముక్తుడవగుదువని యానతిచ్చి యంతర్హితులైరి. పిమ్మట నామహర్షియు, గయాక్షేత్రంబునకు బోయి యాశిలాతలంబునం గూర్చుండి విష్ణుని గూర్చి తపంబొనరించె నందులకు సంతుష్టాంతరంగుడై చక్రధరుండు బ్రత్యక్షమై నీయభిమతంబు నుడువుమనుటయు, నాకు పార్వతీ పరమేశ్వరుల శాపముక్తియు నీ శిలకు పరమపావనత్వము పితృముక్తి కారణత్వము సిద్ధింపవలయునని కోరెను. అప్పుడావిష్ణుం డామరీచిమహామునీంద్రుని కోరికల నొసంగి యంతర్హితుండయ్యె నమ్మునీంద్రుడు నిజేచ్ఛంజనియె. నిది మరీచిమహర్షి జీవచారిత్రములలో నొక్కటి యని తెలియవచ్చును.

## తోతాద్రి యందు భగవదావిర్భావము

అనంతరము చతుర్ముఖుడు తానే యీ జగత్కారణుడనని గర్వించె. నా గర్వనిర్వాపణంబునకై నారాయణుడు మధుకైటభులను నిర్వురు దానవుల సృజించెను. వారిర్వురు బ్రహ్మ నెదిరించి యుద్ధము సేయుటయు నాతండు గర్వంబు విడచి, శ్రీహరిని శరణు పొంది సాత్విక భావ మనుసరించె. నప్పుడా హరి యాదానవులతో అయిదువేల వత్సరములు యుద్ధము చేసి సంహరించెను. ఆ దానవుల మేదో రక్తమాంస శల్యంబులు పృథివి యంతయు నిండి దుర్గంధ కలితమయ్యె. నప్పుడా భూదేవి తనయందు గల యపరిశుద్ధత్వ నివృత్తికై నారాయణుని గూర్చి తపంబొనర్చుటయు నా భక్తపరాధీనుండు పాండ్య దేశమున తామ్రపర్ణీతీరంబునం బ్రసన్నుడై భూమికింగల యపరిశుద్ధత్వ నివృత్తియగునట్లును తన యందు సర్వనదీనద సరిత్పుష్కరిణ్యాది పుణ్యతీర్థంబులను దివ్యక్షేత్రములును నివసించి యుండునట్లును వరంబొసంగి. శ్రీభూసమేతముగా తానచ్చట విమానరూపముగ నిల్చి రాత్రియందు మాత్రము భక్తులకు దర్శనమిచ్చు

చుండెను. తరువాత గాల వుండను మహర్షి తపంబు సేయుటయు నతని తపంబునకు సంతుష్టాంతరంగుండై యభిప్రాయమడుగుటయు, నామునీంద్రుడో స్వామీ ! నీవు శ్రీభూసమేతముగా కల్పాంతమువరకు నిచ్చట నివసించి యుండవలయుననియు నిది శ్రీనివాస క్షేత్రమని యొప్పుచుండవలయుననియు, కోరెను, వాని వాక్యంబులకు మెచ్చి యట్లనే యగునని వరంబిచ్చి యచ్చట తపంబుసేయుచున్న యనంతునకు వరంబీదలంచిన నతండు తన్పై శయనింప బ్రార్థించె నతని కోరిక తీర్చి, యచ్చట శ్రీభూసమేతుండై యుండె. నీయుదంతం బెరింగి యా శ్రీనివాసు నర్చించుటకై యక్షకిన్నరకింపురుష దేవర్షి సంఘసంస్తూయం వూన నిజవైభవాభిరావులైన నరనారాయణుల నర్చించుచుండుటకై భృగు మరీచ్యత్రికశ్యపుల నియమించి, శ్రీ విఖనసమహాముని తో తాద్రికి వేంచేసి తామ్రపర్ణీతీరంబున శ్రీస్వామివారిని మానసికముగా, నర్చించుచు ప్రత్యక్ష దర్శనంబునకు వేచి యుండె. నంత నచ్చట బదరికాశ్రమంబున నరనారాయణుల తప ప్రభావంబునకు సహింపజాలక మహేంద్రుండు. రంభయను నప్సరఃకాంతను జూచి నీవు భూలోకంబునకు బోయి బదరీవనమందు తపోనిష్ఠాగరిష్ఠులైన నరనారాయణుల తపోభంగంబు గావించి రావలయునని చెప్పుటయు నదియట్లు చేయునదియై భూలోకంబునకుం జని యా ఋషీంద్రుల పాలికింబోయి యత్యంత సౌందర్యఖని యగు నొప్పుచు ననేక శృంగారవిలాసంబు లొనరించుటయు నారాయణ ఋషి యప్సర కన్యకాభిప్రాయ మెరింగి దానిన వంచించుటకై తనయూరుతలంబు నుండి దేదీప్య మానయగు స్త్రీ విగ్రహమును సృజించి యారంభకుం జూపుటయు నా స్త్రీ రూపము తనకు మించిన రూపలావణ్యవయోవిలాసంబులు గలదగుటకు లజ్జావనతశిర ప్రదేశంబుగలదియై మరలిపోయెను. పిమ్మట నారాయణఋషి తన యూరుతలంబు నుండి యుద్భవించిన కాంతామణికి యూర్వశియని నామధేయంబొనర్చి దేవలోకంబున నుండ నియమించె. ననంతరము దితి సంతతిలో సుందోపసుందులను దానవు లిర్వురు బ్రహ్మను గూర్చి

## ఊర్వశీ తిలోత్తమలు తోతాద్రికి వచ్చుట

తపంబొనర్చి యెవ్వరివల్లను చావులేకుండ వరంబుగోరి, జయించుట కితరులకు

సాధ్యంబుగాదనియు, వారలలో వారిర్వురును కయ్యంబొనరించి యందువలన నిర్జీవులు కావలయుననియు, యిర్వురకు గయ్యంబు స్త్రీ మూలముగా లభింపవలయుననియు వేల్పులెల్లరు నాలోచించి, ఊర్వశిం బంపిరి. యామెపోయి వారలకు గన్పించుటయు దాని సౌందర్యాతిశయంబున కచ్చెరువంది యన్నదమ్ము లిర్వురు గామించిరి. యప్పుడా యూర్వశి మీయిర్వురి యం దెవరు బలాఢ్యులో వారలను వరించెదననియె నందులకై వారిర్వురు ఘోరమైన కయ్యంబుగావించి యస్తమించిరి. పిమ్మట నా యూర్వశి బ్రహ్మలోకంబునకు బోయి విరించితో నీ యుదంతం బెరింగించుటయు, నా బ్రహ్మ సంతసించి దేవకార్య నిర్వాహకురాలవు గావున నీకు కోరిన వరంబిచ్చెద నడుగుమనియె. నందులకామె లక్ష్మీనారాయణుల సన్నిధానంబు సతంబుగా గోరెను. అందుల కావిధాత సంతసించి, భూలోకంబున దామ్రపర్ణీతీరంబున గల తోతాద్రియందు నివసించి యాపురాణపురుషుని గూర్చి తపంబు సేయు మని యానతి యిచ్చె. నందులకామె సంతసించి, తోతాద్రికిం బయన మగుటయు నంతలో తిలోత్తమ దానుగూడ వచ్చెదనని వెంటనంటుటయు నిర్వురును, సర్వపుష్పఫలభరితమగు తోతాద్రికి వచ్చి యచ్చట గల మహర్షులను దర్శించి, యావైభవంబున కత్యంతాశ్చర్య భరితాంతఃకరణలైరి యచ్చట నొక్కొక్క మహర్షి యాశ్రమంబును జూచుచు క్రమక్రమంబుగా విఖనస మహర్షి యాశ్రమంబునకు వచ్చిరి.

## ఊర్వశీ తిలోత్తమలు విఖనసఋషిని దర్శించుట

## తోతాద్రిమాహాత్మ్యము

## 7 అధ్యాయము 71 మొదలు

శ్లో. ప్రదృశ్యకుత్రచిత్తస్మి న్నూర్వశీచతిలోత్తమా
తృణ కాష్టజలైర్యుక్తో యుక్తోవరమసాత్వికైః
గత్వాతస్మిన్ మహాత్మానం వైఖానసమృషింతదా
తప్యంతమృషిభిస్సార్ధం తపస్సిద్ధైర్మహాత్మభిః
వైఖానసై ర్వాలఖిల్యై స్సంప్రక్షాళైర్మరీచిభిః
బహుభిః దేవగంధర్వైః విద్యాధరమ హోరగైః

ఉపాస్యమానమే కాగ్రం జ్వలంతంస్వేన తేజసా
మూర్తిమం త మివాసీనం తపసాంరాశిమూర్జితం.
దాంతం శాంతంజిత క్రోధం విజితారింమహౌజసం

ప్రాణాయామేనమహతా ధ్యాయంతంవైజనార్దనం
బ్రహ్మాసనేసమాసీనం రాజంతం బ్రహ్మవర్చసా
నత్వాతంమునిశార్దూలం వైఖానసమథోచతుః
భగవాన్ త్వత్కృపావేశా దావామత్రగతేహరేః
ప్రాప్తుంసామీప్య మిచ్ఛంత్యా విత్యాజ్ఞాపయనౌమునే
తతస్సభగవాన్వాక్యం శృత్వావైఖానసస్తయోః
శ్రీమదష్టాక్షరం మంత్రం కురుతం వైయథావిధి.

తా. ఆతోతాద్రియందు తృణకాష్ఠ జల సమృద్ధి గలిగి పరమ సాత్వికులతో గూడిన యొక్క ప్రదేశంబున కాయూర్వశీ తిలోత్తములు జని యందు వైఖానసవాలఖిల్య సంప్రక్షాళమరీచి, దేవ గంధర్వ విద్యాధర మహోరగాది మహాతపస్సిద్ధ సంఘములతో గూడి, తపోరాశి వలె స్వతేజోమూర్తిమంతులును, ఏకాగ్రనిష్ఠాగరిష్ఠులును గొప్పదైన ప్రాణాయామముచే జనార్ధనుని ధ్యానించుచు, బ్రహ్మాసనాశీనులై యున్న విఖనసమునీంద్రులను దర్శించి, నమస్కరించి, యిట్లనిరి. భగవంతుడైన యో విఖనసమునీంద్రా ! నీకృపాశంబున మేమిచ్చటకు రాజాలితిమి. హరిసామీప్య ప్రాప్తి గోరుచుంటిమి. గాబట్టి యిందుల కుపాయంబు మాకుం గృపశేయ బ్రార్థించుచుంటిమి. అని యిట్లు విన్నవించుకొనుచుండిన యూర్వశీతిలోత్తమల జూచి భగవంతుడైన యావిఖనసమునీంద్రు డిట్లనియె. ఓ యప్సరలారా ! యథావిధ్యుక్తముగా భగవదష్టాక్షర మహామంత్రోపాసనంబు జేసితి రేని, మీ కోరిక నెరవేరగలదు.

శ్లో. తతస్తద్వాక్య మాకర్ణ్య నత్వావైఖానసం మునిం
పతంజలింనమస్కృత్యా తతస్తేతపసేగతే.

తా. అని చెప్పిన పిమ్మట నావిఖనసమునీశ్వర వాక్య మాలకించి నమస్కరించి, యచ్చటనున్న పతంజలికి నమస్కరించి, యా యూర్వశీతిలోత్తమలు తపోగతులైరి.

శ్లో. తర్పణంచ యథాన్యాయ్యం హోమంభోజనమేవచ
ఏవంకృత్వాతపోనిత్యం గురుశుశ్రూషణంచతే
కుర్వంత్యావర్ధయే తేస్మ చింతితంమునిసత్తమం
భగవన్విష్ణుసామీప్యం కదానౌసంభవిష్యతి
కేనోపాయేనవక్తవ్యం వాత్సల్యాదావయోర్మునే
శృత్వావైఖానసోవాక్యం తయోర్వై మునిసత్తమః
ధ్యాత్వాచవిష్ణుం వరదం సర్వలోకేశ్వరం విభుం
వర్తతేయదిలో కాత్మా తదాప్రత్య క్షమేష్యతి.

తా. పిమ్మట హోమతర్పణసంతర్పణంబు లొనరించుచు గురు శుశ్రూష సేయుచు యధావిద్యుక్తముగా నీ ప్రకారము తపంబు సేయుచు విష్ణు సామీప్యము మాకెన్నడు లభింపగలదని విఖనసమహర్షి నడిగిరి. విఖనస ఋషి యా వాక్యములు విని సర్వలోకేశ్వరుడైన విష్ణుని ధ్యానించుచుంటిరేని ప్రత్యక్ష దర్శనము పొందగలరు. అని సెలవొసంగిరి.

తరువాత ననేక వర్షము లాతపశ్చరణంబున గతించె నంతట నారాయణ దేవుండుచిదానందమూర్తియై విమానరూపముతో సాక్షాత్కరించె. వారలా మహాపురుషు ననేక విధంబుల స్తుతించి, సాష్టాంగ దండ ప్రణామంబు లొనరించి, గద్గదఖిన్నకంఠులై యోదేవా! సర్వకాల సర్వావస్థలయందు నీ సన్నిధిలో వహించి, నీ సేవ సేయుచుండునట్లు వరంబు ప్రసాదింపుమని కోరిరి. అందులకా జనార్ధనుండు సంతసించి, యూర్వశీ తిలోత్తమలను తన సన్నిధి యందు నివసించి చామరకైంకర్య మొనర్చు చుండుమని వరంబు ప్రసాదించె. నదిగాన యూర్వశీతిలోత్తమ లాదివసంబునుండియు, తోతాద్రినాధుని సన్నిధియందు చామర గ్రాహిణులై నివసించిరని శివుండు పార్వతికిం జెప్పె. (తో, మా. 7. అధ్యాయము.)

## గరుడాళ్వారుల ప్రభావము

కశ్యపునకు వినతయను భార్యయందు పుట్టిన పక్షీంద్రుడైన గరుత్మంతు

డొకనాడు, పాతాళంబునకు బోయి, సవతితల్లి సంతతియైన కాద్రవేయుల
తనకు వినతి సేయనందున యింద్రాది వందనీయుడనైన నా యెడ
లసూయవహించినవని కోపంబుచే వాటింబట్టి వధింప నారంభించె. నంత
నాగరాజు వచ్చి గరుడుని జూచి, నేను భగవంతుడగు నా
సన్నిధియందెల్లకాలము నివసించి యుందును నీవు గూడ న
మత్సముడవగుదువని చెప్పెనది విని యావైన తేయుండు యాపా
బయలుదేరి, శ్వేతద్వీపమునకు బోయి యచ్చట మహర్షులచే బోధింపబడి,
వెడలి. తో.మా. అ.8.

73\. శ్లో.నిర్గత్యవాయువేగేన సమతీత్యనభ స్థలం
సేవితంసప్తభిర్వాతైశ్చా రణైశ్చమహామతిః
74\. వైఖానసమునిశ్రేష్ఠా యత్రతిష్ఠంతి శాశ్వతాః
ఋషయస్తత్రతోతాద్రౌ ప్రవివేశఖగేశ్వరః

తా. వాయువేగముగ నంతరిక్షమార్గమున సప్తవాయువుల చేతను చ
సేవింపబడుచు మునిశ్రేష్ఠులయిన వైఖానసులును ఋషులును,
నివసించియున్న తోతాద్రి కి వచ్చెను.

75\. తత్రత్యాన్ సమ్మనీన్, సర్వాన్నమస్కృత్య యథోచితం
పూజితస్తైశ్చ పూజార్హః పక్షిరాజోమహాత్మభిః.
76\. తత్రతత్రాశ్రమేపుణ్యే వాసంకృత్వావిశేషవిత్
వైఖానసమునేస్తావ దాశ్రమంప్రవివేశహ.
77\. తంపూజయిత్వా విధివత్సమునిందీప్తతేజసం
స్వకార్యమవదత్తస్మై వైన తేయోమహాబలః
78\. తచ్ఛ్రుత్వావచనంపృష్టో మునిర్వైఖానసోత్తమః
తదేవతస్యోపదిశ చ్ఛ్రీమదష్టాక్షరంమనుం.
79\. సాంగోపాంగం సనిష్ఠాకం సరహస్యంసతర్పణం
సధ్యానంసతపోహోమం కురుష్వైవం యథావిధి

80. ఇత్యేవంమునినాతేన సమాధిష్టస్త్రయీామయః
కర్తుంతపస్సమారేభే యధాదేశం ద్విజేశ్వరః

తా. గరుత్మంతుడా తోతాద్రియందు నివసించి యున్న మునీశ్వరుల కందరకు నమస్కరించి, వారలచే పూజింపబడి, అచ్చటచ్చట గల పుణ్యాశ్రమములయందు నివాసము చేయుచు వైఖానస మున్యాశ్రమము ప్రవేశించెను. అచ్చట స్వతేజో విరాజమానుడైన యావిఖనస మునీంద్రుని పూజించి తన కార్యమును విన్నవించుకొనెను. విఖనస మహర్షియా ఖగేశ్వరుని వాక్యమును విని సంతోషాంత రంగుడగుచు నతనికి భగవత్ప్రాప్తి సాధనంబైన శ్రీమదష్టాక్షరీ మహామంత్రోప దేశ మొనరించి. అందులకు సాంగోపాంగములును నిష్ఠానిధియు రహస్యములును తర్పణ హోమధ్యానతపోవిధి విధానంబులు నెరింగించి యిట్లు సేయుమని యాజ్ఞయిచ్చెనట్లు విఖనసునిచే గరుడుడు నియమింపబడి యధావిధిగా తపంబు సేయుటకు ప్రారంభించెను.

గరుడునితపంబునకు విష్ణుదేవుడు ప్రత్యక్షమగుట వాయుభక్షకుడును త్రిషవణస్నాయియునై కుంభక యోగంబున నుండి, జితేంద్రి యుండును ప్రాణాయామపరుండును నిరుచ్ఛ్వాసుండును నై, నవద్వారబంధనంబు గావించి, అష్టాక్షరీ మహామంత్రాను సంధాన మొనరించు చుండె నంతలో దేవాసుర గణంబులకు పరస్పర వైషమ్యములు గలిగి, యుద్ధ మొనర్చి దేవతలు రాక్షసులచే పరాజితులై బ్రహ్మలోకమునకు బోయి విరించి కాయుదంతం బెరింగించిరి. యా బ్రహ్మయు నా వేల్పులను దోడ్కొని క్షీరాబ్ధి దరికిం బోయి యచ్చట పురాణ పురుషోత్తముడైన నారాయణుననేక విధంబుల బ్రార్థించెనా మహా పురుషుడా బ్రహ్మకు దృగ్గోచరుండయ్యె నతండు సభక్తి ప్రణామంబు లొనరించి రాక్షస బాధకముల నెరుగజెప్పిన విని నారాయణు డాదరాయత్తచిత్తుడై మీరలు మందరాద్రిని మంథానంబుగను శేషుని త్రాడుగను జేసి క్షీరాబ్ధిని మధింపుడు. దానియందమృతోత్పాదనము కాలగదు. వేల్పులు దాని నాహారంబుగా గ్రహించిరేని యసురులచే లయంబుగా కుందురని యానతి యిచ్చి యంతర్హితుడయ్యె. నా వేల్పులెల్లరు మందరగిరిం బెకలించి మధింప నుద్యమించిన నది సాధ్యంబు గాకుండుటయు మరల నాయుదంతంబు నారాయణున కెరింగించిరి. యతండందులకు నాగాంతకుండు సమర్థుడనియు నాతనిచే మీ కార్యంబు సానుకూలంబు కాగలదనియు నానతి యొసంగె.

నప్పుడా యమరగణ ఋలు నేకగ్రీవముగా నోస్వామీ గరుడుడుతోతాద్రియందు భవత్స్వామీప్య ప్రాప్తికై ఘోరంబైన తపంబు సేయుచున్న వాడు గావున వాని యందు నీవనుగ్రహించితి వేని మాకార్యంబు కాగలదని విన్నవించిరి. అందులకు సంతసించి నారాయణ దేవుండు మహాలక్ష్మితో గూడి కోటి సూర్య ప్రకాశమానుడును శంఖ చక్ర గదా పద్మవనమాలా విరాజితుండును, పీతాంబరా లంకృతుండునయి నిజపరివారముతో, తోతాద్రియం దావిర్భవించి యచ్చట మహాతపోనిష్ఠా గరిష్ఠుడైన ఖగేంద్రునకు దృగ్గోచరుండయ్యె. నావైన తేయు డత్యంతవినయ వినమితాననుండై యామహాపురుషు ననేక విధంబుల స్తుతించి యంజలి బద్ధుండై నిలువంబడియె. నా వైకుంఠాధిపతి యత్యాదరంబుననో ఖగేశ్వరా నీ మనోరథంబు నెరవేర్చితి నా సామీప్యంబున వాహనత్వంబు వహించి యుండు మనియు వలయునేని వేరొండు వరంబు గోరుమని యాజ్ఞాపాయించుటయు నా నాగాంతకుండిట్లనియె.

**గరుత్మంతుడు విఖనసుని విష్ణుసన్నిధికిం దెచ్చుట.**

శ్లో. ఇదంవిష్ణోర్వచశ్శ్రుత్వా కృపయోక్తం ఖగోత్తమః
బద్ధాంజలిపుటః ప్రీతః ప్రత్యువాచ శుభంవచః
125. మద్గురోశ్చ వరందాతు మ్మర్హసిత్వం యథేప్సితం
తథైవాస్తువయః శ్రేష్ఠ నిత్యంమత్సన్నిధౌవస.
126. త్వద్గురోశ్చ మమోత్పన్నో దేహాత్పూర్వం మహాతపాః
వైఖానస ఇతిఖ్యాత స్తమప్యానయసత్వరం.
127. ఇత్యుక్త స్తంమహావేగః పన్నగారిర్మునీశ్వరం
స్వామింపృష్ఠే సమారోప్య వేగాదాగాత్ఖగోత్తమః

తా. ఇట్లానతియిచ్చిన విష్ణువాక్యముల నాలకించి బద్ధాంజలి పుటుండై యిట్లనియె. నా గురువునకు గూడ కోరిన వరంబు నొసంగుదగుదువు. అనియె నప్పుడా భగవంతుడో వైనతేయా నీ యిష్ట ప్రకారము జరుగగలదు. నిత్యము నా సన్నిధి యందు వసింపుము. పూర్వము నాశరీరము నుండి యుద్భవించినట్టియు మహాతపస్సంపన్ను డైనట్టియు వైఖానసుడను ప్రఖ్యాతిగల నీ గురువును గూడ శీఘ్రముగా నిచ్చటకు గొనిరమ్ము అని గరుడునితో చెప్పగా నతడు మహా వేగముగా జని యావిఖనసమునిని తన పృష్ఠ భాగమునందు నుంచుకొని వేగముగా వచ్చెను.

128. తతోవైఖానసోవిష్ణుం సర్వదేవైర్నమస్కృతం
దీర్ఘబాహుంవిశాలాక్షం కోటిసూర్యోదయప్రభం.
134. దృష్ట్వానత్వాచిరంమగ్న ఆనందాబ్ధౌమహామనాః
స్తుత్వాతతస్తు వేదోక్తైః సూక్తైః తస్థౌతదగ్రతః

తా. తరువాత నావిఖనసఋషి సర్వదేవనమస్కృతుండును, దీర్ఘబాహుండును, విశాలాక్షుండును కోటిసూర్య ప్రకాశ మానుండును, నైన విష్ణుదేవుని జూచి నమస్కరించి, మహానంద సాగరమందు మునింగినవాడై వేదోక్త సూక్తములచే స్తుతించుచు నెదుట

135. వైఖానసోమునిశ్రేష్ఠో భావయన్ తత్పదాంబుజం
తతః ప్రసన్నో భగవాన్భక్త వాత్సల్య వారిధిః
136. ప్రోవాచకృపయావిష్టస్తమృషింతపసాంనిధిం
దాస్యామితవసుప్రీతో వరంవరయసువ్రత
147. కృతార్థోకసిమునిశ్రేష్ఠతోతాద్రిస్థలవాసతః
తచ్ఛ్రుత్వావచనం విష్ణోర్మునిర్వై ఖానసోత్తమః

తా. వైఖానస ఋషియు నా మహావిష్ణుని పాద పద్మములను భావించుచుండగా భక్తవత్సలుడైన భగవంతుడు ప్రసన్నుడయి కృపారసముతో గూడి యావిఖనసమునితో నీ వీతో తాద్రిస్థలవాసముచే గృతార్థుడవైతివి, నేను సంతుష్టినొందితి నీకు వరంబొసంగెద కోరుమని పలికెను ఆవిష్ణువాక్యము విని వైఖానసముని యిట్లనియె.

138. భగవన్ముక్తి మద్యైవ ప్రార్థయే పురుషోత్తమ.
తా. స్వామీ యిప్పుడే నాకు ముక్తి నిమ్మని ప్రార్థించుచుంటిని.
140. ప్రోవాచపరమోదారః ప్రీతఃప్రీతేన చేతసా
తథైవ భవతాంనామ శ్రూయతాంకారణంతవ.
141. భూలోకేజన్మనోవిద్వ న్నిత్యా హభగవాన్ హరిః
అర్చారూపేణలోకేకస్మిన్ గ్రామేవానగ రేవనే.
142. తీర్థేనద్యా స్తటేచైవ గృహేవాగిరిమూర్ధని
వసామియత్రయత్రాహం తత్రసర్వత్రసర్వదా.

143. పూజితుంమాంమునిశ్రేష్ఠ పుత్రపౌత్రాదిభిర్యుతః
జనిష్యసిమహాభాగ తస్మాన్మామర్చయానిశం.
144. బహూనీహయుగానిత్వ మంతేమోక్షమవాప్స్యసి
ఇత్యుక్త్వాగరుడారూఢో దేవసంఘైఃపరీవృతః
148. తీరం క్షీరాంబుధేశ్శ్రీమాన్ ప్రయయౌపురుషోత్తమః
ఇత్థంతార్క్ష్యో భజన్విష్ణో స్సన్నిధౌసర్వదాస్థితః
149. దేవితస్యైవకృపయా తద్గురుశ్చమహాన్ ఋషిః
పూజయం శ్చాపిధర్మాత్మా తమర్చారూపిణంహరిం.
150. ఉవాచప్రా ప్తవానాయుర్దీర్ఘంలోకేచిరంసుఖీ
ఇత్యుక్తంశంభునా పూర్వం పార్వత్యైరోమహర్షణః
కథయామాసధర్మాదాత్మా శౌనకాద్యాన్ ఋషీశ్వరాన్
ఇతి శ్రీతోతాద్రిమాహాత్మ్యే అష్టమోధ్యాయః

తా. నీ కోరిక యగుగాక ! నీ జన్మ కారణము వినుము ? భూలోకములో నర్చారూపముగా గ్రామ, నగర, వన, తీర్థ నదీతట, గృహ, గిరిమూర్ధంబులయందు నేనవతరించుచున్నాను. అచ్చటచ్చట నన్నర్చించుటకు నీవు పుత్రపౌత్రాదులతో గూడి జనింపగలవు. గాన నన్నెల్లప్పుడు నర్చించుచుండుము. అనేక యుగములు గతించిన పిమ్మట మోక్షమును పొందగలవు. అని విఖనస మహర్షితో విష్ణుదేవుడానతిచ్చి గరుడారూఢుడై దేవసంఘములతో గూడి, క్షీరాంబుధితీరంబునకు వేంచేసెను. ఇట్లు గరుత్మంతుడు, హరిసన్నిధానవర్తియయ్యె. నాస్వామి వారి కృపచేత నాగరుత్మంతునకు గురువైన విఖనస మహర్షి యర్చారూపుడయిన విష్ణునారాధించుచు చిరకాలము భూలోకమునందు నుండెను అని శివుండు పార్వతికిని, రోమహర్షణుడు శౌనకాదులకును జెప్పిరి. (తో. మా. 8. అ.)

## విష్ణుదేవుడు రోమశునకు బ్రత్యక్షమగుట.

రోమశమహాముని తోతాద్రియందు చిరకాలం నారాయణుని గూర్చి తపంబు సేయగ నమ్మహాపురుషుండు సాక్షాత్కరించి నీయభీష్టంబు వేడుమనుటయు, నా

మునీంద్రుడో స్వామీ ! లోకసంరక్షణార్థమీ తోతాద్రియందు అర్చారూపముగా నీ పరివారముతో నివసింపవలయునని కోరెను. నారాయణు డందులకు సమ్మతిగలవాడై యా మునీంద్రునకు వరంబు దయచేసి, యచ్చట సకల జనదృగ్గోచరుండగుచు సాక్షాత్కరించి నివసించెను.

## 11 అధ్యాయము

57. మధ్యేసుమనసాంశ్రీమాన్ తోతాద్రిశోవ్యరోచత
తస్మిన్నవసరేసర్వే ఋషిసంఘాస్సమాగతాః.

తా. అట్లాతోతాద్రి యందు దేవమధ్యంబున భగవంతుడవతరించిన సమయమున ఋషీశ్వరులందరు వచ్చిరి.

61. తతస్సభగవాన్ సర్వాన్ దేవనాథస్సమీక్ష్యచ
వైఖానసంమునిశ్రేష్ఠం కించిదూచేజనార్ధనః

62. వైఖానస మదంశస్త్వం పూజయిత్వాతుమాంచిరం
తవసూత్ర ప్రకారేణ తతస్త్వాగచ్ఛమేపదం.

తా. అప్పుడా ఋషీశ్వరుల నందరిని వీక్షించి, నారాయణుడు మునిశ్రేష్ఠుడైన వైఖానసునితో కొంచె మిట్లనియె. ఓ విఖనసమునీ నీవు నాయంశ సంభూతుడవు నీ సూత్ర ప్రకారము చిరకాలము నన్నారాధించి తరువాత నాపదంబునకు రమ్ము.

63. ఇత్యుక్త్వా దేవదేవేశో దేవనాథశ్శ్రియఃపతిః
ఉవాచ బ్రహ్మరుద్రాద్యాన్ త్రిదివేశానిదంవచః.

64. బ్రహ్మాదయస్సురాదేవా స్థానంతోతాద్రినామకం
ఆహూయవిశ్వకర్మాణం దివ్యంపురమివాపరం.

65. పురీంశ్రీవిల్లిమంకాఖ్యాం నిర్మాపయతుమ్మష్ఠథ,
చతుర్వర్ణాంశ్చ సంస్థాప్య మమనిత్యోత్సవాదికాన్.

66. ఆగమోక్తప్రకారేణ మాససంవత్సరోత్సవాన్
యస్మిన్కాలేచవిహితా నిత్యపూజాదికోత్సవాః

67. తత్కాలేకురుతన్నృణాం తాన్ సర్వాన్మునిసత్తమ
ఏవంభగవతోవాక్యం శ్రుత్వాదేవాస్తథేతితే.

68. వసంతోత్రాద్రినామైత త్పురమింద్రపుర శ్రియం
సత్వరంత్వంకురుష్వేతి విశ్వకర్మాణమబ్రువన్.

తా. అని దేవనాథుడైన శ్రియఃపతి విఖనసున కాజ్ఞాపించి, బ్రహ్మరుద్రాది దేవతలతో, మీరందరు తోత్రాద్రియను పేరుగల యీ దేవనివాస స్థానమును దేవనగరమువలె శ్రీవిల్లిమంకమనుపేరుచే విశ్వకర్మను బిలచి, నా యొుక్క నిత్యోత్సవాదుల నిమిత్తమై నాలుగు వర్ణముల వారిని స్థాపించి, పురనిర్మాణంచే యించదగుదురు. ఆగమోక్త ప్రకారమ నానిత్యమాస సంవత్సరోత్సవాదుల నేయే కాలములయం దెయ్యవి జరుగవలయునో, ఆయా కాలములయందాయా యుత్సవములను జనులందరు జరిగించుచుందురు గాక. అని యిట్లానతిచ్చిన భగవద్వాక్యమును దేవతలందరు విని శిరసావహించి తోత్రాద్రియన పేరుగల యీవనమును దేవేంద్రపురమువలె శీఘ్రముగా నొనరింపుమని విశ్వకర కాజ్ఞాపించిరి. పిమ్మట.

76. ఏవంవినిర్మితా తేన సాపురీవిశ్వకర్మణా
శ్రీవిల్లిమంకానామేతి క్షణమాత్రేణ సాబభౌ.

తా. ఈ ప్రకార మావిశ్వకర్మచే నిర్మింపబడిన యాపురమం శ్రీవిల్లిమంకమనుపేరుచే క్షణమాత్రములో ప్రకాశించెను.

(అందు చతుర్వర్ణములవారును సకల సంపత్సమృద్ధులు గలవారలై యుండిర అని కథాసందర్భము.)

81. తస్మిన్ శ్రీవిల్లిమంకాఖ్యే పత్తనేశ్రీపతిస్స్వయం
ఆవిర్భూతో జగన్నాథో వసతిస్మసురేశ్వరః.

తా. ఆ శ్రీవిల్లి మంకమనే పట్టణమందు శ్రీనివాసుండు స్వయముగా నావిర్భవించి యుండెను.

82. వైఖానసోమునిశ్రేష్ఠో రోమశశ్చమహాతపాః
పతంజలిశ్చ భగవా న్నా గేశస్త్రిలోచనః.

83. అతిథిశ్చమహాప్రాజ్ఞో శతాయుశ్శతయాగకృత్
అన్యేచమునయోభక్తా ఋషయో బ్రహ్మవాదినః.

84. పంకతామరసేతీర్థే స్నాత్వానిత్యంజితేంద్రియాః
ప్రత్యహం ప్రాతరుత్థాయ నత్వాతోతాద్రినాయికం.

85. పూజయంతశ్చతంభక్త్యా దేవనాథ స్యసన్నిథౌ
సుసుఖంసంస్థితా స్తస్మిన్ త్యక్త కార్యాంతరోద్యమాః

తా. మునిశ్రేష్ఠులైన వైఖానసరోమశపతంజలి నాగేశ త్రిలోచన అతిథి శతాయు మొదలైన మహాఋషులందరు పంకతామర సతీర్థంబున నిత్యస్నాతులై తోతాద్రినాథుని పూజించుచు నాస్వామి వారి సన్నిధి యందు కార్యాంతరానారంభులగుచు సుఖముగ నుండిరి.

**ఇంతవరకు తోతాద్రి మాహాత్మ్యము. 11 అధ్యాయము**

**నముచి వృత్తాంతము.**

**మంగళాద్రి క్షేత్ర మాహాత్మ్యము**

ఇట్లుండ గొంత కాలంబునకు దితిసంతతిలోని వాడైన నముచియను నసుర నాయకుండొకండు బలదర్పాతి రేకంబులు గలిగి విరించిం గురించి తపంబొనరించి వరంబు గొని యావర గర్వంబున సర్వలోకకంటకుండగుచు దేవఋషి సంఘంబుల కపకారంబు లొనరించుచు నుండె. అంతట నింద్రాది దేవబృందంబులు నిలింపారాతియొనరించు యకృత్య కరణా సహిష్ణులై పితామహుని పాలికింబోయి యసురుని యుదంతం బెరింగించిరి. పరమేష్ఠియు నానిర్జర గణంబుల కభయ ప్రదానం బొనరించి వారలందోడ్కొని వైకుంఠ నగరంబునకుం బోయి యచ్చట శ్రీమన్నారాయణ దేవుని యనేక వేద వేదాంతములచే స్తోత్రముగావించి కృతాంజలి పుటులై నిలువంబడిరి. కరుణాసముద్రుడైన భగవంతుండా దేవప్రార్థనా దైన్యంబుగని వారల మనోరథంబు దీర్పువాడై నముచి దానవుంబరి మార్చెద శీఘ్రంబుగ మీ మీ నివాసంబులకు బోవలయును అని యాజ్ఞాపించె. అది విని నిలింపు లపరిమితానంద కందళిత హృదయారవిందులగుచు తమ తమ నివాస ప్రాప్తులైరి. పిమ్మట నారాయణ దేవుండు నృహింహాకారమును ధరించి కలియుగంబున మంగళాద్రియను పేరుచే నొప్పుచున్న హ్రస్వశృంగి పర్వత కంధరంబున

చక్రాకృతి యందవతరించి యుండె. అంతలో విధి చోదితుండయి యాగిరి కంధరంబున కరుదెంచిన నముచిదానవుని భస్మీభూతునొనరించి యచ్చటనే నివసించి యుండెను. అందువలన లోకభయంబు నివారణంబై సుఖంబుగా నుండిరి. తరువాత నా చక్రాకృతి యందు నిలచి యున్న నృసింహుని రౌద్రంబునకు సహింపజాలక నింద్రాది దివిషద్వర్గంబు లనేక విధంబుల స్తుతించియు శాంతింప జేయజాలక విరించి పాలికింబోయి విన్నవించిరి. అప్పుడా పితామహుండాదరా యత్తచిత్తుండై యిట్లనియె. ఓ సురలారా! లోకంబున గల దైత్య దానవ మదభేదనంబునకై నారాయణుడవతరించి జగంబులు రక్షించి ధర్మసంస్థాపనం బొనరించుచు నర్చారూపముగా నివసించి యుండును. ఆరూపము నర్చించి నప్పుడు గాని శాంతి స్వరూపముగా నేరదు. సృష్ట్యాది యందు నారాయణదేవుండు తానర్చా రూపముగా నవతరించిన చోటుల నెల్ల తన్నర్చించుటకై నాయందు బ్రవేశించి వేద వేదాంతసారము నొక మునీంద్రునిగా సృజించి యమ్మునీంద్రునకు విఖనసుడని నామధేయంబు గావించి, తానే మహాలక్ష్మీ సమేతుడై వేద వేదాంగములు లుపదేశించి జాతకర్మాద్యష్టాదశ శారీర సంస్కారములు గావించి యున్నాడు. అమ్మునీంద్రులు సహస్రకవచుని సంహరించుటకై యవతరించిన నర నారాయణుల నర్చించుచు బదరీవనంబున నున్నవారు గావున మీరందరు నావిఖనసమునీంద్రుని వద్దకు బోయి మంగళాద్రి యుదంతం బెరింగించి యచ్చటికిం దోడ్కొని పోయి యా నృసింహమూర్తి నర్చింప జేసితి రేని యా రౌద్రంబుతో గూడిన రూపంబు పరమశాంతి స్వరూపంబు కాగలదు. అని బోధించెను.

## విఖనస ఋషి మంగళాద్రికి వేంచేయుట

అది విని దేవతలందరు విధి చోదితులగుచు బదరీ వనంబునకు బోయి యచ్చట నరనారాయణ పూజా.

పరతంత్రులను భృగుమరీచ్యత్రి కశ్యపాది మహాఋషి సంఘసంస్తూయమానులును, తపోనిష్ఠాగరిష్ఠులను, సూత్ర కర్తలును వేద వేదాంగ స్వరూపులును, సాక్షాన్నారాయణాంశ సంభూతులుననగు శ్రీవిఖనసమునీంద్రుల సందర్శించి యనేక విధంబుల స్తుతించి స్వామీ మంగళాద్రియందు చక్రాకృతి యందు నృసింహ రూపము

ధరించి నారాయణుం డవతరించి నముచిదానవుంగడతేర్చి యున్నాడు. ఆమహారౌద్రరస ప్రధానావతార శాంత్యర్థమై వేదవిహితోప చారంబుల బూజించి లోకంబులకు శాంతికరంబుసేయు గలందుల కంబుజాసనచోదితులమై తమ సన్నిధానంబున కరుగుతెంచితి మదిగావున మాయాపన్నత్వంబు వారించిరక్షింప గోరుచుంటిమి. అనియనేక విధంబుల విన్నవించుటయు నా విఖనసమునీంద్రులును దయామయాంతరంగులై తాము సేయుచున్న నరనారాయణార్చావతారార్చనాధికారంబు భృగుమరీచ్యత్రి కశ్యపులకు నిచ్చి యీ స్వామి నర్చించుచు మీరలీ యరణ్యంబున గల సర్వజనులను నిరుపద్రవంబుగా సంరక్షించుచుండ వలయునని బోధించిరి.

## 22వ అధ్యాయము

శ్లో.30. తస్మిన్కాలేతు తోతాద్రిం నృహరిస్సముపాగతః
తత్పూజార్థంతు విఖనా దేవైస్సంప్రార్థితోమునిః

శ్లో.31. సప్తర్షిభిస్సమాగత్యవైదికేనసమర్చితః
వైకుంఠాధిపపూజార్థం సైనేశేన ప్రబోధితః

తా. ఆకాలమందు వైకుంఠాధిపతియైన భగవంతుడు, నృహరియై మంగళాద్రికి వచ్చెను. ఆన్నృసింహు నర్చించుటకునై దేవతలచే ప్రార్థింపబడి విష్వక్సేనులచే బోధింపబడి సప్తమహా ఋషులతో గూడి విఖనసమహాఋషి వేంచేసి, యా నృసింహ స్వామి వారిని వైదిక విధానంబుచే నర్చించెను. పిమ్మట నాన్నృసింహుడు శాంతి నొంది సకలభక్తలోక రక్షణార్థ మాగిరకంధరంబున నివసించియుండె. ఇట్లు చిరకాలమా భగవంతు నారాధించి యాదేశంబున గల సకల జనులకు సౌఖ్యంబు గలుగ జేసి యనంతరము.

## విఖనసమహాముని శ్రీవైకుంఠ మలంకరించుట.

శ్లో.32. తతోగౌతమపౌత్రంచ శతానందస్యపుత్రకం
శతప్రాదం సమామంత్ర్య నృసింహం సమ్యగర్చయ.

33. నృసింహస్యప్రసాదేన తద్వంశోవిస్తరిష్యతి
ఇహలోకే సుఖంప్రాప్య హ్యంతేవైకుంఠ మేష్య.

34. మత్కృతార్చావిధానేన షట్కాలం సమపూజయు
ఇత్యుక్త్వావిఖనాశ్శిష్యం వైకుంఠమధిజగ్మివాన్.

తా. విఖనన మహర్షి గౌతమ పౌత్రుడును శతానంద పుత్రుడును నగు శతప్రోదుని రప్పించి నాచే చేయబడిన షట్కాలవిధానముచే నీ నృసింహస్వామి వారి ననుకూలముగ నర్చించుచుండుము. పిమ్మట నీ నరసింహానుగ్రహంబున నీ వంశము విస్తరించగలదు. ఇహలోకంబున సుఖమునుభవించి యంత్యమునందు వైకుంఠమును పొందగలవు. అని శిష్యునితో చెప్పి తాము శ్రీవైకుంఠము నధిష్టించిరి.

**శతప్రోదుడు మంగళాద్రి నృసింహు సన్నిధిలో విఖనసుని ప్రతిష్ఠించుట.**

శ్లో.35. తదాజ్ఞామతిలాభేన శతప్రోదమహామునిః
మునిం జ్యేష్టంవిఖనసం నృహరేస్సన్నిథౌ గురుం

36. ఉదన్ముఖంసమాసీనం ప్రతిష్ఠాప్య విధానతః
మంత్రాది ప్రాయశ్చిత్తాంతం నిత్యం గురుమనుస్మరన్.

37. యేన వేదార్థ విజ్ఞేన లోకానుగ్రహ కామ్యయా
ప్రణీతం సూత్రమౌఖేయం తస్మై విఖనసేనమః

38. ఇతి సంప్రార్థ్య చ గురుం తద్ధస్తేన సమర్చయేత్
శతప్రోదస్సముద్వాహ్య పంచపుత్రానసూయత.

39. నృహరేరర్చ నార్థంతు పుత్రాన్ పౌత్రాన్ తథైవచ
అర్చావిధానంసందిశ్య తపోవనగతోమునిః

తా. పిమ్మట నాశతప్రోదమహాముని యావిఖనస మహాఋషి యాజ్ఞాబుద్ధి లాభముచే తమకు జ్యేష్ఠులును గురువులునైన శ్రీవిఖనసమునీంద్రుల నర్చారూపముగా నా నృసింహస్వామి వారి సన్నిధియందుత్తరాభిముఖముగ గూర్చుండి నట్లు ప్రతిష్ఠించి విధి ప్రకారము మంత్రాది ప్రాయశ్చిత్తాంతము జరిపి నిత్యమును వేదార్థ వేత్తయైన యే మహర్షిచే లోకానుగ్రహము కోరుచు నౌఖేయ (వైఖనస) సూత్రము రచింపబడినదో అట్టి విఖనసునకు నమస్కరించుచుంటినని గురుప్రార్థనంబు చేయుచు, తన హస్తముల నా

విఖనసమునీంద్రుల హస్తములుగా భావించి శ్రీనృసింహదేవునర్చించుచు గృహస్థ ధర్మావలంబుడై పుత్రపంచకంబును వడసి తరువాత పౌత్రులు గలవాడై యా నృసింహుని యర్చనా విషయమై పుత్రులను పౌత్రులను నియమించి వారి కర్చనావిధానం బుపదేశించి తాను తపోవనంబునకు బోయెను.

ఇతి శ్రీమద్వైఖానస సూత్ర పవిత్ర గౌతమ సగోత్ర నృసింహాచార్య పుత్ర వాడపల్ల్యన్వయ సకలసజ్జనని విధేయ కృష్ణమాచార్య నామధేయ ప్రణీతంబైన పూర్వాచార్య చారిత్రమను నామాంతరము గల శ్రీ వైఖానసో పాఖ్యానంబునం బూర్వ భాగము సమాప్తము.



శ్రీరస్తు

శ్రీమద్వైఖనస దేశికేంద్రాయనమః

# శ్రీ వైఖానసోపాఖ్యానము

## ఉత్తరభాగము

శ్లో. శ్రీలక్ష్మీవల్లభారంభాం, విఖనోముని మధ్యమాం
అస్మదాచార్యపర్యంతాం, వందేగురుపరంపరాం.

తా. లక్ష్మీనాయకుడైన నారాయణుడు మొదలు విఖనసమహర్షి మధ్యగా గలిగి బ్రహ్మోపదేశ కర్తలైన ఆచార్యులవరకు గల మధ్యవారలందరు గురుపరంపరలోని వారలుగాన నాగురుపరంపరను గూర్చి నమస్కరించుచున్నాడను.

## గురుపరంపరాక్రమము

శ్లో. శ్రీమన్నారాయణదేవం, లక్ష్మీయుక్తంసనాతనం
విష్వక్సేనాభిదం శ్రీమద్విఖనోమునిమాశ్రయే.
ఏకాయనీమహాశాఖా, మూలం పరమవైదికం
భృగ్వాదీనాం వైష్ణవంయ శ్రీశాస్త్ర ముపదిష్టవాన్.

తా. విష్వక్సేన పదాభిధీయమానుడును లక్ష్మీసమేతుడును అయిన శ్రీమన్నారాయణ దేవునియు, ఏకాయనీశాఖా మూలమును, పరమవైదికమును, వైష్ణవమును ఐన భగవచ్ఛాస్త్రమును భృగ్వాదిమహాఋషుల కుపదేశించిన శ్రీవిఖనస మునీంద్రులను ఆశ్రయించు చున్నాను.

శ్లో. తచ్ఛిష్యాన్ వాలఖిల్యాదీన్ సనకాదీంశ్చ యోగినః
భృగుం మరీచిమత్రించ, కశ్యపంచ మహామునిం
వసిష్ఠం జమదగ్నించ, దక్ష మంగిరసం తథా.

తా. ఆవిఖనస మునీంద్రులకు వాలఖిల్యాదులు సనకాదిమహా యోగులు భృగుమరీచ్యత్రి కశ్యపులు, వసిష్ఠ జమదగ్ని దక్షాంగిరసులు శిష్యులై యున్నారు.

శ్లో. భృగ్వాదిశిష్యంహారీతం, భగవచ్ఛాస్త్ర పారగం.

తా. వారలలో భృగ్వాదులకు భగవచ్ఛాస్త్ర కర్తయైన హారీ తమహాఋషి శిష్యుడై యున్నాడు.

## హారీతమహర్షి చరిత్రము

ఈ మహర్షి హారీతస్మృతియను ధర్మశాస్త్ర ప్రణేత. అందుముఖ్యముగా విష్ణుపూజా విధానమును వైష్ణవధర్మములును, అంబరీష్ మహారాజున కుపదేశింపబడినవి.

## 8 వ అధ్యాయము

శ్లో. అధవక్ష్యామి రాజేంద్ర విష్ణుపూజా విధింపరం
శ్రౌతంమహర్షిభిఃప్రోక్తం, వసిష్ఠాద్యైః పురాతనైః
వైఖానసైశ్చ భృగ్వాద్యైః, సనకాద్యైశ్చ యోగిభిః
వైష్ణవైర్వైదికైః పూర్వై, ర్యద్యదాచరితంపురా
తత్తేవక్ష్యామి రాజేంద్ర, మహాప్రియతమంహరేః.

తా. పురాతనులైన వసిష్ఠాదుల చేతను వైఖానసులైన భృగ్వాదులచేతను, సనకాది యోగుల చేతను, వైదికులైన వైష్ణవుల చేతను, ఆచరింపబడిన ఉత్కృష్టమైన విష్ణుపూజను విధించుచున్న యేవైఖానస సూత్రము కలదో అట్టి వైఖానస సూత్రోక్తమైన విష్ణుపూజా విధిని నీకు చెప్పుచుంటిని. అని హారీతమహర్షి అంబరీషునితో చెప్పుచున్నాడు.

ఇచ్చట శ్రౌతమనుపదమునకు వైఖానసము అని యర్థము. అది యెట్లన, హారీత మహర్షి విష్ణుపూజా విధాన మంబరీషుని కెరింగించి పిమ్మట నాతనితో,

శ్లో. ఏతచ్ఛ్రౌతం నృపశ్రేష్ఠ, మునిభిస్సంప్రకీర్తితం
సమ్యగుక్తం మయాతేకద్య, నిశ్చితం మతముత్తమం
ఏతత్ప్రియతమంవిష్ణోః, శ్రియోనాధస్య సర్వదా
శ్రౌతస్మార్తాగమైర్విష్ణోః, త్రివిధంపూజనం స్మృతం
శ్రౌతమేవ విశిష్ఠంస్యాత్తేషాంనృపవరోత్తమ.

తా. ఓరాజా! మునీశ్వరులచే చెప్పబడిన యాశ్రౌతము నాచేతనిప్పుడు నీకు

బాగుగ చెప్పబడినది. ఇదియే శ్రీ మహావిష్ణువునకు ప్రియతమమైనది. విష్ణుపూజా విధానము (శ్రౌతము, స్మార్తము, ఆగమము) అని మూడు విధములు. వాటిలో శ్రౌతమే శ్రేష్ఠమైనది.

అని చెప్పుటచే విష్ణుపూజకు, శ్రౌతమార్గమే ముఖ్యమైనదనియు నావిధానమే అంబరీషునికి మహర్షి యుపదేశించెననియు తెలియుచున్నది.

## పద్మపురాణోత్తర ఖండే 58 అధ్యాయము

శ్లో. శ్రౌతంవైఖానసంప్రోక్తం, వాసిష్ఠంస్మార్తముచ్యతే
పాంచరాత్రవిధానంయ, ద్దివ్యాగమ మితీరితం.

తా. వైఖానసము శ్రౌతమనియు, స్మార్తము వాసిష్ఠమనియు, పాంచరాత్రము ఆగమమనియు చెప్పబడినది. ఈ భగవదర్చ నావిధి.

శ్లో. విష్వక్సేనాయధాత్రేచ సంప్రోక్తం పరమాత్మనా
విష్వక్సేనేన సంప్రోక్తమే తద్విఖన సేపురా
భృగోః ప్రోక్తం విఖనసా, భృగుణాచమహర్షిణా
వైవస్వతమనోఃప్రోక్తం, మనునాచమమేరితం.
మనుస్తు ధర్మశాస్త్రంతు, సామాన్యేనోక్తవాన్స్వయం
తదేవహిమయారాజన్ వైశిష్ట్యేనత వేరితం.

తా. పరమాత్మచేత భగవదర్చనావిధి విష్వక్సేనుల కొరకును పరమేష్ఠి కొరకును చెప్పబడినది. ఇదియే విష్వక్సేనులచే నింతకుపూర్వము విఖనసుకును, ఆ విఖనస మహర్షిచే భృగుమహర్షికిని, ఆ భృగువుచే వైవస్వతమనువుకును, ఆ మనువుచే నాకు చెప్పబడినది. మనువు స్వయముగా ధర్మశాస్త్రమును చెప్పెను. అదియే నా చేత నీకు చెప్పబడినది. అని అంబరీషునకు హారీతమహర్షి చెప్పుచున్నాడు. ఇచ్చట విష్వక్సేనులచే పూర్వము విఖనసునకే శ్రీ శాస్త్ర ముపదేశింప బడెనని చెప్పుట చేతను, మొదట విష్వక్సేనులకు విష్ణువుచే చెప్పబడినట్లును యుండుటచే విష్ణువునకు విఖనసునకు మధ్యవిష్వక్సేనులు వచ్చుచున్నారు. గాన వైఖానసులకు విష్వక్సేనులు పరమాచార్యులును విఖనసులు ఆచార్యులు నగుచున్నారుగాని విష్ణువు పరమాచార్యులు కాలేదని కొందరు చెప్పుచున్నారు.

విష్వక్సేనో జనార్దనః అని అమర నిఘంటువునందు విష్వక్సేనులును, విష్ణువేయని చెప్పుచున్నది. కాబట్టి యీభగవచ్ఛాస్త్రమును శ్రీ మహావిష్ణువుచే విఖనసునకును విష్వక్సేనులకును బ్రహ్మకును చెప్పబడినదని తెలియనగును. ఈ ఋషిసంతతి వారలందరును హారీతసగోత్రులుగా నొప్పిరి.

**హారీతప్రభృతి శిష్యవర్గము**

శ్లో. మార్కండేయంచారుణించ, శ్వేతాశ్వతర యోగినం
అధర్వణం పిప్పలాదం, భగవచ్ఛాస్త్రపారగం
సత్యకామంగార్గ్యమునిం, వాజశ్రవసనామకం
నచికేతుం వామదేవం, వరుణంభృగునామకం
కాశ్యపంచైవకణ్వంచ, మునిప్రవరసేవితం
శాకలంద్రుష్టబాలాకిం, బాష్కలం మునిసత్తమం
మాండూక్యం చ్యవనం చాగ్నివేశం కౌషీతకింతతః
గాలవంచైవ మారీచం, యోగినం యోగభూషణం
హిరణ్యకేశినం చైవ, గోబిలం మునిసత్తమం
శాతాతపమునించైవ, మేధాతిథిమనుత్తమం
సుతపోమునినాధంచ, నారాయణమనుత్తమం
నారదంచ మహాశాలిం, శౌనకం యమినాంవరం
దత్తాత్రేయం క్రతుమునిం, సుక్రతుం శరభంగకం
సుతీక్ష్ణంధర్మిణంచైవ, ధర్మభృన్ముని సత్తమం
శతానందంచ సువ్రతం, శాంతం ధౌమ్యం సుమేధసం
పరాశరం వ్యాసమునిం, శుకం దేవవ్రతంతధా
విష్ణువర్ధనమౌనీంద్రం, నారాయణ మనంతరం
కేశవాచార్య మిత్యేతే క్రమాచ్ఛిష్యోప శిష్యకాః
హారీతమహర్షి మొదలు క్రమముగా శిష్యవర్గము.

మార్కండేయముని, అరుణిముని, శ్వేతాశ్వతర యోగి, అధర్వణముని, పిప్పలాదముని, సత్యకాముడు, గార్గ్యముని, వాజశ్రవస్సు, నచికేతుముని, వామదేవుడు,

వరుణముని, భృగుముని, కశ్యపముని, కణ్వముని, శాకలముని, దృప్తబాలాకిముని, బాష్కలముని, మాండూక్యముని, చ్యవనముని, అగ్నివేశముని, కౌషీతకముని, గాలవముని, మారీచయోగి, హిరణ్యకేశి, గోభిలమహర్షి, శాతాతపఋషి మేధాతి, కఠయోగి, జాబాలి, సుతపోముని, నారాయణముని, నారదముని, మహాశాలముని, శౌనకముని, దత్తాత్రేయముని, సుక్రతుముని, క్రతుముని, శరభంగముని, సుతీక్ష్ణముని, ధర్ముడు, ధర్మభృత్తు, శతానందముని, సువ్రతముని, శాంతముని, ధౌమ్యుడు, సుమేధసుడు, ఆత్మవేది, పరాశరముని, వేదవ్యాసముని, శుకుడు దేవవ్రతుడు విష్ణువర్ధనుడు, నారాయణ, కేశవాచార్యులు.

### కేశవాచార్యుల వారి చరిత్రము

వీరలే భృగ్వాదిమునుల తరువాత వైఖానస గ్రంథములను, విమర్శించినవారలు. వేదాంత వ్యాససూత్రములకు వృత్తిని చేసిరి. పిమ్మట దైవికమును విమర్శించి అందు ముఖ్యమగునది భగవదారాధనము గావున నందునుగురించి భృగ్వాదులొనరించిన యర్చనా ప్రకరణములకు వ్యాఖ్యానము సాయించిరి. అందువలన భగవదర్చనావిధి విధానములు సుకరముగా నెరింగి యాచరించుట కుపయోగముగా నున్నది. ఆ గ్రంథము పేరు అర్చనానవనీతము. అది ఐదు ఖండలుగా నేర్పరుపబడినది.

శ్లో. శ్రీవైఖానస దుగ్ధాబ్ధౌ, మథితం మతిమంథరాత్
అర్చనానవనీతాఖ్యం, కేశవేనామృతంయథా.

తా. "పాలసముద్రమునం దమృతము గూర్చి కేశవునిచే మథింపబడిన రీతిగా నీ కేశవునిచే వైఖానస దుగ్ధాబ్ధియం దర్చనా నవనీతమును గురించి మథింపబడినది" అని మొదట వ్రాసిరి. ఏమన శ్రీవైఖానసులకు విష్ణువే ప్రధానదైవము. ఆ విష్ణువు నారాధించుటకై జన్మించిన వారలు గావున నా విష్ణుమూర్తిని పరాత్పరునిగా నియమించిరి యెట్లన.

సంధ్యావందనము కాదిని, కేశవ, నారాయణ, యని, చతుర్వింశతి భగవన్నామము లుచ్ఛరించుటయును, శరీరశుద్ధికి పుండరీకాక్ష స్మరణము సేయుటయును, సంధ్యావందనాంత్యమున సర్వదేవనమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి అను ప్రమాణముచే

నే దేవునకు నమస్కరించినను కేశవుని గూర్చి యానమస్కృతి పొందుటయును, వేదారంభమందు (హరిఃఓం) అనుటయు, వేదాధ్యయనాంత్యమందు శ్రీకృష్ణార్పణమస్తు అనుటయు, సన్యాసులగు మతత్రయము వారలకు నారాయణ స్మరణమే యుపాదేయ మగుటవలనను ''మంత్రమధ్యేక్రియామధ్యే విష్ణుస్మరణ పూర్వకం'' అనియు విష్ణుర్విష్ణుర్విష్ణుర్విష్ణుః. అని విష్ణుస్మరణంబు సేయుటవలనను. శ్రార్ధ సంరక్షక శ్రీ మహావిష్ణోః అనుటయును గయయందు విష్ణుపాదమున ఉంచిన పిండముచే పితరులు మోక్షము నొందుటయును, శ్రార్ధానంతరము శ్రీ వాసుదేవజనార్ధనః ప్రియుతాం, అనుటయు, శ్రీ గోవింద గోవింద యని సంకల్పము చేయుటయును, నారాయణ నమస్తేస్తు శంఖ చక్ర గదాధర అని యుపరమం దుచ్ఛరించుటయును శ్రీ మహావిష్ణోరాజ్ఞయా అనుటయును, సర్వకార్యముల క్రియాసమర్పణ కాలముల యందును శ్రీ వాసుదేవ జనార్ధనః ప్రియుతాం, అనుటయు అపత్సమయము నందు శ్రీ కృష్ణకృష్ణయని కృష్ణస్మరణము సేయుటయు, నావిష్ణుః పృథివీపతిః అను న్యాయముచే విష్ణ్వంశము లేని యెడల సర్వాధికారము రాదనే శాస్త్రము వలనను, సర్వజగత్పావని యగు మహాగంగ విష్ణుపాదముల యందు జన్మించుటయును, సర్వం విష్ణు మయంజగత్. అనుటచేతను మరియు నీ మొదలైన యనేక ప్రమాణములచే శ్రీ మహావిష్ణువు పరాత్పరుండని నిశ్చయించిరి. అట్టి పరాత్పరుని గురించి.

శ్లో. ఆరాధనానాం సర్వేషాం, విష్ణోరారాధనంపరం
యేనకేన ప్రకారేణ, విష్ణోరర్చనముత్తమం,
ఆత్మార్ధంవా పరార్ధంవా, గృహేదేవాలయేఽపివా
అర్చనంవాసు దేవస్య, లక్షకోటి గుణంభవేత్.
స్వార్ధంగృహార్చనంప్రోక్తం, పరార్ధం త్వాలయార్చనం
పరార్ధంస్యాజ్జగచ్చక్షుః, స్వార్ధంస్యాద్గృహదీపికా.

తా. ఇతర దేవతారాధనలన్నిటితోనే విధనైనను విష్ణ్వారాధ సముత్కృష్టమైనదియు నుత్తమోత్తమ మైనదియునగును. తన నిమిత్తముగాని పరుల నిమిత్తముగాని గృహమందుగాని దేవాలయమందు గాని విష్ణునారాధించుట లక్ష కోటి గుణము కలది యగును. గృహమునందు గల దీపిక తన విషయమునను అంతరిక్షము నందున్న

సూర్యుడు పరుల విషయమున నెట్లుపయోగకరములై యున్నవో అట్లనే ఆలయార్చనము పరుల నిమిత్తమును గృహార్చనము తన విషయముననను నుపయోగములని యిట్లనేక విధములుగా భగవదారాధనా విధి విధానములు ఆలయ గోపుర ప్రాకారాది నిర్మాణాది క్రమములు మొదలయిన దైవికమును సకలజనోపయోగ కరములుగా ప్రతిపాదించి యున్నారు. తరువాత.

## వైఖానసనామరత్నావళి

శ్లో. నృసింహార్యం రాఘవార్యం, యశోదానందనంతథా
కృష్ణసూరింమాధవంచ, దేవనాథంచ పండితం.

తా. నృసింహాచార్యులు రాఘవాచార్యులు, యశోదానంద నాచార్యులు, కృష్ణమూర్తి, మాధవపండితుడు, దేవనాథుడు క్రమముగా శిష్యులై యున్నారు.

శ్లో. విప్రనారాయణంవందే, తచ్ఛిష్యం శృతికోవిదం

తరువాత విప్రనారాయణాచార్యులు, (విప్రరూపీ నారాయణా ఇతి విగ్రహః)

శ్లో. విప్రనారాయణాస్సంతః సమూర్తాధ్వరకోవిదాః
వైఖానసాబ్రహ్మవిదో, యోగజ్ఞావైష్ణవోత్తమాః
విష్ణుప్రియా విష్ణుదేవా, శ్శాంతాశ్రామణకాభిదాః
పారమాత్మికమంత్రజ్ఞాః, పాపఘ్నాః పుణ్యదాయినః
ఇమాంవైఖానసానాంతు, నామరత్నావళీంపరాం
యఃపఠేదనిశంభక్త్యా, సర్వపాపైః ప్రముచ్యతే.
ఇత్యర్చనాధికారే భృగుః.

తా. విప్రనారాయణాః బ్రహ్మస్వరూపులైన నారాయణులు సంతః సతాంవైఖానసాఖ్యానాం, సంభవోఽత్రనిరూప్యతే. అని వేదాంతదేశిక స్వామి తమ సజ్జన సంభవమున వ్రాసి యున్నారు. సజ్జనులనియును. (సమూర్తాధ్వరకోవిదాః)

శ్లో. అమూర్తంచసమూర్తంచ ద్విధోపాసనముచ్యతే
అమూర్తమగ్నౌ హోమంచ. సమూర్తం బేరపూజనం.

తా. అమూర్తమనియు సమూర్తమనియు నుపాసన రెండు విధములు. అగ్నియందు హోమము సేయుట అమూర్తార్చనమనియు విగ్రహారాధనము సమూర్తార్చన మనియు చెప్పబడుచున్నది. కావున విగ్రహారాధనయందు పండితులు

**వైఖానసాః**

విఖనసమునినాప్రోక్తం సూత్రమధి కృత్యతన్మార్గాను సారిణో వైఖానసాః. ఇతి మాహేశ్వరతీర్థః రామాయణే.

తా. విఖనసముని చేత చెప్పబడిన సూత్రము ననుసరించి యా మార్గముగా నడుచువారలుగాన వైఖానసులు.

**బ్రహ్మవిదః**

నిరంతర భగవత్కైంకర మహిమాతిశయంబున నెరింగిన పరబ్రహ్మము గలవారులు గావున బ్రహ్మవేత్తలు.

**యోగజ్ఞాః**

భగవత్ప్రాప్తి యోగము నెరింగిన వారలుగాన యోగజ్ఞులు.

**వైష్ణవోత్తమాః**

విష్ణుభక్తులందరు వైష్ణవులేయగుదురు. వారలలో సర్వదా భగవదారాధకు లగుటచే వైష్ణవోత్తములు.

**విష్ణుప్రియాః**

1. విష్ణుమూర్తికి ప్రియమైన వారలు. 2. విష్ణవే ప్రియముగా గలవారలు. ఓన్నమోవిష్ణవే అను నామాక్షరములు గల విష్ణుమూర్తిమంత్రమును బట్టి, ప్రాజాపత్య సౌమ్యాగ్నేయ వైశ్వదేవ బ్రహ్మ శుక్రీయములను నారువేద వ్రతములు గలవు. వాటిబంధ విసర్గముల యందు అజ్యాహుతులు గూడ ఆరే గలవు. ఆ విధానముచే సంస్కరింప బడుచున్న వారలుగావున విష్ణవే ప్రియముగా గల వారలనియు అట్టి విష్ణుమూర్తి మంత్రముచే సంస్కరింపబడిన శరీరములు గలవారలగుటచే విష్ణుమూర్తి వారికి ప్రియమైన వారలనియు.

### విష్ణుదేవాః

అహమేవ గురుస్తేషాం గర్భవైష్ణవ జన్మనాం.

తా. గర్భవైష్ణవులైన వైఖానసులకు నేనే గురుడనని భగవద్వాక్యము.

గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః

గురువే బ్రహ్మ విష్ణు రుద్రస్వరూపుడని సామాన్యముగా నందరకును తెలిసిన విషయమే గావున విష్ణువే దేవతగా గలవారు.

### శాంతాః

భగవన్నిక్షిప్త సకల కార్య నిర్వాహకులై తదారాధనా విధివిశేషములచే శాంతి వహించిన వారలు గాన శాంతులు.

### శ్రామణ కాభిధాః.

శ్రావణకంనామ వైఖానసూత్రం. అని యజ్ఞస్వామిచే వ్యాఖ్యచేయబడినది. అట్టి వైఖానస సూత్రానుష్ఠాతలు గావున శ్రామణకులనియు.

### పారమాత్మిక మంత్రజ్ఞాః

పరమాత్మ సంబంధమైన యష్టాక్షరీ మహామంత్రోపా దేయులు గాన పారమాత్మిక మంత్రజ్ఞులనియు.

### పాపఘ్నాః

శ్లో. రూపద్వయంహరేః ప్రోక్తం, బింబంచైవార్చకస్తథా
బింబేత్వావాహనాదూర్ధ్వం, సదాసన్నిహితోఽర్చకే. అనియు
వైష్ణవీంప్రతిమాంలోకే విప్రంవైఖానసంతథా
గంగాం ''విష్ణుపదీం'' దృష్ట్వా, సర్వపాపైః ప్రముచ్యతే.

అనియు నుండుటచే బింబము అర్చకులును విష్ణువునకు రెండు రూపములు, బింబ (విగ్రహ) మందావాహనము చేసిన పిమ్మట అర్చకునియం దెల్లప్పుడును విష్ణువు

నిలచియుండును అనియు, విష్ణు విగ్రహమును వైఖానస బ్రాహ్మణుని విష్ణుపాదోద్భవియైన గంగను జూచి రేని సర్వపాపముల నుండియు విడువబడుదురనియు తెలియుచున్నది. గాన విష్ణుప్రతిబింబ మూర్తులగుటచే పాపఘ్నులనియు.

## పుణ్యదాయినః

భగవన్నివేదిత తీర్థ ప్రసాదాదికములచే సర్వజీవులను తరింప జేయువారలు గాన పుణ్యదాయినులనియు, వైఖానసులు చెప్పబడుచున్నారు. కాన మొదట వ్రాసిన విప్రనారాయణాః అనుటకు బ్రాహ్మణ రూపము ధరించిన నారాయణ మూర్తి యని తెలియనగును.

శ్లో. శ్రీలక్ష్మీనాథభట్టార్యం, శ్రీలక్ష్మీవల్లభంతథా
శ్రీరామచంద్రమభిదం, క్షీరాబ్ధిశయనంతతః
శ్రీకాంతభట్టాచార్యంచ, కేశవార్యమతః పరమ్

ఈ కేశవాచార్యుల వారిచే మీమాంసావృత్తి యను గ్రంధము చేయబడినది.

శ్లో. నృసింహార్యం రాఘవార్యం, రామాచార్యమతః పరం.
గోవిందార్యంచ కృష్ణార్యం, రంగనాధార్యమేవచ
వరదార్యం మహాత్మానం, తతశ్శ్రీపురుషోత్తమమ్ః

ఈ నరసింహాచార్యుల వారు వాజపేయయాగ మొనర్చిన వారలు గావున నృసింహ వాజపేయులని వీరికి సార్థకనామము కలిగినది. వీరిచే శ్రీవైఖానస సూత్రమునకు భాష్యము చేయబడినది. దానికి నృసింహవాజపేయమని ప్రసిద్ధ నామధేయము. మఱియు భగవచ్ఛాస్త్ర సంగ్రహరూప దర్పణమును వైఖానససూత్ర దర్పణమును వీరిచే వ్రాయబడినవి.

## భాస్కరంభట్టమేవచ

వారికి శిష్యులు భాస్కర భట్టాచార్యులు, వీరిచే వైఖానస దైవికమానుషిక ఖిలఋుజ్మంత్రములకు భాష్యము మొదలైన గ్రంధములు చేయబడినవి. ఆ భాష్యము యొక్క అష్టమ ప్రశ్నారంభమున భగవత్ప్రపత్తి ప్రకారము ప్రదర్శింపబడినది. మంత్ర

ప్రశ్నములకు వ్యాఖ్యానము వ్రాసిరి. దానిపేరు భాస్కరభట్టీయము.

శ్లో. పరమై కాంతినంతస్య, శిష్యంసుందర యాజినం.

తా. వారికి శిష్యులు పరమైకాంతులైన సుందర రాజభట్టాచార్యులు. వీరిచే వైఖానస సూత్రమునకు ప్రయోగము వృత్తిగల గ్రంథము చేయబడినది. దానికి సుందర రాజీయమని పేరు.

శ్లో. కృష్ణసూరింమహాత్మానం, తతోవాసంతయాజినం
అనంతాచార్యమనఘం తతోకనంతార్యయజ్వినం.

ఈ అనంతయాజ్యా చార్యుల వారిచే వైఖానస సూత్రమునకు వ్యాఖ్యానము వ్రాయబడినది.

శ్లో. శ్రీగోవిందార్యయజ్వానం, శ్రీనివాసార్యదేశికం
పారమాత్మిక మంత్రాణాం, వ్యాకర్తారంమహామతిం
సర్వతంత్రస్వతంత్రం శ్రీ, భాష్యకారంభజేసదా.
తరువాత గోవిందాచార్యుల వారికి శ్రీనివాసాచార్యులు.

## శ్రీనివాసాధ్వరిచరిత్రము

వీరి జన్మభూమి తిరుపతి. తండ్రి గోవిందాచార్యులు తల్లి. రుక్మిణి, వీరు శ్రీ వేంకటాచల శిరోభూషణులగు శ్రీనివాస పెరువాళ్ల సన్నిధి యందర్చనా పరతంత్రులు. కౌశిక సగోత్రులు. వీరినామ ధేయము శ్రీనివాసాచార్యులు. ఇష్టిచేసి దీక్షవహించి శ్రీనివాస దీక్షితులనియు, తరువాత నధ్వరము చేసి శ్రీనివాసాధ్వరియనియు పిలువబడిరి. వీరి జనన సంవత్సర నిర్దేశమునకు తిరునల్వేలి జిల్లా యిలత్తూరు గ్రామ వాస్తవ్యులయిన శ్రీ సుందరరాజ భట్టాచార్యులవారు వ్రాసిన శ్రీనివాస దీక్షితేంద్ర చరిత్ర మాధారముగా గ్రహింపవలసి యున్నది. అందు ''త్రింశతుత్తర చతుస్సహస్రేషు వ్యతీతేషు కలివర్షేషు సర్వజిద్వత్సరే వైశాఖే ప్రాజాపత్యే నక్షత్రే'' అని యున్నది. అందువలన కలివర్షములు 4030 నాల్గువేల ముప్పది గతించిన పిమ్మట వచ్చిన సర్వజిత్సంవత్సర వైశాఖ మాసములో రోహిణీ నక్షత్రమందు వీరి జననమని తెలియుచున్నది. అంతటి నుండి యింత వరకు గతించిన సంవత్సరములను క్రమముగా లెక్కింపవలసి యున్నది. అది యెట్లన.

కలియుగాదిగతాబ్దములు 5021 లోను.

వీరిజనన సంవత్సరమైన 4030 తీసివేయుగ

శేషము 991 వచ్చుచున్నది.

దీనివలన శ్రీనివాస దీక్షితులవారు జన్మించి తొమ్మిది వందల తొంబది యొక్క సంవత్సరమైనట్లు తెలియుచున్నది.

ఈ సంఖ్యను సంవత్సర సంఖ్యయగు నరువదిచే భాగింపగా

60) 991 (16

960

శేషము 31 వచ్చుచున్నది.

ంయీ చరిత్ర వ్రాసిన రౌద్రిసంవత్సరమునకు వెనుక పదియారం రౌద్రిసంవత్సరములు గతించినపిమ్మట ముప్పది యొకటవ సంవత్సరము వీరి జనన వత్సరమగుచున్నది. రౌద్రికి పూర్వము 31వ సంవత్సరము విరోధి సంవత్సర మగుచున్నది. గాన సర్వజిత్తు రావడం లేదు. చరిత్రమునందు సర్వజిత్తని వ్రాసినారు కావున ద్వ్యానత్రింశ దుత్తర చతుస్సహస్రేషు వ్యతీతేషు కలివర్షేషు అని సవరించినచో, 4028 వ సంవత్సరమగుచున్నది. ఇప్పటికి గతించిన కలియుగాబ్దములు.

| | |
|---|---|
| 60) 993 ( 16 | 5021 లోను |
| 960 | 4018 తీయుగ. |
| 33 | 993 శేషము. |

ద్వ్యానత్రిశంత్ అని సవరించిన చరిత్రములు కొన్ని గలవు. అట్లయినచో రౌద్రికి పూర్వము ముప్పది మూడవ సంవత్సరము సర్వజిత్తదిగుచున్నది. కావున కలివర్షములలో 4028వ సంవత్సరమగు సర్వజిద్వర్ష వైశాఖమాసములో వీరి జననముగా తెలియును. తిథి మాత్రమింతటితో తెలియుట లేదు. ప్రాజాపత్యే నక్షత్రే, అనుటచే రోహిణీ నక్షత్రమని చెప్పవచ్చును. వైశాఖమాసములో రోహిణి యే తిథియందువచ్చునని యాలోచించ వలయును. చిత్తానక్షత్రముతా పౌర్ణమాసీ చైత్రము గదా. అది మొదలు రోహిణి 18వ నాటికి వచ్చుచున్నది చైత్రపూర్ణిమకు. 18వ రోజు. వైశాఖ శుద్ధ విదియ యగుచున్నది. కాబట్టి కలివర్షములు 4028వ సంవత్సరమగు సర్వజిద్వత్సర వైశాఖశుద్ధ విదియ రోహిణీ

నక్షత్రమందు వీరి జననమని నిర్ణయింప బడుచున్నది. వీరు ఇష్టి చేసి దీక్షను వహించి యాకాలమున కొన్ని గ్రంధములను రచించిరి. వాటి యంత్యమగు గద్యయందు శ్రీనివాస దీక్షిత విరచితమని వ్రాసి యున్నారు. తరువాత నధ్వరము చేసి బ్రహ్మ సూత్రములకు భాష్యము వ్రాసిరి. అది లక్ష్మీ విశిష్టాద్వైత భాష్యమని ప్రసిద్ధి వహించి యున్నది. అందు శ్రీవిశిష్టాద్వైత మతమునకు లక్ష్మీనారాయణులే ముఖ్యులని ప్రతిపాదించిరి. ఆ భాష్యాంతిమ గద్యయందు శ్రీనివాసాధ్వరి విరచితమని యుపయోగించిరి. బ్రహ్మ సూత్రభాష్యము సేయుటచే భాష్య కారులని పేర్కొనబడిరి. అందువలన వేదాంతోపదేశ కర్తలగుటచే వేదాంత దేశికు లనబడిరి. వైఖానససూత్రమునకు వ్యాఖ్యానము చేసిరి. అందువలన సూత్ర తాత్పర్యము సుకరముగ తెలియుచున్నది. ఆ గ్రంధమునకు శ్రీనివాస దీక్షితీయమని పేరు. వైఖానసోత్కర్షతాది ప్రతిపాదకములయిన యనేక గ్రంథములను రచించిరి. కొన్ని గ్రంధములయందు పాంచరాత్రనిషేధ ప్రమాణములను గనపరచిరి. యేలనన.

## భగవచ్ఛాస్త్రాత్రేయ తంత్రములో

శ్లో. వైఖానసేన విధినాపూజనం వైదికం స్మృతం
సర్వాభీష్ట ప్రదం నృణాం సంసారార్ణవతారకం
ఉత్తమోత్తమ మేతద్వై మునిప్రవరసేవితం
తాంత్రికంపాంచరాత్రేణ, పూజనంపరమాత్మనః
దీక్షితైః క్రియమాణంత న్మోక్షమాత్ర ఫలప్రదం
భక్త్యైవ పూజనంవిష్ణో, స్త్రీశూద్ర ద్విజబంధుభిః

తా. నారాయణుని వైఖానస విధానముచే పూజించుట వైదికమనియు అది నరులకు సర్వాభీష్ట ప్రదమనియు, సంసారార్ణవ తారకమనియు, ఉత్తమోత్తమైనదనియు, మునీంద్రసేవితమైన దనియు, పాంచరాత్ర విధానముచే పూజించుట తంత్రమనియు, అది దీక్షాయుక్త మైనదనియు, మోక్షమాత్ర ఫలప్రదమైనదనియు, స్త్రీ శూద్రులకును ద్విజులకును భక్తియే ప్రధానముగా విష్ణునారాధించుట కుపయోగకరమనియు చెప్పుచున్నది.

## హయగ్రీవ సంహితయందు.

శ్లో. అబ్ధినద్యాదితీరేషు పర్వతేషువనేషుచ
అర్చయే ద్వైదికేనాపి, పాంచరాత్రేణవాహరిం
విప్రావాసేషుసర్వేషు, పూజయేత్పురుషోత్తమం
వైదికేనైవవిధినా విష్ణుం రాజాజగద్ధితః.

తా. సముద్ర నదీ తీరములయందును పర్వత వనముల యందును, వైదిక విధానమైన వైఖానసముచే గాని పాంచరాత్రము చేతగాని శ్రీహరి నర్చింపవచ్చును. బ్రాహ్మణులు మొదలయిన వారు నివసించి యున్న గ్రామములయందు జగద్ధితము గోరిన రాజు వైదిక విధానము చేతనే అర్చింప జేయువలయును. అనియు చెప్పుచున్నది. ఇందువలన పాంచరాత్రము తాంత్రికమును, భక్తిమాత్ర ప్రధానమైనదనియు, కేవలం మోక్ష సాధనమైనదనియు, తురీ యాశ్ర మోపయోగమనియు, వైఖానసము, చతుర్వర్గ ఫలప్రదమనియు, గృహస్థాశ్రమాది చతురాశ్రమోపాదేయమనియు, బ్రాహ్మణులకు ముఖ్యోపాదేయ మరియు తెలియుచున్నది. మరియును.

## బ్రహ్మాండపురాణము - 9వ అధ్యాయము

శ్లో. తదాకశ్చిద్దైత్యవర్యో, సోమకస్తు మహాబలః
మమలోకమనుప్రాప్య, మాందృష్ట్వానిద్రితంముదా
మన్ముఖేసంస్థితా న్వేదాన్, జహార క్రూర ధీఃఖలః
తతః ప్రబుధ్వా రాత్ర్యంతే, స్నాత్వామే నిత్యకర్మణి
వర్తమానస్యతన్మంత్రం, నప్రబుద్ధంహి నారద
కి మేతదితిసంచింత్య, జ్ఞానదృష్ట్యా సమీక్ష్యచ
వేదాపహరణం జ్ఞాత్వా, తదాహందుఃఖితోఽభవం
ప్రాతరారాధనం విష్ణోః కథమద్యకరోమ్యహం
కాలోఽతీతోఽద్యభవతి, కాలపూజావిశిష్యతే
ఇతి సంచింత్యమౌనీంద్ర, సర్వజ్ఞస్య రమాపతేః
పాంచరాత్ర విధానేన, ప్రాతః పూజామయాకృతా.

శ్లో. ఏవం విజ్ఞాపయంతంమాం, దృష్ట్వాసర్వేశ్వరోహరిః,
సామాన్యకృపయావీక్ష్య, వేదం మహ్యందదౌతదా. 50

53. వేదోక్తేనవిధానేన, యధాపూర్వంమయామునే.

తా. సోమకాసురుడను రాక్షసుడొకడు నాలోకమునకు వచ్చి నిద్రించుచున్న నన్ను జూచి, నాముఖమందు గల వేదముల నపహరించెను. తరువాత తెల్లవారిన పిమ్మట మేల్కాంచి, స్నానము చేసి నిత్య కర్మములు తీర్చుకొనబోవగ నాయా మంత్రములు స్ఫురింపలేదు. ఇది యేమని విచారించి జ్ఞాన దృష్టిచే వేదాపహరణ మెరింగి, దుఃఖితుండనై విష్ణునారాధించుటకు ప్రాతఃకాల మతిక్రమించు చున్న దేమి సేయుదునని చాలా విచారించి, పాంచరాత్ర విధానముచే ప్రాతఃకాలమందు విష్ణునారాధించితిననియు నిట్లు విజ్ఞాపనము సేయుచున్న నన్ను జూచి సర్వేశ్వరుడయినహరి, సామాన్యకృపచే వేదమును నాకొసంగెను. ఆ వేదోక్త విధానముచే పూర్వపురీతిగ విష్ణునారాధించితి ననియు, నారదునితో బ్రహ్మదేవుడు చెప్పుచున్నాడు. ఇందువలన వేద విధానమైన వైఖానసము లేనప్పుడు తాంత్రికమైన పాంచరాత్రము గ్రహించినట్లు గన్పించుచుండుటయును.

4. పురాణోక్తమయిన తప్తసమాశ్రయణమే ప్రాముఖ్యముగా నంగీకరించి యందువలన వైష్ణవము నిలుపుకొన వలసి వచ్చుటయును.

5. వైష్ణవ సంస్కార ప్రతిపాదకమైన శారీర సూత్రము లేకుండటయు, నీమొదలైన యనేక కారణములచే పాంచరాత్ర విధాన నిషేధ ప్రామాణ్యముల నుదహరించిరని తెలియవలసి యున్నది. కాని యసూయా పరవశత్వముగా భావింపరాదు. మరియు వీరు శ్రీమద్రామాయణమునకు వ్యాఖ్యానము జేసిరి. అది విశేషార్థా లంకార భక్తిపారవశ్యతలు గలిగి యున్నది. దానికి కల్పలతయని పేరు గలదు. వీరు తిథి నిర్ణయకారిక, అను గ్రంథమొకటి వ్రాసిరి. అది గణిత శాస్త్రము, ప్రస్తుత మందాధుని కులచే ముద్రింపబడియున్నది. వీరైదవ సంవత్సరమే యుపనీతులై శ్రీ వేంకటాచలపతి సన్నిధియం దర్చావిధియందు సమగ్రాధికారులైరి. అఖండపండిత మండలీ మండన భూతులై పాషండాది వేదబాహ్య మతములను నిరసించి, మోక్షసాధనమైన భగవద్విగ్రహా రాధన విధి విధానములను సజ్జనులకు బోధించిరి. వైఖానస సూత్రమునందు చెప్పబడిన విష్ణుబలి సంస్కారమే వైష్ణవత్వ ప్రతిపాదకమునకు ముఖ్య సంస్కారముగా [illegible] ఎట్లన.

## శ్రీ విష్ణు తంత్రే

శ్లో. సూత్రోక్తేనైవ విధినా, గర్భేమాస్యష్టమేహరేః
అర్చనం విష్ణుబల్యాఖ్యం, కృత్వావైఖానసోద్విజః
సమాహితమనాధ్యాయన్, ధ్యేయంయజ్ఞపతింహరిం
హుత్వాచపాయసంమంత్రై ర్విష్ణుదైవత్య సంస్కృతైః
తచ్ఛేషమంకయిత్వారి, శంఖాభ్యాంమంత్రతః పృథక్
ప్రాశయేత్పావనంపత్నీం యస్యమేమంత్రమీరయన్
పత్నీచసాజగద్ధామ్ని, చిత్తంసంస్థాప్యయత్నతః
ప్రాశ్నీయాదంకితం సాధ్వీ, సూతే వైష్ణవముత్తమం
అగర్భవైష్ణవోజాతః, ప్రోక్తోదేవర్షిసత్తమైః
సంస్కారైస్సంస్కృతస్సర్వై, స్సమ్యక్తత్యర్చనేహరేః.

తా. వైఖానసులు తమ సూత్రమునందు చెప్పబడిన విధి చేత నెనిమిదవ మాస గర్భమందు విష్ణుబలియను నర్చనమొనరించి విష్ణు నారాధించి విష్ణు దైవత్యములచే పాయసము హోమము చేసి, యా హోమశేషమైన పాయసమును, శంఖ చక్రములచే నంకనము గావించి, విష్ణు మంత్రమును జపించుచు భార్యచే ప్రాశనము చేయించ వలయును. ఆమెయు జగత్పతియైన నారాయణుని యందు చిత్తముంచి యాపాయసమును భుజించవలెను. ఆ గర్భమునందు వైష్ణవత్వము గల సంతతి కలుగును, వారు సర్వసంస్కార సంస్కృతులై విష్ణ్వర్చనాధి కారులగుదురు. అని మహర్షుల చేతను దేవతల చేతను చెప్పబడింది. ఇందువలన వైఖానసులు గర్భవైష్ణవులని చెప్పబడిరి. అను మహర్షి వాక్యములను వీరు విరళముగావించిరి.

## తిరుపతి వృత్తాంతము

బ్రహ్మకల్పాంతమున జలగతమైన భూమిని బ్రహ్మసృష్టికై నారాయణుండు వరాహరూపమును ధరించి రసాతలము నుండి యుద్ధరించెను. అది మొదలు శ్వేతవరాహకల్పమని చెప్పబడుచున్నది.

## వేంకటాచల మాహాత్మ్యే వరాహ పురాణాంతర్గతే ధరణీవరాహ సంవాదే.

శ్లో. స్వామిపుష్కరిణీతీరే, పశ్చిమేలోకపూజితే,
తద్యథాస్తే శ్రీవరాహో, మునీంద్రైస్తత్రపూజితః
వైఖానసైర్మహాభాగై ర్బ్రహ్మతుల్యైర్మహాత్మభిః

తా. అది మొదలు లోకపూజితుడైన స్వామి పుష్కరిణీతీరంబు నందు పశ్చిమ భాగంబునందు బ్రహ్మతుల్యులైన వైఖానస మునీంద్రులచే పూజింపబడుచు శ్రీ వరాహస్వామి నివసించి యుండెను. పిమ్మట

శ్లో. వైవస్వతేఽంత రేదేవి, పూర్వేకృతయుగేఽంతరే
వాయోస్తపోమహద్దృష్ట్వా, శ్రీభూమిసహితోఽనఘే
ఆగత్య శ్రీనివాసశ్చ, స్వామిపుష్కరిణీతటే
దక్షిణేఽస్మి న్పుణ్యతమే, విమానేఆనంద సంజ్ఞితే
వసిష్యతిచ శ్రీకాంతో, వాయోః ప్రియకరోహరిః
తదారభ్యహృషీకేశః, సేనాన్యారాధితోఽనిశం
ఆకల్పాంతమదృ శ్యేఽస్మి న్విమానేఽసౌ వసిష్యతి.

తా. ఆవరాహస్వామి వేంకటేశ్వరులను గురించి భూదేవితో నిట్లు చెప్పుచున్నాడు. ఓ భూదేవీ వైవస్వత మన్వంతర పూర్వం (ఆది) కృతయుగంబున వాయుదేవుని మహాతపంబు జూచి శ్రీనివాసుడు శ్రీభూసమేతుడై వచ్చి స్వామి పుష్కరిణీ తీరమందు దక్షిణ భాగమున పుణ్యతమమైన యందలి విమానము నందు వాయుదేవునకు ప్రియకరంబుగా నావిర్భవించెను. అది మొదలు కుమారస్వామిచే నారాధింపబడుచు కల్పాంతము వరకు నదృశ్యముగానే యుండెను. అనగా బ్రహ్మకల్పాంతము వరకు నుండెననియు వైవస్వత మన్వంతర మనగా పూర్వకల్ప యాదివ వైవస్వత మన్వంతరమనియు వ్యాఖ్యాతలు వ్రాసియున్నారు. తరువాత.

శ్లో. అగస్త్యోఽస్మిన్ సమాసాద్య, పురాదేవం సనాతనం
ఆరాధ్యద్వాదశాబ్దాన్తం, ప్రీణయిత్వాపునఃపునః

యయాచేతత్రసాన్నిధ్యం భవాన్ దృశ్యో భవత్వితి
ఏవముక్తోహృషీకేశః, శ్రీభూమిసహితోధరే

శ్లో. అహందృశ్యో భవిష్యామి త్వత్కృతేసర్వదేహినాం
ఏతద్విమానందేవర్షే, నదృశ్యంస్యాత్క దాచన
ఆకల్పాంతంమునీంద్రాస్మిన్, దృశ్యోహంనాత్రసంశయః
మునిస్తద్వచనంశృత్వా ప్రీతఃప్రాయాత్స్వ మాశ్రమం.

తా. పూర్వమగస్త్య మహాముని యీ వేంకటాద్రి యందు శ్రీనివాసుని పండ్రెండు సంవత్సరము లారాధించి నీవు దృశ్యుడవు కమ్మనియాచించెను. హృషీ కేశుడా యగస్త్యునితో నిట్లనియె. శ్రీభూసహితముగా నేను దృశ్యుడనగుదును సర్వదేహులకు నీ విమానము మాత్రము దృశ్యము గాదు. నేనుమాత్రమా కల్పాంతము నిచ్చట సర్వదేహులకు దృశ్యుడ నగుదును సంశయము లేదనెను. అగస్త్యమునీంద్రు డావాక్యములు విని సంతసించినవాడై తన యాశ్రమంబునకు బోయెను.

శ్లో. తతశ్చతుర్భుజోదేవ స్సదృశ్యోకభూన్నరాదిభిః
విమానేమునిచిన్త్యేకస్మిన్, నాశితాచతథోత్తరం
ఆరాధ్యమానస్కందేన, వాయునా సేవితస్సదా.

తా. పిమ్మట నాచతుర్భుజుండైన శ్రీనివాసుడు మునీంద్రచింత్యమైన విమానమునందు కుమారస్వామి చేత నారాధింపబడుచు, వాయువుచే సేవింపబడుచు, మనుష్యాదుల చేత దృశ్యుడగుచుండెను.

శ్లో. ఏవంగతేమహాకాలే, చతుర్యుగ సమన్వితే
అష్టావింశత మేజాతే, ద్వాపరాంతే వసుంధరే
యుద్ధేచ భారతేకతీతే, తిష్యేసతీయుగేతథా
విక్రమార్కా దయోభూపాః శకాశ్శూద్రాదయస్తథా
గమిష్యంతిస్వర్గలోకం, మామజ్ఞాత్వావరాననే.

తా. ఇట్లు నాలుగు యుగములతో గూడిన మహా కాలము గతించి యిరువది యెనిమిదవ ద్వాపరాంతమున భారత యుద్ధమైన పిమ్మట కలియుగమందు విక్రమార్క శూద్రక మహారాజాదులు నన్నెరుంగ కుండగనే స్వర్గలోకమునకు బోయిరి. అని శ్రీనివాసుడు భూదేవితో చెప్పుచున్నాడు.

విక్రమార్క మహారాజా స్వర్గమలంకరించి యింతవరకు 1978 సంవత్సరములైనవి. ఇది యిట్లుండగా

## భవిష్యోత్తర పురాణే వేంకటాచల మాహాత్మ్యే

## 13 అధ్యాయే

శ్లో. పురావైఖానసోనామఋషిరత్యంతనిష్ఠధీః
భావి కృష్ణావతారస్య, కథాంశృత్వాపురాతనీం
కాలానాంకర్మణాంచైవ, శరీరాణాంచనస్థితిః
జనానామితినిశ్చిత్య, తపస్తప్తుంప్రచక్రమే
ద్రావిడేచోళదేశేతు, ప్రకృష్టేకుశవిస్తృతే
కృష్ణరూపంప్రపశ్యామి, నిరాహారో జితేంద్రియః
తపసాదుష్క రేణేతి, సుదృఢంకృతనిశ్చయః

తా. పూర్వము, అత్యంతనిష్ఠ గలిగి వైఖానసుడను పేరుగల ఋషి రాబోవు కృష్ణావతారము యొక్క పురాతనమైన కథను విని కాలముల యొక్కయు కర్మముల యొక్కయు శరీరముల యొక్కయు స్థితికి లొంగకుండగ నుత్కృష్ట మైనటువంటి కుశవిస్తృతమైన ద్రావిడసంబంధమైన చోళ దేశమునందు నిరాహారుడు జితేంద్రియుడునై దుష్కరమైన తపముచే కృష్ణరూపమును చూచెదనని దృఢనిశ్చయుడై తపముసేయు నారంభించెను.

శ్లో. తపసాతప్యమానస్య, తస్యవైభక్తవత్సలః
ప్రాదుర్బభూవభగవాన్, పురాగోపాలవేషభాక్
ప్రాదుర్భూతం హరిందృష్ట్వా, తుష్టావమునిసత్తమః

తా. ఇట్లు తపస్తప్తుడైన యావైఖానసమునికి భక్తవత్సలుడైన హరిగోపాల వేషమును ధరించి ప్రత్యక్షమయ్యెను. ఇట్లు ప్రత్యక్షమైన హరిని జూచి యామునిసత్తముడు సంతుష్టి నొందినవాడై ఇట్లనియె.

శ్లో. పూజాంకరోమి పురుషోత్తమ పుణ్యమూర్తే
గోపాలవేషకరుణాకర దేవ దేవ, ఇత్థంస మీరిత ఉవాచమునీశ్వరంసత-
తస్యోచితంవచనమేష మహానుభావః.

తా. గోపాలరూపము ధరించిన ఓ పురుషోత్తమ దేవ దేవ కరుణాకర పుణ్యమూర్తీ నిన్ను పూజించుచున్నాను. అని యిట్లు చెప్పిన యా మునీశ్వరుని గూర్చి అతనికి యుచితమైన యీ వాక్యమును పలికెను.

శ్లో. త్వయాధ్యేయశ్శ్రీనివాసో, నాహంధ్యేయో మునీశ్వర
గచ్ఛశేష గిరింతత్ర, వల్మీకేవర్తతేశుభే
ప్రతిమా శ్రీనివాసస్య, తత్పూజాంకురుసంతతం
సంగమిష్యతి తేమార్గే శూద్రశ్శ్రీరంగదాసకః.

తా. ఓ మునీశ్వరా, నీ చేత నారాధింపబడువాడు శ్రీనివాసుడు గాని నేను గాను శేషాద్రికింబొమ్ము. అచ్చట వల్మీకమునందు శ్రీనివాసుని ప్రతిమ గలదు. నిత్యము నా ప్రతిమను పూజించుము. మార్గము నందు నీకు శ్రీరంగదాసుడను శూద్రుడు కలియగలడు.

శ్లో. పూజకస్తు భవే చ్ఛూద్రః, సేవకస్తే మహామునే
ఏవముక్తోథహరిణా, సంప్రాప్తో వేంకటాచలం
సంగమస్తుబభూవాస్య, మునేశ్శూద్రేణవర్త్మని
తతస్తుతేనసహితో, గత్వాశ్రీ వేంకటాచలం.

తా. ఓ ముని నీకాశూద్రుడు పూజకుడు సేవకుడును కాగలడు. అని యీ ప్రకారము విష్ణువుచే చెప్పబడగా వెంకటాచలమున కామునీంద్రుడు బోవుచు మార్గ మందు రంగదాసునితో గూడికొని వెంకటాద్రికి బోయెను. అని యిట్లు చెప్పియున్నది.

## వరాహపురాణములో

శ్లో. రంగదాసస్త్వారురోహ, బాలోద్వాదశ వార్షికః
స్వామిపుష్కరిణీంప్రాప్య, స్నాత్వాభక్తిసమన్వితః

వైఖానసేనమునినా, గోపీనాథేనపూజితం
వనమధ్యేత రోర్మూలే, స్వామి పుష్కరిణీతటే
తిష్ఠంతం పుండరీకాక్షం, శ్రీభూమిసహితంహరిం
ఆకాశస్థంసందదర్శ, పీతనీలాకృతింశుభం.

తా. పండ్రెండు సంవత్సరముల ప్రాయము గల రంగదాసుడా వెంకటాద్రికి బోయి స్వామి పుష్కరిణి యందు గృతస్నానుడై గోపీనాథుడను వైఖానసమునిచే పూజింపబడుచు వనమధ్యమందు స్వామి పుష్కరిణీతీరంబున దరుమూలంబున శ్రీ భూసమేతముగా నాకాశమందు పీతనీలాకృతి కలిగి శుభుడైన శ్రీహరిని జూచెను.

శ్లో. అస్యదేవస్య చారామం, కరిష్యామీత్య చింతయత్
నిశ్చిత్యమనసానర్వం, తరుమూకలేవ సత్సుధీః
కృత్వావైఖానసాద్విష్ణో, ర్నై వేద్యంచదినేదినే
శనైశ్చిత్వావనంఘోరం, వృక్షాంశ్చిచ్ఛేద పార్శ్వగాన్.

తా. ఈ దేవునకు పుష్పారామమును చేయించెదనని యాలోచించి, యారంగదాసుడా తరుమూలమందు నివసించి ప్రతిదినము వైఖానసునిచేనా విష్ణు దేవునకు నైవేద్యమును చేయించుచు, శీఘ్రముగా వనమంతయును పార్శ్వముల యందు గల వృక్షములును ఛేదించెను.

శ్లో. అస్థానచించాం దేవస్య, రమాయా శ్చంపకంతరుం
దేవాజ్ఞప్తోవర్జయిత్వా, తావుభౌదేవసేవితౌ
దేవస్యపురతోభౌమౌ, శిలాకుడ్యంత థాకరోత్
తత్కుడ్యస్యై వపరితః, పుష్పారామాంశ్చకారహ
ఖనిత్వాతత్రకూపంతు, వర్ధయన్‌తజ్జలైర్వనం
ఆరామపుష్పాణ్యాదాయ, స్వయందామాన్యథాకరోత్

విచిత్రాణితథాబద్ధ్వా, యాజకస్యకరేదదౌ
ఆదాయపూజకస్తాని, స్కంధేమూర్ధ్ని బబంధచ

శ్రీనివాసస్య దేవస్య, శ్రీభూమి సహితస్యచ
ఏవం దేవస్యకైంకర్యం, కుర్వన్తస్థావుదారధీః.

తా. రంగదాసుడా భగవదాజ్ఞ ప్రకారము దేవుని కాస్థాన చించా వృక్షమును, మహాలక్ష్మికి చంపక వృక్షమును దేవసేవితములగుటచే నారెండింటిని విసర్జించి స్వామివారి యెదుట శిలలచే గోడకట్టించి ఆ గోడలలో నంతటను పుష్పారామములు వేయించి, యచ్చట నొక బావి త్రవ్వించి, యవాకూపోదకంబున నాపుష్పారామముల వృద్ధినొందించుచు, అందలి పుష్పములచే విచిత్రములయిన మాలికలను, గట్టి అర్చకున కొప్పగించుచుండెను. ఆ యర్చకుడా పుష్పమాలికల నా శ్రీనివాసుని భుజముల యందును శిరమునందును, ధరింప జేయుచు నీ ప్రకార మిర్వురు నా స్వామివారి కైంకర్యము సేయుచుండిరి.

శ్లో. తస్యైవం సంవర్తమానస్య, సమాస్త్వాసప్తతేర్గతాః
కుర్వాణేపుష్పాపచయం, రంగదాసే మహాత్మని.

తా. మహాత్ముడైన రంగదాసుడీ ప్రకారము పుష్పాపచయము సేయుచుండగా నతనికి డెబ్బదివర్షములు గతించినవి. అని యిట్లు చెప్పియున్నది. విక్రమార్కుడు గతించి 1978 సంవత్సరము లిప్పటికి గతించినవి. విక్రమార్కా నంతరము 12 వర్షములకు రంగదాసు వెంకటాద్రికి బోయినట్టును ఆ రంగదాసుడు వేంకటేశ్వరులకు పుష్పారామాదులను స్థాపించి సేవించువరకు 70 సంవత్సరములు గతించినట్టును చెప్పటుచే క్రీస్తుకు పూర్వము 5812 వ సంవత్సరము విక్రమార్కుడు గతించినట్టును, తరువాత 13వ సంవత్సరము క్రీస్తుకు పూర్వము 46వ సంవత్సరము. రంగదాసుడు వేంకటాద్రికి వచ్చి యచ్చటి యరణ్యములు ఛేదించి పుష్పారామ కూప కుడ్యాదులొనరింప నారంభించినట్టును ఆ పనులు క్రీస్తుశకము, 46వ సంవత్సరమునకు పూర్తియైనట్టును తెలియుచున్నది. కాబట్టి వేంకటాద్రి యందు శ్రీనివాసుని రంగదాసుడు క్రీస్తుకు పూర్వము 46వ సంవత్సరము నుండియు వైఖానసులచే నర్చింపజేయుచున్నట్టు విశదమగుచున్నది. ఇట్లారంగదాసుడు శ్రీనివాసుని సేవించుచుండగ నాయారామంబున గల సరస్సునందు స్నానము సేయుటకొక నాడొక గంధర్వు డంగనా సహితుడై

వచ్చిజలక్రీడ సేయుచుండెను. వారిని జూచుచు జితేంద్రియుడయ్యును రంగదాసుడు వ్యామోహితుడై భగవంతునకు మాలికలు కట్టు కాలస్యము చేసి యాగంధర్వులు కుబేర లోకంబునకు బోయిన పిమ్మట పుష్పములు గొని దేవాలయంబునకు వచ్చెను. అచ్చట

శ్లో. వైఖానసస్తుతం దృష్ట్వా, పూజాకాలమతీత్యచ
ఆగతంకిమితిప్రాహ, సఖేకతి క్రమ్యచాగతః
నబద్ధామాలికాశ్చాపి, త్వయారామేచకింకృతం.

తా. వైఖానసుడా రంగదాసుని జూచి, పూజాకాల మతిక్రమించి వచ్చితివి, మాలికలు కట్టలేదు. పూలతోటలో నేమిసేయుచుంటివని యడిగెను.

శ్లో. ఇత్థం పృష్టోరంగదాసో, నావదల్లజ్జయాతతః
లజ్జితంరంగ దాసంతం, ప్రోవాచమధుసూదనః

తా. ఇట్లడిగిన నతండు సిగ్గుచేమాటలాడుట కూరకుండెను. లజ్జతో గూడిన రంగదాసునితో మధుసూదను డిట్లు చెప్పెను.

శ్లో. లజ్జయాకింరంగదాస, మయాత్వం మోహితోహ్యసి,
నతావజ్జిత కామస్త్వం, ధీరోభవమహామతే
గంధర్వ రాజవద్రాజా, భవితాసిమహీతలే
తత్రభుక్త్వామహాభోగాన్, భక్తిమాన్ మయిసర్వదా
ప్రాకారంచ విమానంచ, కారయిష్యసిమేతదా
తత్రముక్తిం ప్రదాస్యామి, ప్రీత్యాపరమయాయుతః
అత్రైవకురుసేవాంత్వ మాశరీరవిమోక్షణాత్.

తా. ఓ రంగదాసుడా, నీవు లజ్జింప బని లేదు, నీవు కామంను జయించలేదు. దీరుడవుకమ్ము. భూలోకములో గంధర్వ రాజువలె నీవు గూడ రాజువు కాగలవు. అచ్చట మహాభోగముల ననుభవించి నాయందు భక్తిగలవాడవై అప్పుడు నాకు ప్రాకారము విమానము చేయించగలవు. పరమప్రీతితో నచ్చటముక్తి నిచ్చుచున్నాను. శరీర మోక్షణము వరకు నిచ్చటనే నీవు సేవ చేయుచుండుము.

శ్లో. శృత్వాతద్రంగదాసోకపి, చకారారామముత్తమం
సాగ్రంశతాబ్దం సేవిత్వా, గతస్స్వర్గమమందధీః.

తా. రంగదాసుడా మాటవిని యుత్తమమైన పూలదోటవేయించి యాశ్రీనివాసుని నూరువత్సరములు పూర్తియగు వరకు సేవించి, స్వర్గమునకు బోయెను. అనియున్నది. ఇది వరకు రంగదాసునకు వెంకటాద్రికి వచ్చువరకు 12 వర్షములును, అచ్చట ఆరామాదులు కట్టించుచుండగ 70 సంవత్సరములును, మొత్తము (82) వర్షములు గతించినవని తెలియుచున్నది గదా. తరువాత నూరువత్సరములు పూర్తియగు వరకు స్వామిని సేవించుచుండి స్వర్గమలంకరించినట్టు చెప్పుచుండుటచే ఆరామాదులు కట్టించిన పిమ్మట19 సంవత్సరములకు అనగా, క్రీస్తుశకము1, 2వ సంవత్సరములో రంగదాసుడు గతించెనని స్పష్టమగుచున్నది.

**భవిష్యోత్తర పురాణము 6వ అధ్యాయము**

శ్లో. యుద్ధేతుభారతేకతీతే, త్వష్టావింశేకలౌయుగే
విక్రామార్కాదయోభూపా, స్స్వర్గలోకంయుదాయయుః
తల్కాలాం తేవత్సరేషు, సాహస్రేషుగతేషువై
చంద్రవంశేనృపఃకశ్చిత్సువీర ఇతినామకః
జజ్ఞేసుధర్మస్త త్పుత్రః తత్సుతౌనృపపుంగవౌ
ఆకాశతొండమానాఖ్యౌ, జాతౌలోకయశస్కరౌ
ధర్మిష్ఠౌదృఢభక్తౌతౌ, నారాయణ పరాయణౌ
జ్యేష్ఠోవియన్నృపస్సాధుః కనిష్ఠోతొండమాన్నృపః
తొండ దేశాధిపోభూత్వా, శశాసపృధివీమిమాం.

తా. భారతయుద్ధము జరిగిన పిమ్మట నిరువది యెనిమిదవ కలియుగములో విక్రమార్కాదులు స్వర్గమునకు బోయిన పిమ్మట, వేలకొలది సంవత్సరములు గతించిన తరువాత, సువీరుడను పేరుగల యొక చంద్ర వంశపు రాజు సుధర్ముడను కుమారుని గనెను. ఆ సుధర్మునకు ధర్మిష్ఠులు దృఢభక్తులు నారాయణ పరాయణులునగు (ఆకాశరాజు) తొండమానుడు అను నిర్వురు కుమారులు గలరు. ఆకాశరాజు జ్యేష్ఠుడు.

తొండమానుడు కనిష్ఠుడు. వీరు తొండ దేశాధిపులై యీ భూమిని శాసించిరి. అని యున్నది.

పైన (వత్సరేషు సాహస్రేషుగతేషు) అని వ్రాయుటచే వేల కొలది సంవత్సరములు గతించినట్లు తెలియుచున్నది. విక్రమార్కుడు గతించి, యిప్పటికి 1978 సంవత్సరముల కంటె యెక్కువ కాలేదు. అతడు గతించిన పిమ్మట వేలకొలది సంవత్సరములకు, ఆకాశరాజు తొండమానులు పుట్టినట్టు చెప్పుట కవకాశము లేదు. గాన వేలకొలది వత్సరము లనుచోట నొక్కవేయి వత్సరములను మాత్రమే నేను లెక్కలోనికి దెచ్చుకొని, యీ చరిత్రమునందు కథాభాగమును సమర్థించితిని, అందువలన విక్రమార్కా నంతరము వేయివత్సరములకు అనగా, క్రీస్తు శకము 978 సంవత్సరము తొండమాను చక్రవర్తి పుట్టినట్లు స్పష్టము. ఇతడు పూర్వము వేంకటాద్రియందు వనములను ఛేదించి గోడలు కట్టించి పుష్పారామములను బెంచి, బావి త్రవ్వించిన రంగదాసుడే భగవద్వర విశేషముచే నిట్లు జన్మించె నని కనుపించుచున్నది. శ్రీనివాసుడును, ఆకాశరాజు కుమార్తెయైన పద్మావతిం బెండ్లియాడి, యా వల్మీకమందే నివసించుచు వైఖానసులచే నర్చింపబడుచు, తనవివాహానంతర మాకాశరాజు స్వర్గమలంకరించిన నారాజ్యమునకై తొండమానుడును ఆకాశరాజు కుమారుడైన వసుదానుడును, కయ్యమునేయుగా వారిర్వురను సమాధానవరచి రాజ్యమును విభజించి యిర్వురకు సమానముగా బంచియిచ్చెను. తొండమానుడును శ్రీనివాసుని వలన తన రాజ్యమును పొంది తన పూర్వ వృత్తాంతమును తెలిసికొని, పూర్వ జన్మము నందు తాను చేసిన ఆరామ కూపాదుల నరశి, పిమ్మట సువర్ణ కలశములతో మహోన్నతమైన విమానమును, స్వామి దర్శనార్థమై వచ్చెడు జనులకు నాలుగు క్రోసుల వరకు సోపానములును, మధ్యయందు కూపములను మంటపములును గట్టించ

శ్లో. ఆగచ్ఛాద్యజగన్నా
ఇతిరాజ వ చశ్శ్రుత్వా

తా. ఓ జగన్నాధా య

విని భగవంతుడిట్లనియె.

శ్లో. అవశ్యమనుగచ్ఛామి, తవ భక్త్యా ప్రతోషితః
ఇత్యుక్త్వా ప్రస్థితం దేవం, దేవైశ్చేంద్ర పురోగమైః
వైఖానస ఋషి శ్రేష్ఠై ర్బ్రాహ్మణై ర్బ్రహ్మవాదిభిః
ఋక్సామగాయకై శ్చైవ మంత్రైశ్చ విధిపూర్వకం
ప్రవేశయామాస వరం సుమందిరం శ్రీశ్రీనివాసంపురుషం పురాణం
పద్మావతీంచాపి ముదామహీపతిః
సమస్తలోకై ర్మునిభిర్మ హోత్సవైః

తా. ఓ రాజా నీ భక్తికి సంతోషించితి నవశ్యముగా వచ్చెదననెను. తరువాత నా శ్రీనివాసు నా తొండమానుడు దేవేంద్రాదులతోను ఋషి శ్రేష్ఠులయిన వైఖానసులతోను, ఋగ్యజు స్సామ గాయకులతోడను, పద్మావతితోను, మంత్రవిధి పూర్వకముగా మందిరంబున బ్రవేశపెట్టెను. అని యున్నది. తొండమానుడు పుట్టినది మొదలు శ్రీనివాసుని తాను కట్టించిన మందిరములో బ్రవేశ పెట్టువరకెంత కాలము గతించినది నిర్ణయింప రాకున్నది. విక్రామార్కునంతరము వేయివత్సరములకు తానవతరించినట్టు పైన చెప్పబడినది. అది క్రీస్తు శకము, 978వ సంవత్సరమగుచున్నది. ఆలయాదులు గట్టించి, యందుస్వామివారిని బ్రవేశింప జేయువరకు గొంతకాలము కావలసి యుండును గాని నియమము లేదు, శ్రీనివాసాధ్వరి 993వ సంవత్సరంలో నవతరించినట్లు లోగడ వ్రాయబడినది. గావున తొండమాను చక్రవర్తి జన్మించిన పిమ్మట 15 సంవత్సరములకు శ్రీనివాసదీక్షితుల వారవతరించి రనియు వారలకైదవ వత్సరమే యువనయనమైదని చరిత్రములో నుండుటచే క్రీస్తుశకము 998వ సంవత్సరము శ్రీనివాసాధ్వరికి యువనయనమైనట్టును, అంతటినుండియు శ్రీనివాస భగవత్కైంకర్యా వలంబులై శ్రీ వేంకటాద్రియందుండిరనియు స్పష్టముగా తెలియుచున్నది. తొండమానుడు శ్రీనివాసుని విమానములో బ్రతిష్ఠించుటకు పూర్వము నుండియు నాస్వామి నర్చించుచున్న ఋషులైన వైఖానసులతో గూడ గొనితెచ్చినట్లును, ఆలయములో బ్రతిష్ఠించినది మొదలు శ్రీనివాసర్చానా పరతంత్రులయిన శ్రీ వైఖానసులలో శ్రీదీక్షితులవారే ప్రధానపురుషులనియు చెప్పవచ్చును. వీరి జీవితకాలమును నిర్ణయించుటకు ప్రమాణములుగానరావు. విశిష్టాద్వైత మతోద్ధారకులైన శ్రీమద్రామానుజ మునీంద్రులవారు జన్మించిన సంవత్సర మాధారముగా గ్రహించవలసి యున్నది. అది యెట్లన.

## సకలార్థసాగరమను పుస్తకములో

రామానుజ జననము. శాలివాహక శకము, సం. 939 కలియుగాబ్దములు సం. 4118 హూణశకము 1017, తెనుగు సంవత్సరము, పింగళసంవత్సర చైత్రశుద్ధ పంచమి.

రామానుజ నిర్యాణము, దుర్మతి సంవత్సర మాఘశుద్ధ దశమి, జీవితకాలము 120 సంవత్సరముల నూటయిరువది సంవత్సరములు అని యున్నది.

## ఆచార్యసూక్తి ముక్తావళిలో

శాలివాహన శకము. 950 సంవత్సరము అని యున్నది.

హూణశకము. 1077 సంవత్సర తెనుగు సంవత్సర విభవసంవత్సర ఫాల్గుణ శుద్ధ దశమి.

## ఆంధ్రుల చరిత్రములో

శాలివాహనశకము 940 సంవత్సర తెనుగు పింగళ సంవత్సర చైత్రశుద్ధ పంచమి. గురువారం.

నిర్యాణమును గురించి యేమియు చెప్పబడలేదు.

అనియిట్లు చెప్పియున్నది. ఇందులో నొక దానికి మరియొకటి పరస్పర వైషమ్యములు గలిగి యున్నవి. గావున నిందు కలియుగాబ్దములను బట్టి నిర్ణయించు చున్నాను. యెట్లన, రామానుజాల వారు జన్మించిన కలియుగాబ్దములు. 4118లోను శ్రీనివాస దీక్షితుల వారు జన్మించిన కల్యబ్దములు. 4028 మినహాయింపుచేయగా శేషము 90 వచ్చుచున్నదిగాన శ్రీనివాస దీక్షితులవారు రామానుజాల వారికంటె తొంబది సంవత్సరములు ముందుగా నవతరించిరని ధృవబరుచబడుచున్నది. కాబట్టి వీరిజననము క్రీస్తు శకము 99 సంవత్సరము సర్వ జిద్వత్సర వైశాఖ శుద్ధ విదియ రోహిణీ నక్షత్రము. వీరి నిర్యాణము క్రీస్తు శకము 1083 సంవత్సరము సిద్ధార్ధి సంవత్సర వైశాఖమాసము వీరి జీవితకాలము తొంబది సంవత్సరములు అని యిట్లు నిర్ణయింపబడి యున్నది. గాన శ్రీనివాసాధ్వరీంద్రులు కలియుగ సంవత్సరము 4028లో నవతరించి పైన చెప్పబడిన శ్రీలక్ష్మీ విశిష్టాద్వైత భాష్యాది గ్రంథములు రచించి శ్రీనివాసకృపాలబ్ధ వేదాంత దేశికాభి

ధానులై తొంబది సంవత్సరములు జీవకోటులం దరియింప జేసి కలివర్షములు 4118 సంవత్సరములో క్రీస్తుశకము 1083 వ సంవత్సరం సిద్ధార్ధి సంవత్సర వైశాఖమాసములో నఖిలాండకోటి బ్రహ్మాండనాయకులైన శ్రీనివాస భగవానుల యం దైక్యము నొందిరి. వీరి తనియ.

శ్లో. సర్వజిత్వత్సరేచైవ, వైశాఖేశుక్ల పక్షకే
ద్వితీయేరోహిణీ యుక్తే, జాతంశ్రీవేంకటాచలే
శ్రీనివాసదయాపాత్రం, వైఖానన శిరోమణిం
భాష్యకారం మహాత్మానం, శ్రీనివాసాధ్వరింభజే.
తతస్తిరుమలాచార్య శ్రీరంగ స్థలనాయకః

తా. ఆ శ్రీనివాసాధ్వరి తరువాత తిరుమలాచార్యులవారు. శ్రీరంగస్థల నాయకులు (వీరితనియ)

## తిరుమలాచార్యుల వారి చరిత్రము

శ్లో. కుంభేచోత్తర ఫల్గుణీ రవిదినేజాతం ప్రపన్నాగ్రజం
శ్రీవైఖానససూత్ర సంస్కృత తనుం శ్రీలక్ష్మణార్యాత్మజం
శ్రీరామానుజ దాసదాసమనఘం, వాసిష్ఠగోత్రోద్భవం
శ్రీరంగస్థలవాసినం తిరువరంగార్యా మృతాఖ్యంభజే.

అని యున్నది. ఇందునుబట్టి ఆలోచించగా వీరి జననము మాఘ బహుళ విదియా ఆదివారమైనట్టును, వీరు ప్రపన్నాగ్రజాలు వైఖానస సూత్ర సంస్కృతులు లక్ష్మణాచార్యుల వారి కుమారులు వాసిష్ఠ గోత్రోద్భవులు శ్రీరంగస్థలవాసులు నయినట్లుగా తెలియు చున్నది. శ్రీరంగనాధుడెన్నడైనను వైఖానసార్చన మంగీకరించినా యని కొందరు సంశయము నొందుచున్నారు.

## బ్రహ్మాండపురాణము అర్థపంచక వివరణము 5, అ

49. శ్లో. తదారంగేశ్వరోదేవో, కృపయార్చక మబ్రవీత్

50. మద్భక్తో మమపూజార్థ, మిదానీంసముపోషితః
ప్రజస్త్వమమ దేహంత్వం, త్వమేవాహం.న సంశయః

51. చలాచలంతుద్వివిధం, రూపం మమమహాత్మనః
త్వమేవహిచలం రూప, మచలోహ్యత్రసంస్థితః

52. త్వత్సేవామమసేవైవ, యాహిశీఘ్రంద్విజాంతికం
ఏవం వైఖానసోవిప్రః, ప్రేషితోహరిణాతథా.

53. ధృడవ్రతస్యభవనం, జగామ మునిపుంగవః
ధృఢవ్రతశ్చ పుత్రాశ్చ, ప్రత్యుద్గాయముదాన్వితాః.

54. దండవత్ప్రణిపత్యాథ, తస్థుః ప్రాంజలయ స్తథా
దృఢవ్రతోమహాభక్త్యా, తత్పాదౌ శిరసాऽగ్రహీత్.

55. తతోహిరణ్మయేపీఠే, స్థితంకృత్వా చసాదరం
పాదౌ ప్రక్షాళ్యత త్తీర్థం ముదాశిరసి థారయున్.

56. అథతత్పుత్రపౌత్రేభ్యో, గృహంసర్వ మమార్జయత్
శ్రీరంగనాథంతం ధ్యాత్వా, ధూపదీపనివేదనైః

57. సంపూజ్య విధివద్విప్రో. వస్త్రైరాభరణైర్ధనైః
ప్రేషయామాస తంవిప్రం, రంగనాథస్యమందిరమ్.

తా. నిత్యసేవాపరాయణుడైన దృఢవ్రతుడను బ్రాహ్మణుడా దినంబున నశక్తతచే నుపవశించెను. అని పూర్వ సందర్భము. అప్పుడు రంగనాథుడు దయగలవాడై తన యర్చకునితో నిట్లనియె. నా భక్తుడు నా పూజ నిమిత్త మిప్పుడు పవసించెను. నీవు నా దేహమును ధరింపుము నీవే నేను సంశయము లేదు. నాకు చలమనియు నచలమనియు రెండు రూపములు గలవు. నీవే చలరూపము. ఇచ్చట నున్నదియే అచలరూపము. నిన్ను సేవించుటయే నన్ను సేవించుటగావున శీఘ్రముగా నా బ్రాహ్మణుని యింటికి బొమ్ము అని యిట్లు శ్రీ రంగనాథునిచే ప్రేరేపింపబడి వైఖానస బ్రాహ్మడా దృఢవ్రతుని యింటికి బోయెను. ఆ దృఢవ్రతుడెదురేగి సాష్టాంగముగ నమస్కరించి వారిపాదములను

శిరసాధరించి బంగారు పీఠమున గూర్చుండబెట్టి పాదములను గడిగి యాయుదకముచే తన పుత్రపౌత్రగృహాదులను తానును మార్జనము చేసికొని ఆ వైఖానసుని శ్రీరంగనాధునిగా ధ్యానించి వస్త్రాభరణ ధూపదీపనివేదనాదులచే నర్చించి తిరిగి యారంగనాధుని యాలయమునకా వైఖానసుని బంపించెను. అని యున్నది.

## శ్రీరంగ మాహాత్మ్యము

శ్లో. బ్రహ్మాపిదివ్యహంసేన, సితమేఘోపమేనచ
పృష్టతోక నుయయౌవిష్ణుం, వస్త్రేణాచ్ఛాద్యచాననం
తత్రార్చకో మహాభాగో, భగవాన్విఖనాస్తథా
దదౌప్రసాదం దేవానాం, రంగనాథాభ్యనుజ్ఞయా.

తా. బ్రహ్మదేవుడును తెల్లని మేఘమువంటి దేవతా హంసము నెక్కి వస్త్రముచే ముఖముగప్పుకొని విష్ణువును గూర్చి బోయెను. అచ్చట నర్చకుడును మహాభాగవతోత్తముడును, భగవంతుడును అయిన విఖనసుడా రంగనాధానుజ్ఞచే దేవతలకు బ్రసాదము నిచ్చెను. అని యున్నది.

ఈ ప్రమాణములచే పూర్వము శ్రీరంగము వైఖానస స్థల మని తెలియుచున్నది. ఇట్లా శ్రీరంగక్షేత్రమునందు తిరుమలాచార్యుల వారు సర్వస్వతంత్రముగా భగవదర్చనా కార్యములు నెరవేర్చుచు శిష్యోప శిష్యులతో గూడి సుఖంబుండిరి. ఇట్లుండగా

## రామానుజ జన్మ వృత్తాంతము
## స్కాందే భూతపురీ మాహాత్మ్యే

యువనాశ్వమహారాజు కుమారుడ హారీత మహారాజు వేటకై బోయి యారణ్యమున కొంతదడవు మృగయా వినోదంబునొంది. యచ్చట గోహింససేయుచున్న వ్యాఘ్రముంగని దానిం జంపుటకై శరంబు విడిచెనది లక్ష్యము దప్పి గోవధంబొనర్చె నందులకా రాజామిక్కిలి చింతించి యాదోషనివృత్తికై విష్ణువునుం గూర్చి యఖండమైన తపం బొనరించె. అందులకా పురుషోత్తముండు ప్రత్యక్షమై యాహారీత మహారాజున కిట్లనియె.

శ్లో. సత్యమాత్థ మహారాజ, భూతానాందురితోదయః
మద్దర్శనాం తేనాస్త్యత్ర, సంశయః కింపునస్తవ.
వ్యపేతుదుఃఖంమనసో, భవతోనృపనందన
బుద్ధిపూర్వం త్వయానేదం, కృతం కర్మజుగుప్సితం
బలాదాక్రమమాణాంగాం దుష్టవ్యాఘ్రం జిఘాంసతా
త్వయాకృతోబాణమోక్ష, స్తేనరోషార్థ తాహిసా
తస్మాన్నాత్ర త్వయాకార్యా, శోకశం కామనాగపి
తపశ్చనుమహస్తప్తం, భవతానియతాత్మనా
తేనప్రీతోకహమధునా, దద్మిబ్రాహ్మణ్యముత్తమం
అనేనైవశరీరేణ, బ్రాహ్మణస్త్వంభవిష్యసి
బ్రాహ్మణ్యైకా శ్రయాన్సర్వే, తేతే మంత్రా స్ఫురంతుతే
మదంశోయోమహావీర్యః, శేషాఖ్యో ధరణీధరః
జగతాముపకారాయ, తవవంశే భవిష్యతి
తద్వంశ్యాశ్చ భవిష్యంతి, మహాభాగాదృఢవ్రతాః
భక్తిమంతో మయిసదా, బ్రాహ్మణా బ్రహ్మవిత్తమాః
త్వద్వంశ జానామఖిలం, దిశన్నహమభీప్సితం
దాస్యామ్యత్రైవసుమతే, యావద్వైవ స్వతాంతరమ్.

తా. ఓ మహారాజా భూతములకు దురితోదయము నాదర్శనాంతమందు లేదు. ఇందుకు నీవు సంశయింప బనిలేదు. నీ మనోదుఃఖమును పోగొట్టుకొనుము. బలాత్కారముగా గోహత్య సేయుచున్న దుష్టవ్యాఘ్రమును జంపుటకై నీవు బాణమును విడిచితివి. అది యాదోషముచే హింసింపబడెను. అందుచే నీవు దుఃఖింపబని లేదు. నియతాంత రంగుడవయి గొప్పతనము చేసితివి. అందుకు నేను సంతసించి యిప్పుడే నీకు బ్రాహ్మణ్యమిచ్చితి, యీ శరీరముతోడనే బ్రాహ్మణుడవు కాగలవు. బ్రాహ్మణ్యమున కాధారములైన యాయామంత్రములు నీకు స్ఫురింపగలవు. మహా బలవంతుడును నాఅంశ కలవాడును అయిన శేషుడనే పర్వతము లోకోపకారార్థమై నీ వంశమం దుదయించును. అతని వంశజులందరు మహాభాగవతోత్తములు నాయందు భక్తి గలవారలు

బ్రహ్మవేత్తలు కాగలరు. నీ వంశజాల కందరకు నభీష్టము లిచ్చుటనే వైవస్వతాంతరము వరకు నొసంగుచుందును. అని చెప్పగా విని.

**హారీతమహారాజు విష్ణువును స్తుతించుట.**

శ్లో. పంచరాత్రవిదోऽన్యేచ, పంచకాల పరాయణాః
త్వామర్చయంతి దేవేశం, సతతం శుద్ధ యాజినః
అన్యేవిఖనసాప్రోక్త, మాస్థాయనియమంనరాః
త్వదారాధన మీహంతే, త్వయ్యేవకృతనిశ్చయాః
ముకుంద త్వామనారాధ్య, కఃపుమాన్ సమవాప్నుయాత్
త్రివర్గమపవర్గంవా, త్రిషులోకేషు కేశవ.

తా. పాంచరాత్ర వేత్తలును ఇతరులయిన పంచకాలపరాయణులును శుద్ధ యాజులును నిన్నర్చించుచుందురు. మరికొందరు వైఖానస సూత్రము ననుసరించి నీ యందే చేయబడిన చిత్తము గలవారలై నిన్నారాధింతురు. ఏ పురుషుడైన నిన్నారాధింపకుండగ త్రివర్గాప వర్గములను, మూడులోకములలో నొందజాలడు. అని యిట్లు స్తుతించి.

శ్లో. అథదివ్యాలయేతస్మిన్, విమానేనస హైవతం
స్థాపయామాస దేవేశం, వైఖానసవిధానతః

తా. అటుపిమ్మట దేవాలయమునందు విమానములతో గూడ నా కేశవస్వామిని వైఖానస విధానముచే బ్రతిష్ఠించెను. అని యున్నది. ఇట్లు ప్రతిష్ఠించి యా కేశవుని యనుగ్రహంబున వంశాభివృద్ధి గలవాడై యుండెను. తరువాత నాహారీ మహారాజవంశ మందు,

**ప్రపన్నామృతము ద్వితీయోऽధ్యాయం**

శ్లో. హారీతాన్వయసంభూతో, నిత్యంహరిపరాయణః
భార్య యా సహసంయుక్త, స్తత్రాస్తే బ్రాహ్మణోత్తమః 16
అనపత్యతయాతస్యాం పుత్రార్థే వైష్ణవోత్తమః. 17
ఇష్టించకార విధివ, త్సవిప్రశ్శ్రీహరింతదా 21

తయేష్ట్వాద్విజవర్యాయ, ప్రసన్నః పార్థసారథిః
ప్రాప్స్యేమ్యహం తేపుత్రత్వ, మితిస్వప్నే తమ బ్రవీత్. 22

తతోలబ్ధవరో ధీమాన్ కేశవో భార్యయాసహ
అవాపభూతనగరీం, దృష్టః కేశవపాలితాం. 23

తతఃకతిషుయాతేషు, వాసరేష్వబ్జలోచనా
గర్భందదౌ కాంతిమతీ, పత్నీకేశవయజ్వనః 24

ఏవంగ తేబహుతిధౌ తస్యాం జజ్ఞేమహామతిః
చైత్రేమేషేశుక్లపక్షే, పంచమ్యాంగురువాసరే. 25

తా. హరితాన్వయ సంభూతుడును నిత్యము హరిపరాయణుండును నైన బ్రాహ్మణుడు భార్యతో గూడి యచ్చటనుండెను. అతడనపత్యుడై ఆమెయందు పుత్రార్థమై యధావిధిగా శ్రీహరిని గురించి యిష్టిచేసెను. ఆ యిష్టిచే పార్థసారథి ప్రసన్నుడై నీకు పుత్రత్వము నొందెదనని యతని స్వప్నమందు చెప్పెను. తరువాత నా కేశవుడు భార్యతో గూడి భూతనగరంబునకు వచ్చెను. తరువాత కొన్ని రోజులకు గాంతిమతి గర్భము ధరించి చైత్ర శుద్ధ పంచమీ గురువారంబున కొమారునింగనియె. ననిచెప్పి యున్నది. ఇట్లవతరించిన యారామానుజాలు సకలశాస్త్ర కళాకోవిదులై శంకరాచార్య కృతంబైన యద్వైత సిద్ధాంత భాష్యం ఆకర్ణించి యందు విశిష్టా ద్వైత ప్రపత్తి లేకుండుటచే తాను భాష్యంబు సేయందలంచి శారదాపీఠంబునకుంజని యచావె వాక్యంబులకుం బ్రత్యుత్తరంబు లిచ్చి భాష్యకార నామంబు వహించి కాంచీపురంబునకుం జని యచ్చట గొందర శిష్యవర్గమంగొని శ్రీరంగమునకు బోయిరి. పిమ్మట రంగనాథుని దర్శింప గోరి, ఉత్సవ సమయమగుటచే గొంతదడవు నిలచి యుత్సవంబునకు బయలుదేరిన పిమ్మట నాస్వామి నా యుత్సవంబునం దర్శించి యప్పుడా యుత్సవ మూర్తులకు వాతాహతిం దొలంగిన పరిధానంబులు యోగదండముచే సరిచేసిరి. అందువలన వైఖానసాగమ విధివిధాన సంస్కారమూర్తులయిన శ్రీరంగనాయకులకు గలవిహీనమయ్యెను. వైఖానసులప్పుడా స్వామిని వాహనావతీర్ణుల గావించి,

**అర్చనానవనీతము**

శ్లో. దైవీకే గర్భగే హేతు, ద్విజస్యాపి ప్రవేశనే
తతో యతీంద్రః కుపిత, స్తేషాంవిజ్ఞాయతన్మతం
తానర్చకాన్ తృణీకృత్య, సహసోత్థాయసంమతాన్
బలాత్కారేణ తత్రత్యాన్, స్థాపయిత్వా దృఢవ్రతాన్
తైర్జనైః పాంచరాత్రేణ శ్రీరంగస్థలవత్తదా
జగన్నాథస్థలం కర్తుముద్యుక్తో యతిభూపతిః

తా. ఆ యతీంద్రుల వాక్యము లాజగన్నాథస్వామివారి యర్చకులు విని యంగీకరింపక నచ్చటినుండి శీఘ్రముగా లేచిపోయిరి. అందువలన యతీంద్రుల కాగ్రహము గలిగి వారి మతము నెరింగి, అయర్చకుల దృణీకరించి యచ్చటనున్న వారిని సాయము తీసికొని, జగన్నాథ స్థలమును శ్రీరంగమువలె బలాత్కారముగా పాంచరాత్రము సేయ యత్నించిరి.

అని యుండుటీ శ్రీరంగక్షేత్రము వైఖానసుల వల్ల నుండి బలాత్కారముగా రామానుజుల వారాక్రమించిరని తెలియుచున్నది. బలాత్కారవున నెట్లన. శ్రీరంగనాథుని కళాహీనమైనదని తిరిగి వైఖానసులు కళావాహనము చేసి ప్రత్యక్షముగా గనుపించుటచే నప్పుడేమియు సేయజాలక నంతటినుండియు వారితో మిత్రత్వమాచరించి ప్రతి దినమును వారి యింటికి బోయి పరిచర్య సేయుచు నింటిలోనిస్వజనమువలె నుండుట ప్రారంభించిరనియు, అట్లు గొంతకాలము గతించిన పిమ్మట తిరుమలాచార్యుల వారి మాతృదైవమునకు జరమావస్థ సంప్రాప్తమైనదనియు, నాసమయంబున నామెవిశేషించి దాన ధర్మములు సేయుచుండెననియు, యతియైన రామానుజుల వారు నాకు శ్రీరంగనాథు నర్చించుటకైదు దినములు సెలవిప్పింపుమనియు నిదియే నాకు గావలసిన మహాదానమనియు కోరిరనియు ఆమె యందులకంగీకరించి కుమారునిచే వాగ్దానంబు చేయించి తాను పరమపదంబునకు బోయెననియు, తిరువులాచార్యుల వారామె కూర్ధ్వదైహిక క్రియలు నిర్వహింపజేసి మాతృవాక్య పరిపాలనంబునకై రామానుజుల వారికి శ్రీరంగనాథునర్పించిరనియు, పిమ్మట నాయతి నేనర్చించు రోజులలో నాలయ ప్రాకారములలో నుండి, నీ పుత్రమిత్ర పరివారములతో మరియొక చోటికి బోవలయునని

యాజ్ఞాపించిరనియు వారందులకు సమ్మతింపకుండుటచే, తన స్వజనములను గూర్చుకొని బలాత్కారముగా వారిని యిల్లు వెలువరించిరనియు. ఐదు రోజులైన పిమ్మట మరల స్వాధీనము సేయక పాంచరాత్రాగమ ప్రకారమర్చించుచు వైఖానసులను ప్రాకారములోని కైనను రాకుండ దగిన జనుల నచ్చట గావలియుంచిరనియు తిరుమలాచార్యులవారును వారి శిష్య ప్రశిష్యులతో గూడ రంగనాధునకు తమ యందు గలిగిన నిర్దయాళుత్వమునకు తాము చేసుకున్న బుద్ధిపూర్వకాపచారమ్మునకును ప్రళయాంతకమైన స్త్రీబుద్ధియే గారణముగా నెంచుచు (స్త్రీ బుద్ధిః ప్రళయంకరీ) అను నార్యోక్తి ననుస్మరించుచు, చేయునది లేక, శ్రీ తిరుమల వేంకటాచలపతి సన్నిధికింబోయిరనియు వినికిడి గలదు.

**రామానుజులు జగన్నాధమునకు బోవుట.**

**ప్రపన్నామృతం 35 అధ్యాయము.**

శ్లో. తైర్లనైః పాంచరాత్రేణ, శ్రీరంగస్థలవత్తదా
జగన్నాధస్థలంకర్తు, ముద్యుక్తోయతిభూపతిః
స్వవశీకృతభూపాలః సబభూవజగద్గురుః
తస్యాంరాత్ర్యాం తదాసర్వే, జగన్నాధార్చకా స్తథా
జ్ఞాత్వా తేతదభిప్రాయం, మిలిత్వామంత్ర్యనత్వరం
జగన్నాధాలయంప్రాప్య, దేవస్యాగ్రే జగత్పతేః
బద్ధాంజలి పుటాస్సర్వే, చక్రుర్విజ్ఞాపనంతదా
దేవ దేవజగన్నాధ, భక్తాభీష్టప్రదాయక
త్వద్దా సభూతాన్ లక్ష్మీశ, పాహ్యస్మాన్ కరుణాకర
రామానుజాభిధానోకద్య, యతీంద్రఃకశ్చిదాగతః
మార్గాంతరం సమాశ్రిత్య, భవతః సయతీశ్వరః
పూజాకార్యాణి, సర్వాణి, కర్తుకామః సమాస్థితః
పూర్వస్థితేనమార్గేణ, త్మమస్మాభిర్దయానిధే
పూజితస్సర్వపూజాభిః, సర్వాభీష్టప్రదోభవ
భవతాస్మత్కృతాపూజా, నచాంగీక్రియతే యది

వయమద్యైవతేసర్వే, మరిష్యామోనసంశయః
ఇత్యుక్త్వాతేకర్చకాస్సర్వే, గుర్వీశ్చద్ధృషదస్తథా
గృహీత్వాస్వశిరాంస్యాశు, హంతుమారేభిరేపరం.

తా. రామానుజుల వారు శ్రీరంగము వలె బలాత్కారముగా జగన్నాధము గూడా పాంచరాత్రము సేయుటకై రాజులను వశము చేసుకొని యుండె. ఆ సంగతి యా జగన్నాధస్వామి వారి యర్చకులు విని యారాత్రి స్వామివారి సన్నిధికి బోయి స్వామీ రామానుజులను యతి యొకండు వచ్చి మరియొక మార్గము ననుసరించి నీ పూజా కార్యములు చేయదలంచి యున్నాడు. పూర్వము నుండియు నేమార్గముగా నీవు పూజింపబడుచుంటివో, యట్లే మాయందను గ్రహింపుము. అట్లు మా పూజ నీచే యంగీకరింపబడదేని మేమందరము ప్రకృతము నందే ఇప్పుడే ప్రాణత్యాగమొనరించు కుందుము. అని చెప్పి గొప్పవైన రాళ్లు గ్రహించి శిరంబుల గొట్టుకొనబోయిరి.

శ్లో. తతఃప్రసన్నో భగవాన్, జగన్నాథః కృపానిధిః
సతేభ్యోహ్యభయందత్వా, కృపయాతానపాలయత్
అర్చకాస్తే తతస్సర్వే, సంప్రహృష్టాః కృపాదరాత్
ప్రపేదిరేస్వవేశ్మాని, శాసనాజ్జగతీపతేః.

తా. అటుపిమ్మట కృపానిధియైన జగన్నాధస్వామి ప్రసన్నుడై అర్చకుల కభయ ప్రదాన మొనరించి, వారిని పాలించెను. వారు నా రాత్రి జగన్నాధుని కృపాదరములకు సంతోషించుచు స్వగృహంబులకు బోయిరి.

## జగన్నాధరామానుజ సంవాదము

శ్లో. జగన్నాథం సమాసాద్య, మతిమాన్ సత్వరంతతః
ప్రణమ్యలక్ష్మణాచార్యః, కృతాంజలి రభాషత
విజ్ఞాపనం మమేదానీం, భగవన్నవధార్యతాం
శ్రీరంగాదిస్థలాన్యద్య, వర్తంతేజగతీతలే
పాంచరాత్రాగమేనైవ, తాని సర్వాణి సాంప్రతం
తథైవచాంగీ క్రియతాం, స్థలస్యాస్య జగత్పతే.

తా. రామానుజుల వారు శీఘ్రముగా జగన్నాధస్వామి వద్దకు బోయి కృతాంజలియై స్వామీ ! విజ్ఞాపన మవ ధరింపుము. ఇప్పుడు శ్రీరంగాది స్థలములు పాంచరాత్రాగమముచే పూజింపబడుచున్నవి. వాటివలెనే యీ స్థలమునకు గూడ నంగీకరింప వలయును.

శ్లో. నాంగీకృత్యవచస్తస్య, తమూహపురుషోత్తమః
యతీంద్రశృణుమేవాక్యం, మన్నాధజగతాంగురో
శ్రీరంగాదిస్థలానీహ, వర్తంతేజగతీతలే
కృతానిత్వదధీనాని, మయాతత్రజగద్గురో
మదధీనమిదం క్షేత్రం, దేహిమే పురుషోత్తమ
స్వైర మత్రజనై రేతై ర్విహరామి సుఖంయధా.

తా. అనగాజగన్నాధుడా వాక్యముల కంగీకరింపక శ్రీరంగాది స్థలములు నీయధీనములు చేయబడినవి. ఇది నాయధీనమైన క్షేత్రముగా నిమ్ము సుఖముగా నే నిచ్చట విహరించెదను.

శ్లో. తదాకర్ణ్య వచస్తస్య, జగన్నాథస్య యోగిరాట్
పునఃపునః తథైవేదం, క్రియతామిత్యువాచసః
తమబ్రవీజ్జగన్నాధ, స్తథైవాత్రనవర్తతే
ఏవముక్తోకపిహరిణా, జగన్నాథేన యోగిరాట్
పాంచరాత్రాగమేనైవ, కర్తవ్యం నిశ్చయంస్థలం
ఇతి నిశ్చిత్యమనసా, ప్రణమ్యజగదీశ్వరం
అనుజ్ఞాతోకథహరిణా, వివేశమఠమంజసా
తస్యాంనిశాయాం సుష్వాప, యతిరాజోజగద్గురుః
స్వమతేశిష్యసంఘైశ్చ, సంవృతస్సాధుసమ్మతః
నృపంవశీకృత్యసమంత్రివర్గం
సర్వంజనం చాశుసలక్ష్మణార్యః
శ్రీరంగవత్కర్తు మలంప్రయత్నా
దియేషబుద్ధ్యా పురుషోత్తమోహి.

తా. రామానుజ లాజగన్నాథుని వాక్యముల వినియును, మాటి మాటికి పాంచరాత్రమే చేసెదనని చెప్పెను. జగన్నాథుడా ప్రకారమిచ్చుట వర్తింపదని చెప్పినను వినక పాంచరాత్రాగమము చేతనే యీ స్థలము చేయదగినదని నిశ్చయించి జగన్నాథుని వద్ద సెలవు దీసి కొని మఠమునకు బోయి శిష్యులతో నారాత్రి నిద్రించి మంత్రివర్గముతో రాజును సర్వజనులను వశీకరము జేసుకొని శ్రీరంగమువలెనే చేయవలెనని మనస్సున నిశ్చయించెను.

**జగన్నాథుడు రామానుజులను శ్రీకూర్మమునకు పంపుట**

శ్లో. తతోభక్తపరాదీనో, జగన్నాథోకప్యచింతయత్
అయంరామానుజశ్శ్రీమాన్, సుమహాత్మా దృఢవ్రతః
ఉల్లంఘ్యమద్వచస్సత్యం, తత్తథైవ కరిష్యతి.
పాంచరాత్రాగమేనైవ, స్థలస్యాస్య ప్రవర్తనం
అర్చకాస్తేనమేశీఘ్రం, మరిష్యంతి నసంశయః
అతోకధునైవయోగీంద్రః, ప్రాపితవ్యస్సుదూరతః
ఇత్యాలోచ్యజగన్నాథోలక్ష్మణార్యం మహామతిం
తద్రాత్రావేవయోగీంద్రం, ప్రాపయామాస సత్వరం
శ్రీకూర్మేలక్ష్మణాచార్యం, శ్రీహరి ర్యోగమాయయా.

తా. అప్పుడు భక్తపరాధీనుడైన జగన్నాథు డీ రామానుజుడు, నా వాక్యముల్లంఘించి పాంచరాత్రము సేయక మానడు. అందువలన నాయర్చకులు మరణించగలరు. ఆకారణముచే నీతని నిప్పుడే దూరమునందు బారవేయవలయునని యాలోచించి, యూరాత్రి యందే యోగమాయచే నారామానుజాని శ్రీ కూర్మమునకు పంపెను.

శ్లో. ప్రభాతాయాంతుశర్వర్యాం, తస్యాంలక్ష్మణదేశికః
ఉత్థాయ సహసాధీమాన్ హర్షిర్గిరి తీరయన్.
దృష్ట్వాదశ దిశస్సమ్య, క్చింతావ్యాకులమానసః
శ్రీకూర్మమితితత్క్షేత్రం, జ్ఞాత్వా విస్మయమాగతః

శ్రీకూర్మనాయకంమత్వా, శివలింగ మితీరితం
ఉపవాసేనతత్రైకం, వాసరంస్థితవాన్ గురుః
రాహిత్యాచ్ఛ్వేతమృత్స్నాయాః విష్ణ్వర్చాయాశ్చసత్తమః.

తా. మరునాడు తెలవారిన పిమ్మట నా లక్ష్మణాచార్యులు లేచి హరిస్మరణము చేయుచు దశదిక్కులు చూచి విచారగ్రస్తమైన మనస్సుతో ఇది శ్రీకూర్మమని యెరింగి విస్మయము నొంది శ్రీకూర్మనాయకులు శివలింగమని చెప్పెదరనుచు విష్ణ్వర్చనయు శ్వేతమృత్తికయు లేకుండుటచే నొకదినమంతయు నుపవాసముతో నుండెను.

శ్లో. స్వప్నేప్రసన్నోభగవాన్, తస్యశ్రీకూర్మనాయకః
వ్యాజహారశుభంవాక్యం, కృపయాయతి భూపతిం
యతీంద్రాజ్ఞానదోషేణ, శివలింగం జనా ఇతి
మాంవదంతి మృషాసర్వే, మాయాంధీకృతలోచనాః
వత్స్యామ్యత్రస్వరూపేణ, శంఖచక్ర గదాధరః
లక్ష్మణార్యాధునాశీఘ్రం, త్వంమాంసమ్యగ్విలోకయ
శుద్ధామదాలయస్యాగ్రే వర్తతే శ్వేతమృత్తికా
సమ్యక్త్వ మూర్ధ్వపుండ్రాణి, ధృత్వావైష్ణవసత్తమ
మామారాధ్యాశునైవేద్యం, భక్త్వాసమ్యక్స మర్ప్యచ
భోజనంకురుయోగీంద్ర, మత్ప్రసాదంసుపావనం
అత్రైవ పూజయన్ మాంత్వం, దినానికతిచిద్వస.

తా. ఆరామానుజుల వారి స్వప్నమందు శ్రీకూర్మనాయకుడు ప్రసన్నుడై యజ్ఞానదోషముచే జనులునన్ను శివలింగమని చెప్పుచున్నారు. అదియంతయు నసత్యము. ఇచ్చట శంఖచక్ర గదాధరుడనై యున్నాను. నన్ను బాగాగా జూడుము. నాయాలయాగ్రమున పరిశుద్ధ మైన శ్వేతమృత్తిక గలదు. నీవూర్ధ్వపుండ్రములు ధరించి శీఘ్రముగా నన్నారాధించి నాకు నివేదనము చేసి పవిత్రమైన నా ప్రసాదమును భుజింపుము. ఇచ్చట నేనన్ను పూజించుచు కొన్ని దినములుండుము.

శ్లో. అత్రైవచాగమిష్యంతి, జగన్నాథేనచోదితాః
త్వద్వయాః సత్వరంసర్వే, లక్ష్మణార్య నసంశయః
విచారంమాకురుష్వాత్ర, తవాధీనమిదంకృతం
పూర్వమేవమయాతాత, విభూతిద్వయమాదరాత్
తతస్స్వప్నాత్సముత్థాయ, సంతుష్టో విస్మయాన్వితః
తథావిధాయయోగీంద్ర, స్తేనోక్తే నైవవర్త్మనా
కూర్మనాథంసమారాధ్య, తన్నివేదితభోజనం
విధాయతస్యపాదాగ్రే, సుఖంతత్రావసత్తథా.

తా. నీ సంబంధమైన వారలందరు, జగన్నాథచోదితులై ఇచ్చటికే వత్తురు. ఇందుకు విచారింపకుము. విభూతి ద్వయము పూర్వమందే నీయధీనము చేయబడిన వని శ్రీకూర్మనాథుడు చెప్పగా రామానుజులు స్వప్నము నుండి మేల్కాంచి సంతుష్టి నొంది ఆ స్వామి వారు చెప్పిన రీతిగా వారినారాధించి యాప్రసాదమును భుజించి యాదేవుని పాదాగ్రములయందు సుఖముగా నుండెను.

**జగన్నాథునర్చించువారు వైఖానసులైనట్లు ప్రమాణము.**

**బ్రహ్మాండపురాణము అర్థ పంచక వివరణము దశమోకధ్యాయము.**

పూర్వము సూర్యవంశోద్భవుడైన చంద్రకేతు మహారాజు వేటకై బోయి యగస్త్యమహామునిని తిరస్కరించి రాక్షసత్వము బొంది యా శాపావసానంబునకై పదివర్షంబులు గడువునొంది యాకాలంబున బ్రహ్మహత్యలనేకములు జేసి, తుదకు శాపావసానమందు తన రాజ్యమునకు రాబోవగా వాని పురోహితుడారాజును జూచి నీ శాపకాలమందు జేసిన బ్రహ్మహత్యాదోషనివృత్తియైన పిమ్మట గాని రాజ్యార్హుడవు గావని చెప్పె. అప్పుడు తిరిగి నరణ్యమునకు బోయి యగస్త్యుని దర్శించి బ్రహ్మ హత్యా ముక్త్యుపాయ మడిగినట్లు పై కథా సందర్భము. అట్లడుగగా నాతడు.

48. శ్లో. జగన్నాథేమహాక్షేత్రే, నీలాద్రౌపురుషోత్తమః
అర్చారూపేణావతీర్ణో, ముక్తింయచ్ఛతిదేహినాం.

49. శ్లో. త్వంగత్వాద్యజగన్నాథం, నారాయణమనామయం
చతుర్విధాన్నదానేన, ప్రీణయస్వజగత్పతిమ్.

తా. మహాక్షేత్రమైన శ్రీ జగన్నాధమందు పురుషోత్తము డర్చారూపముగా నవతరించి దేహులకు ముక్తినిచ్చు చున్నాడు. నీవచ్చటకు బోయి చతుర్విధములైన యన్నదానముచే నారాయణుని తృప్తి నొందింపుము.

అని చెప్పెను. అటు తరువాత నారాజు జగన్నాధమునకు బోయినట్టు నచ్చట మహోదధియందు స్నానము చేసి దానధర్మములు విశేషముగా నొనర్చి ఆలయమునకు వచ్చి గోపుర ప్రాకార విమాన మంటప ధ్వజస్థంభములను దర్శించి జగన్నాధుని సేవించి యనేకాంబరా భరణాదులొసంగినట్టును కథా సందర్భము.

శ్లో. తతోవైఖానసంవిప్రం, దేవస్యాపరవిగ్రహం
యాజకం ప్రణిపత్యాహ, స్వస్యాగమనకారణం
అగస్త్యముని వాక్యంచ, సోప్యనుగ్రహవానభూత్
తస్యానుజ్ఞా మనుప్రాప్య, భూసురైర్బ్రహ్మవాదిభిః
అన్నంకృత్వాబహుగుణం, చతుర్విధమనుత్తమం
అర్పయామాసదేవాయ యాజకేనమహాత్మనా
తదన్నం బుభుజేదేవో, భగవాన్భక్తవత్సలః
వైఖానసస్య హస్తేన, శాల్యన్నంమధురం ముదా.

తా. పిమ్మట దేవసమానుడును అర్చకుడును అయిన వైఖానస బ్రాహ్మణునకు నమస్కరించి తాను వచ్చిన కారణమును కుంభసంభవుని వాక్యమును వినిపించి వారి యాజ్ఞ పొంది బ్రహ్మవేత్తలయిన భూసురులచే నాలుగు విధములయిన యన్నమును చేయించి భగవంతునకర్చకునిచే సమర్పింప జేసెను. జగన్నాధు డా యన్నమును తన యర్చకుడయిన వైఖానసుని హస్తముచే తాను భుజించెను. అని యిట్లు చెప్పియున్నది. ఇందువలన జగన్నాధస్వామివారు వైఖానసుల చేతనే యర్చింపబడుచుండిరని తెలియుచున్నది. ప్రపన్నామృతములో నర్చకులని మాత్రమే వ్రాసిరిగాని ఆ యర్చకు లెవ్వరో స్పష్టీకరింపలేదు. రామానుజుల వారును తమకు పూర్వము వైఖానసులర్చించుచున్న దేవాలయముల లోనే పాంచరాత్రార్చనము సేయింప యత్నించిరి గాని మరియొక చోట నట్టి ప్రయత్నము చేసినట్టు లేదు. కాన శ్రీరంగ క్షేత్ర మాక్రమించిన రీతిగనే జగన్నాధము గూడ నాక్రమింపదలచిరి గాని యర్చకపరాధీనుడైన

జగన్నాథస్వామివారు వారి యత్నంబు సాగనీయకుండుటయే గాక వారిశిష్య ప్రశిష్యులతో గూడ శ్రీకూర్మమునకు పంపి నచ్చటనుండి సింహాచలము గరుడాద్రి అహోబిలము మొదలైన క్షేత్రములు సేవించుకొనుచు తిరుమలకు వచ్చిరని తెలియుచున్నది. ఈ స్థలములయందు మాత్రమేమియు కట్టుబాటులు చేసినట్టు కనుపించదు.

## రామానుజులవారు తిరుపతికి వచ్చుట

సింహాచలాది క్షేత్రములు సేవించుకొనుచు తిరుమలకు వచ్చువరకు స్వామి పుష్కరిణీ తీరమంద శంఖచక్రాది రహితుడై యున్న వేంకటేశ్వరుని కుమారస్వామియని శైవులాక్రమించిరనియు, వైష్ణవులు వేంకటేశ్వరులనియు, శైవులు స్కందుడనియు కలహింపసాగిరనియు అప్పుడా యతీంద్రులు వారలకు సమాధానమునకై శైవ చిహ్నములైన చక్రాదులను స్వామివారి యెదుటనుంచి కవాటములు బంధించిరనియు, స్వామివారెవ్వియును ధరింపలేదనియు, అది చూచి రామానుజులు తన పూర్వ రూపమైన సర్పాకృతిని ధరించి సోమసూత్రము నుండి లోనికి బోయి వైష్ణవ చిహ్నములు ధరింప జేసిరనియు, అప్పుడు శైవులు స్కందుడు కాడని యెరింగి పలాయమానులైరనియు యతీంద్రుల వేంకటేశ్వరునకు మంగళాశాసనము జేసి సత్యవ్రత క్షేత్రమునకు బోయిరనియు, ప్రపన్నామృతము 36 అధ్యాయములో నున్నది.

ఇందువలన రామానుజుల వారికి పూర్వము వేంకటేశ్వరుడు చక్రాదివిష్ణు చిహ్నములు గాని శూలాదిశైవ చిహ్నములు గాని లేక శైవ వైష్ణవ కలహకారణుడై యున్నాడనియు, తెలియుచున్నది. ఇట్టి స్థితిలో విష్ణ్వాయుధములు ధరించిన పిమ్మట విష్ణ్వర్చనా ప్రతిపాదకమైన పాంచరాత్రాగమ ప్రకారము గాని, వైఖానసాగమ ప్రకారము గాని ఆరాధింప నియోగించినట్టు కనుపించదు. శ్రీరంగాది క్షేత్రములయందు స్వామివారి నర్చించుచున్న వైఖానసులను బలాత్కారముగా దొలగించి పాంచరాత్రము జేసిన రామానుజలవారే విధమైన అర్చనయు లేని తిరుపతిలో అర్చక విషయములో జోక్యము పెట్టుకొనలేదు. వైష్ణవులకు శైవులకు కలహము గలిగిన దని చెప్పుటచే వీర లుభయులు నారాధించుచున్నట్లు తోచుచున్నది. వైష్ణవులనగా పాంచరాత్రులా, వైఖానసులా యని యొక చిన్న సంశయము. రామానుజుల వారికి పూర్వము విష్ణువు నారాధించువారు వైఖానసులనియే స్పష్టముగా బ్రహ్మాండాది పురాణ దృష్టము గదా ?

శ్రీరంగము బలాత్కారముగా పాంచరాత్రము చేసినట్టును, జగన్నాధుడందుల కంగీకరింప శ్రీకూర్మమునకు పంపినట్లునూ ప్రపన్నామృతము చెప్పుచున్నది. కాబట్టి తిరుపతిలో పాంచరాత్రము సేయుట సాగదని అర్చక విషయమే తలంచలేదని మన మూహించవలసి యున్నది. అదియునుం గాక.

బ్రహ్మాండపురాణె వేంకటాచలమాహాత్మ్యే

ఏకాదశోకధ్యాయే.

శ్లో. ''శ్రీ భగవన్'' శంఖచక్రే ప్రదాస్యామి, భావిసాయుజ్యసూచకే
తధాకౌమోదకీం శార్ఙ్గం నందకంచమహామతే.
పంచాయుధధరోభూత్వా, దురాత్మానం సురద్రుహం
సబంధువర్గం సామాత్యం, జహిసంగ్రామ మండలే
ఇత్యుక్త్వా ప్రదదౌతస్మై శుచయే చక్రవర్తినే
శంఖచక్ర గదా శార్ఙ్గం ఖడ్గాని మధుసూదనః

తా. ముందుసాయుజ్య సూచకములైన శంఖచక్ర గదాశార్ఙ్గ నందకముల నిచ్చుచుంటిని. వానిచే నీరాక్షసుని బంధువర్గములతో యుద్ధములో జయింపుము. అని చెప్పి మధుసూదనుండు తన శంఖ చక్ర గదాశారంగ నందకములను చోళరాజ కుమారుడైన చక్రవర్తి యను వానికిచ్చెను.

శ్లో. తతస్సింహాదనంహారీ, చక్రవర్తీమహీపతిః
వ్యజిజ్ఞపత్స్వవృత్తాంతం, వేంకటాశాయసర్వతః
శంఖచక్రగదాశారంగ నందకౌనృపనందనః
అర్పయామాసహరయే, వేంకటాద్రి నివాసినే.

తా. అటుతరువాత సింహాదుడను రాక్షసుని సంహరించి చక్రవర్తియను రాజా వేంకటేశ్వరునితో నా వృత్తాంతము చెప్పి శంఖ చక్ర గదా శారంగ నందకములనిచ్చెను.

శ్లో. రాజానంచతథాపంచా, యుధాన్యపిచమాధవః
ఉవాచమేఘనిర్ఘోష, గంభీరమబ్రవీత్ గిరా

తా. అప్పుడు మాధవుడా రాజాతోను పంచాయుధములతోను మేఘగంభీరమైన వాక్కుతో నిట్లనియే.

శ్లో. రాజన్! యధేచ్ఛసి జయం, అజయ్యేసాంపరాయకే
తధేమాన్యాయుధాన్యుచ్చై, స్సాహాయంకుర్వతాంతవ.

తా. ఓ రాజా! శత్రువులతో యుద్ధమందు నీవెప్పుడు జయము గోరెదవో అప్పుడీ యాయుధములు నీకు సాహాయ్యము సేయగలవు.

శ్లో. హేశంకచక్రశారంగసి, కౌమోదకి మహాగదా
రాజ్ఞోన్యకామదాఃకాలే, స్వస్వతీర్థేషుతిష్ఠత.

తా. ఓ శంఖచక్ర శారంగసి కౌమోదకి గదలారా! ఈ రాజునకు గోర్కెలిచ్చు మీ మీ తీర్థముల యందు నివసించియుందురు గాత.

శ్లో. మానసేమేస్తికసద్యోహం, ప్రత్యక్షవిగతాయుధ.
కించిత్కాలంవసిష్యామి, తతఃకేనాపి హేతునా
కలౌకశ్చిన్మహాభాగః, శంఖచక్రేతుకృత్రిమే
కారయిత్వాస్థాపయితా, విమానాదీంశ్చ మేపునః

తా. నేను సద్యస్కాలమందే ప్రత్యక్షముగా విగతాయుధుడనై యుండవలెనని మనస్సు గలదు. కాన కొంత కాలమట్లు నివసించెదను. తరువాత నొక హేతువు చేత కలియుగమందు మహాభాగవతోత్తము డొకడు కృత్రిమ శంఖచక్రములను విమానాదులను చేయించి స్థాపింపగలడు. అని యున్నది.

కలియుగమందు వేంకటేశ్వరునకు విమానాదులను గల్పించిన వాడు తొండమానుడు. గావున నతనిచే కృత్రిమములైన శంఖచక్రములను గూడ నిచ్చినట్లు దీనివలన ధ్వనించుచున్నది.

## బ్రహ్మాండ పురాణాంతర్గత వేంకటాచల మాహాత్మ్యము

### సప్తమోఽధ్యాయము.

57. శ్లో. స్థితేకదాచిత్ క్షితిపే, శ్రీనివాసస్య సన్నిధౌ
శత్రవశ్చబలోద్రిక్తా, రురుధుస్తస్యవైపురీం
శ్రుత్వాబలార్ణవంఘోర, మాయాంతంనాతి శంకితః
యోద్ధుకామోజగామాథ, పునస్తైశ్చ పరాజితః
బిలద్వారేణ దేవేశం, గత్వాపాదౌ ప్రగృహ్యచ
రురోదత్రాహిత్రాహీతి, తంప్రాహార్చాస్వరూపవాన్
మాభైషీః పుత్రభద్రంతే, చక్రశంఖౌ దదామితే
తాభ్యాంగచ్ఛపురీందివ్యాం, తౌతేశత్రూన్ హనిష్యతః
ఇత్యుక్త్వా తౌదదౌతస్మై, తాభ్యాం సహజగామసః
తౌచ శత్రూన్ నిహత్యాశు, కృత్వారాజ్యమకంటకం
ఆజగ్మతుః క్షితిభృతా, సాకందేవస్య సన్నిధౌ
రాజాదేవంవవం దేఽథ, స్తుత్వా స్తోత్రైరనేకశః
పరంవరయభద్రేతి, దేవోరాజానమబ్రవీత్
మమాయుధ ప్రదానస్య, ఖ్యాత్యైదేవోత్తమప్రభో
అర్చాబింబేశిలాబింబే, చక్రశంఖౌనధారయ
ఇతిసంప్రార్థితోదేవో, నదధారపునశ్చతౌ
అదృశ్యౌతిష్ఠతశ్చోభౌ, పార్శ్వతశ్శారంగధన్వనః.

ఇంతకు ముందు తొండమానుని వృత్తాంతము వచ్చుచున్నది.

తా. ఆరాజా శ్రీనివాసుని సన్నిధియందుండగా నొకనాడు శత్రువులు వచ్చి యతని పురమునరి కట్టిరి. వారి సామర్థ్య మెరుంగక వారితో యుద్ధము చేసి యోడిపోయి ఖిన్నుడై బిలద్వారమున శ్రీనివాసుని సన్నిధికి పోయి పాదములు బట్టుకొని రక్షించుమని మొర పెట్టెను. ఆ శ్రీనివాసుడా రాజునోదార్చి నాశంఖ చక్రముల నిచ్చెదవాటితోపురమునకు బొమ్ము. అని నీ శత్రువును జయించుము. అని చెప్పి శంఖ చక్రములనిచ్చెను. అవి తొండమానుని శత్రువులను జయించి రాజ్యము నిష్కంటకము చేసి రాజుతో గూడ శ్రీనివాస సన్నిధికి వచ్చినవి. తొండమానుడు శ్రీనివాసునకు వందనము జేసి యనేక

విధంబులు స్తుతించె. శ్రీ నివాసుడా రాజును నీకు కావలసిన వరంబుగోరు మిచ్చెదననియె. అతండో స్వామీ! నాకు నీవాయుధముల నిచ్చితివను ఖ్యాతినిమిత్తము శిలాబింబమునందు గాని యర్చాబింబము నందు గాని, శంఖ చక్రములను ధరింపవద్దని కోరెను. అందులకాదేవుడంగీకరించి తిరిగి శంఖచక్రములను ధరింపలేదు. పార్శ్వములయందు మాత్రమదృశ్యముగా నున్నవి అని యున్నది.

ఇందువలన వేంకటేశ్వరుడు తన శంఖ చక్రములను తొండమానుని కిచ్చినట్లును, అతని కోరిక మీద మరల ధరింపకున్నట్లును తెలియుచున్నది అందుచేతనే బ్రహ్మాండ పురాణములో చెప్పిన రీతిగా కలియుగమునందు స్వామివారికి కృత్రిమశంఖ చక్రములను తొండమానుడే యిచ్చినాడనియు వాటినే స్వామిధరించి యుండెననియు స్వీయములైన శంఖ చక్రములదృశ్యములుగా పార్శ్వములయందుండిన వనియు నిశ్చయార్థము మరియు

**భవిష్యోత్తర పురాణాంతర్గత వేంకటాచల మాహాత్మ్యము**

**14వ అధ్యాయము**

శ్లో. స్వకిరీటం దదౌతస్య, శంఖచక్రేచ కౌస్తుభం
పీతాంబరమలంకారం, కులాలస్యమహాత్మనః
రమాయాభూషణంతావ, త్తమాలాయాశ్చసందదౌ
దివ్యంవిమానమారూఢౌ, విష్ణునాదత్తవైభవౌ
కులాలదంపతీభక్తౌ, పశ్యత స్తస్యభూపతేః
జగ్మతుర్విష్ణుభవనం, సాయుజ్యపదవీంగతౌ
కులాలపదవీంద్రుష్ట్వా, తొండమాన్నృప సత్తమః
వ్రీడితః పుండరీకాక్షం, శ్రీనివాసమభాషత
మద్గ్రాష్ట్ర గతశూద్రస్య సర్వదాపాపకారిణః
సద్గతిస్తుత్వయాదత్తా కాగతిర్మమబాంధవ.

తా. శ్రీనివాసుడు తన కిరీట శంఖ చక్ర కౌస్తుభ పీతాంబరములను లక్ష్మీదేవికి భూషణమైనతమాలయు కులాలున కిచ్చెను. ఆ కులాల దంపతుల దేవవిమానారూఢులై విష్ణుదత్త వైభవముతో తొండమానుడు చూచుచుండగ విష్ణుసాయుజ్యమును పొందిరి.

అది చూచి తొండమానుడు సిగ్గుపడి నారాజ్యమునందు గల శూద్రునకు సద్గతి నిచ్చితిని. ఓ బాంధవా! నాగతియేమని శ్రీనివాసునడుగుచున్నాడు. ఇందువలన తొండమానుని యందు వాత్సల్యముచే శంఖ చక్రములు ధరింపకున్నను అవి తన స్వాధీనములోనే యుండి కావలసినప్పుడు తాను ధరించుటగాని యితరుల కిచ్చుటగాని కలిగియున్నట్లు దీనివలన తెలియుచున్నది. తొండమాను డాలయగోపుర ప్రాకారవాపీ కూపారామ సోపానాదులను గట్టించి వైఖానసులచే స్వామివారిని విమానమందు బ్రతిష్టింపజేసి వారి చేతనే యర్చింప జేయుచుండెను. ఆ రాజునకు తరువాత వారు గూడ నట్లనే చేయించుచుండిరి. గాని యరాజకముగా లేదు. రామానుజుల వారును తొండమానునకు తరువాత స్వకాలములోనే యుద్భవించిరి గాని విశేష కాలాతీతముగా లేదు. అంత స్వల్పకాలములోనే తిరుపతి యర్చక హీనమై శైవ వైష్ణవులు స్కందుడనియు వేంకటేశ్వరుడనియు పెనగులాడుచుండిరనియు రామానుజుల వారు వేంకటేశ్వరులకు విష్ణ్వాయుధములు ధరింపజేసిరనియు ప్రపన్నామృతములో వ్రాయుట మిక్కిలి యద్భుతముగా నున్నది. (అట్లనే కావచ్చును). విష్ణ్వాయుధములు ధరింప జేసిన పిమ్మట అర్చకుల నెవ్వరి నేర్పాటు చేసిరి. అవిషయము దలంపనేలేదా. ఆలయమునకు బ్రధానులర్చకులు గదా ?

## బ్రహ్మాండ పురాణము వసిష్ఠ నారద సంవాదము
## వేంకటాచల మాహాత్మ్యము

శ్లో. వైఖానసమఖారంభో, వృషజ్ఞేయో వృషాచలః
వైఖానసమునిశ్రేష్ఠ పూజితాయనమోనమః

అని వేంకటేశ్వరాష్టోత్తరము. గావున శ్రీనివాసుడెప్పుడును వైఖానసార్చనా పరతంత్రుడగుటచే నచ్చట తమ ప్రయత్నమేమియు శ్రీజగన్నాథమువలెనే కొనసాగదని తలంచి స్వామివారిని మాత్రము దర్శించి సత్యవ్రత క్షేత్రమునకు బోయిరని

తెలియవచ్చును. శ్రీ తిరుమలాచార్యులవారును శ్రీనివాసు నర్చించుచు వేంకటాద్రి యందే నివసించి యుండిరని చెప్పవచ్చును.

**భూతపురి యందురామానుజు లర్చారూపము నొందుట.**

శ్లో. అర్చాయాస్సమ్యగేవాస్యాః, కేశవస్వామి సన్నిధౌ
దశరద్యాత్మజో ధీమాన్, విద్వద్భిర్వైష్ణవైస్సహ
యథావిధియథాశాస్త్రం, ప్రతిష్టామకరోన్మహాన్
జలవాసాభిషేకాది, కాలేషు యతిభూపతేః
ఆయాసస్సమహానాసీ, చ్ఛ్రీరంగే నివసం స్తదా
నేత్రోన్మీలనకాలేతు, రక్తంసుస్రావనేత్రయోః
అకస్మాన్మమదేహస్య, చాయాసస్సమహానభూత్
ఇత్యేవం లక్ష్మణాచార్య, స్తదాసంజాత విస్మయః
అకస్మాల్లక్ష్మణార్యస్య, రక్తం నేత్రయోః స్రుతం
విలోక్యవిస్మయంజగ్ముః, సర్వే శ్రీవైష్ణవోత్తమాః.

తా. భూతపురి కేశవస్వామి సన్నిధియందు శాస్త్రవిధ్యుక్తముగ రామానుజార్చా విగ్రహమును, విద్వాంసులైన వైష్ణవులతో గూడి దశరద్యాత్మజుడైన, లక్ష్మణాచార్యులు ప్రతిష్ఠ చేసెను. జలాధివాసాభిషేకాది కాలములయందు, శ్రీరంగమునందు నివసించియున్న యతీంద్రున కాయాసము గలిగినది. నేత్రోన్మీలన కాలమందు నేత్రముల నుండి రక్తస్రావమైనది. అకస్మాత్తుగా నా శరీరమున కాయాసము గలిగిన దని లక్ష్మణాచార్యు లాశ్చర్యము నొందెను. అకస్మాత్తుగా లక్ష్మణాచార్యుల నేత్రములనుండి జారిన రక్తమును జూచి శ్రీవైష్ణవులందరు విస్మయము నొందిరి అని యున్నది.

భూతపురి యందు శ్రీకేశవమూర్తిని, హారీతమహారాజు వైఖానస విధానముచే బ్రతిష్ఠింప జేసి యా పెరమాళ్ళు నిర్మించుటకు, శ్రీ వైఖానసులనే నియమించినట్లు భూతపురీమహాత్మ్యము జెప్పుచున్నది. 1) ఆ కేశవస్వామి వారిని నేటివరకు వైఖానసులే యర్చించుచున్నారు. అట్టి కేశవుని సన్నిధియందు రామానుజుల వారి నర్చారూపముగా

వైఖానసాగమ ప్రకారముగా ప్రతిష్ఠించిరా? లేక పాంచరాత్రాగమ ప్రకారమా. 2)పాంచరాత్రాగమ ప్రకారమేయైనచో పాంచరాత్రులే యర్చకులుగా నుండవలెను. అట్లుగాక నేటివరకును వైఖానసులే యర్చించుచున్నారు. 3) మొదట పాంచరాత్రాగమ ప్రకారమే ప్రతిష్ఠించి తరువాత వైఖానసుల కిచ్చిరా. 4) స్వాధీనమైనంతవరకు వైఖానసులను తీసివేసి, పాంచరాత్రము చేసిన రామానుజుల నర్చించుటకు వైఖానసుల కేల యిచ్చెదరు, వారలెట్లు అంగీకరించిరి. 5) తమకు సర్వస్వాతంత్ర్యము గల శ్రీరంగము నందేల యర్చారూపముగా నుండుట కంగీకరించలేదు. వైఖానస స్థలమైన భూతపురియందేల కోరుకొనిరి. 6) భూతపురియందర్చాబింబమున తమకళావాహనము సేయునప్పుడు, తాము శ్రీరంగమునందేల యుండవలయును. 7) తమశిలా విగ్రహమును మరియొకరి చేత భూతపురి కేల పంపవలెను.

అని యీ మొదలైన కొన్ని సంశయములు కలుగుచున్నవి. ఇందుకు జనశ్రుతి యెట్లన. 1) రామానుజులవారు దిగ్విజయము జేసి, విశిష్టాద్వైత మతమును వ్యాపక మొనర్చి తుదకు తామర్చారూపముగ నుండదలంచి శిలారూపమును జేయించి తమ శిష్యులైన పాంచరాత్ర వైష్ణవులకు జూపించి వారి యాగమ ప్రకారము తమ కళల నాబింబ మందారోపింపుడని యాజ్ఞచేసి రనియు. 2) వారలట్లు సేయ లేకుండుటచే విఫల మనోరథులయి వైఖానసులచే చేయించదలంచి శ్రీరంగమున వైఖానసులు లేకుండుటచే భూతపురికి దానువచ్చిన యెడల యచ్చట వైఖానసులు తాను తమ వారికి చేసిన యపకృతులకేమి సేయుదురో యనుభయంబున తాము శ్రీరంగమునందే యుండి తమ యర్చాబింబమును మాత్రము భూతపురియందుగల వైఖానసులవద్దకు బంపినట్లైన నీ రూపమందా రూపమారోపింప జేయగోరి రనియు. 3. వైఖానసులును తమ వారు విశేషించి లేకుండుటచేతను అదివరకు రామానుజులచే నపకృతి బొందియుండియు ప్రకృతమున విస్తరించియున్న రామానుజ మతావలంబకుల కనుకూలముగ నుండుననియు, అందువలన తమకు వారి బాధకము లుండవనియును లౌకికము నాలోచించి, యందుల కంగీకరించి రనియు, 4) రామానుజుల వారి కళలను

తీయునప్పుడు, అధోభాగమునుండి యూర్ధ్వభాగమునకు తీయవలయునా, లేక యూర్ధ్వము నుండి యధోభాగమువరకు తీయవలయునా యని యడిగిరనియు. 5) రామానుజులవా రూర్ధ్వ భాగము నుండి కళలను తీసిరేని, ముందు నేత్రావరోధము సంభవించును. మిగిలిన యవయవాన్వేషణ ముండదు గాన నధోభాగము నుండియే తీయవలయునని చెప్పి పంపిరనియు. 6) అట్లు పాదములు మొదలు కంఠము వరకు రామానుజుల కళలను వైఖానసులు మంత్రబలముచే నాకర్షించి శిలయందారోపించిరనియు. 7) అట్లా రోపించునపు డారామానుజుల వారి యవయవములు శిథిలములై శిలయందలి యవయవములు చలించిన వనియు, నేత్రములు తీయునప్పుడు శరీరమున నున్న నేత్రము నుండి రక్తము జారినదనియు. 8) అది చూచి యచ్చటనున్న వారలందరు నాశ్చర్యము నొందిరనియు. నట్లు కళలు తీయునప్పుడా శ్రీరంగములో నున్న రామానుజుల వారికి పూర్తిగా శరీరాయాసము కలిగినదనియు. వైఖానసుల యద్భుత మాహాత్మ్యంబునకు సంతసించి తమ సన్నిధి యందు గూడ ప్రథమ తీర్థ గౌరవంబు లర్చకులకు నొసంగిరనియు కింవదంతి గలదు. కొంతవరకు ప్రకృతమున గానవచ్చు చున్నవి. తిరుమలాచాచార్యులవారును శ్రీనివాసుని యందైక్యము నొందిరి.

శ్లో. విప్రనారాయణాచార్య, స్తతోవానంతయాజినః
అనంతనారాయణార్య, స్సూత్రాణాం వృత్తికారకః.

తా. తిరుమలాచార్యులవారి యనంతరము విప్రనారాయణా చార్యులు వసంతయాజ్యా చార్యులు అనంత నారాయణా చార్యులును, గలరు. ఈ అనంతనారాయణాచార్యుల వారిచే బ్రహ్మసూత్రములకు వార్తికోద్గ్రాహిణి, అనువృత్తి చేయబడినది.

## శ్రీనివాసాచార్యులవారి చరిత్రము

శ్లో. తచ్ఛిష్యం శ్రీనివాసార్యం, శ్రీనివాసకృపాస్పదం
శ్రీమద్రామాయణాదీనాం, వ్యాకర్తారంమహామతిం
ధ్వనిప్రస్థానపరమా, చార్య ఇత్యపివిశ్రుతమ్.

తా. వారి శిష్యులు శ్రీనివాసాచార్యులవారు, వీరు శ్రీనివాసకృపా పాత్రులును, శ్రీమద్రామాయణాదులకు వ్యాఖ్యాతలు, ధ్వనిప్రస్థాన పరమాచార్యులను బిరుదము గలవారు. వీరు వ్రాసిన శాకుంతల వ్యాఖ్యానములో.

శ్లో. వైఖానసాన్వయ పయోధి మృగాంకమూర్తి
శ్రీకౌశికో విజయతే నహితిమ్మయాఖ్య.
శ్రీవేంకటేశచరణాంబుజ నిత్యపూజా
పూతా కృతిర్గుణనిధిర్మహితోమనీషి
తస్యపుత్రోస్తి విద్యానాం స్వయంవరపతిః కవిః
వ్యాఖ్యాతానాటకాదీనాం, శ్రీనివాస ఇతిశ్రుతః.
యంశ్రీనివాసమఖిలాగమసార సింధు
కుంభోద్భవం బుధజనాః పరికీర్తయంతి
సోహంవిచార్య భరతాదిముని ప్రణీతం
శాస్త్రం కవీంద్రరచితానిచ నాటకాని
న్యాయంఫణీంద్రపణితిం కపిలస్యతంత్రం
కాణాదతంత్ర మథజైమిని నాకృతంచ
టీకాంకరోమి విదుషాం పరితోషణాయ
శాకుంతళస్య వృషశైలపతేః ప్రసాదాత్.

అని వ్రాసిన యీ శ్లోకములను విచారించగా, వీరు కౌశికస గోత్రులు. శ్రీ వేంకటేశ్వర నిత్యపూజాధురంధరులైన తిరుమలాచార్య పుత్రులు. విద్యలకు స్వయంపరపతి, నాటకాదులకు వ్యాఖ్యాతలు, భరతాదిముని ప్రణీతములై శాస్త్రములకును కపిలతంత్ర కాణాదతంత్ర జైమిని తంత్ర అభిజ్ఞాన శాకుంతలములకు వ్యాఖ్యాతలు అని తెలియుచున్నది.

శ్రీమద్రామాయణ వ్యాఖ్యానము శ్రీనివాసాధ్వరీంద్రులచే వ్రాయబడినదని యిలత్తూరు సుందర రాజాచార్యులచే శ్రీదీక్షితుల చరిత్రంబున వ్రాయబడినది.

వాసుదేవభట్టాచార్య ప్రణీతమైన మోక్షోపాయప్రదీపికయు గురుపరంపరయు నీ మహామహులే రామాయణ వ్యాఖ్యాతలని నిరూపించుచున్నది. మరియొకచో శ్రీనివాసదీక్షితుల వారే వ్యాఖ్యానము వ్రాసిరనియు నది కొంతవరకు శిథిలమైనదనియు వీరు తిరిగి పూర్తి చేసిరనియు, నా కారణముచేత నుభయులు వ్యాఖ్యాతలయిరని తెలియుచున్నది. వీరు వ్యాఖ్యానాంతిమ గద్యంబున శ్రీరమణ వేంకటాచలేశ్వర పాదారవింద సమారాధక శ్రీవేంకటభట్ట ఇతి గోత్రక్రమాగత భట్టబిరుదధ్వని ప్రస్థానపరమాచార్య అష్టభాషా చక్రవర్తి శ్రీనివాసాచార్య విరచితాయాం, అని వ్రాయుటచేతను. వీరి జన్మభూమి తిరుపతియనియు, కులక్రమాగత వేంకటభట్ట బిరుదము వీరికి గలదనియు, వ్యంగ్య ప్రాధాన్య కవితారచనా ధురంధరులగుటచే, ధ్వని ప్రస్థాన పరమాచార్యులనియు, మాగధ, పైశాచిక, అపభ్రంశ, మహారాష్ట్ర శూరసేన, ప్రాకృత, గైర్వాణాంధ్రములను నష్టభాషలయందమితంపు సాహితీగరిమ, గలవారలగుటచే. అష్ట భాషా చక్రవర్తి యనియు ప్రఖ్యాతి వహించిరని తెలియుచున్నది. మరియు వీరి యభిజ్ఞాన శాకుంతల వ్యాఖ్యానంబున. 14వ పుటయందు, ఏతేషాంలక్షణం మదీయ మాళని కాగ్ని మిత్రీయవ్యాఖ్యానే ద్రష్టవ్యం అనియు 23 పుటయందు, యథావామదీయే నైషధానందే అనియు, కవుల నిరంకుశత్వమును గూర్చి చర్చింపుచో.

శ్లో. బాఢంసంతి మహీతలేషు కవయః, తత్రాప్య సౌగణ్యతే
ముఖ్యోవేంకట నాథ పూజనపరః, శ్రీశ్రీనివాసఃకవిః
యేమాసాః కుసుమాకరా అపిమధుః, పుష్పాకరోభణ్యతే
యేజాతామలయేనతే మలయజాస్సాతు ప్రథాచందనే.

అనుటచేతను, 80వ పుటయందు నలుని చేత హంసను గూర్చి దమయంతి యనురాగము యొక్క స్వప్న దర్శన బీజమును తననైష దానంద నాటకమున వాకృవ్వబడెననియే తద్వ్యాఖ్యానమున మహాకవి కాళిదాస కవితారీతుల దలపోయుచు.

శ్లో. అద్యస్వప్నే ప్రియసఖ మయాదర్శితా
చిత్రలోకే భూషాయో షాఫణితి మనసోరవ్యలక్ష్యానుభావా,

స్మారంస్మారం తరళనయనాం తాంతపత్యంతరాత్మా
వారంవారం విసృజతిశరాన్ పాతకీ పంచబాణః,

అను నీ శ్లోకము హెచ్చరించుటవలనను, మఱియొక చోట మదీయే రసికానందే ప్రహసనే, అనియు వ్రాయబడి యుండుటచే మహాకవికాళిదాస విరచితములైన, శాకుంతల మాళవికాగ్ని మిత్రములకు వ్యాఖ్యాతలైనట్లును, రసికానందమను ప్రహసనమును, నైషధానంద మను నాటకమును రచించిరని తెలియుచున్నది. శాకుంతలమునకు, రాఘవభట్టును, వేముల రామచంద్రారెడ్డియు వేరు వేరుగా వ్యాఖ్యానములు వ్రాసిరి. యవిగచ్ఛద్వ్యాఖ్యలేగాని వీరు వ్రాసిన రీతిగావి స్తుతములు గావు రామచంద్రారెడ్డి వ్యాఖ్యానమునందు శ్రీనివాసాచార్యులవారిచే వ్రాయబడిన వ్యాఖ్య గంభీరమై భావవిస్తృతమైన దగుటచే సంస్కృత భాషాజిజ్ఞాసులకు సులభబోధకరమగు రీతి నేను వ్రాయుచుంటినని, వ్రాయుట చేతను శ్రీనివాసాచార్యులవారు రామచంద్రారెడ్డి కంటె పూర్వులని తెలియుచున్నది. వేముల రామచంద్రారెడ్డి తాను వ్రాయు శాకుంతళ వ్యాఖ్యానములో నెల్లూరుమండల మేలుచున్న రాయక్షితీంద్ర పుత్రులు. 1540 హూణశకాబ్దమునకు సమకాలికులునగు శ్రీతిరుమలరాయశేఖ రాజ్ఞగొని యీశాకుంతళమునకు వ్యాఖ్యానము వ్రాయుచుంటినని వ్రాయుటచే తిరుమలరాయ శేఖరునకు రామచంద్రారెడ్డి సమకాలికుడని చెప్పవచ్చును. అంతకు పూర్వము సుమారు నూటయిరువది సంవత్సరములు క్రీస్తు. 1420 సంవత్సరము మొదలీ శ్రీనివాసాచార్యుల వారిజీవిత కాలమని యొక విధముగా నిర్ణయించుచున్నారు.

శ్లో. తచ్ఛిష్యం వేంకటాచార్యం, గోవిందార్య మతఃపరం
గోపాలాచార్యమనఘం, యోకతనోచ్ఛ్రీతయేహరేః
శ్రీవైఖానససూత్రాను, క్రమణీంమణీసన్నిభాం
భగవచ్ఛాస్త్ర తత్వార్థం మంజూషాంతత్వదీపికాం.

తా. ఆ శ్రీనివాసాచార్యులవారికి వేంకటాచార్యులవారును వారికి గోవిందాచార్యుల వారును వారికి గోపాలాచార్యుల వారును శిష్యులై యన్నారు. యీ గోపాలచార్యుల వారిచే

ఈ వైఖానస సూత్రానుక్రమణికయు భగవచ్ఛాస్త్ర తత్వార్థ మంజూషయు, తత్వదీపికయు నను గ్రంథములు శ్రీహరిప్రీతిగా వ్రాయబడినవి.

శ్లో. తతశ్శ్రీ కృష్ణమాచార్యం, కలాన్యాస గురుంహరేః
తచ్ఛిష్యం పెరుమాళ్లార్యం సారసంగ్రహదేశికం
తతోభాగవతాచార్యం యోకకార్షీ ద్వైష్ణవామృతమ్.

తా. తరువాత కృష్ణమాచార్యుల వారు వీరు శ్రీహరికి కలాన్యాసగురువులు. వారికి శిష్యులు పెరుమాళ్లాచార్యులు వీరు సారసంగ్రహమును గ్రంథకర్తలు. తరువాత భాగవతాచార్యులవారు వీరు వైష్ణవామృతము అను గ్రంథము వ్రాసిరి. అందు విశేషించి వైష్ణవ మహిమంబు వర్ణింపబడి యున్నది.

శ్లో. నృసింహాచార్యమనఘం, వైవాహిక గురుంహరేః
రామానుజార్యం తచ్ఛిష్యం, యోతనోచ్ఛృతిసంగ్రహం
ద్వాదశోపనిషద్వ్యాఖ్యాం, గంభీరాంబ్రహ్మదర్శినీమ్.

తా. ఆ భాగవతాచార్యులవారికి నృసింహాచార్యుల వారును వారికి రామానుజాచార్యు వారును శిష్యులై యున్నారు. ఈ రామానుజాచార్యుల వారిచే శ్రుతిసంగ్రహమైన పండ్రెండు ఉపనిషత్తులకు గంభీరమైన వ్యాఖ్యానము వ్రాయబడినది.

శ్లో. వరదార్యంమహాత్మానం, కృతంషట్సూత్ర్యనుశ్రుతమ్.

తా. వారికి శిష్యులు వరదాచార్యులు వీరిచే వైఖానస సూత్రమునకు షట్సూత్ర్యను శ్రుతియను వ్యాఖ్యానము వ్రాయబడినది.

శ్లో. తతోకస్మదా చార్యపాదాన్, ప్రణమామిసహస్రశః
భక్తై ర్భాగ వతైశ్చైవ, పరమై కాంతసత్తమైః
వైఖానసైర్మహాభాగై, రనూచానైశ్చ శోభితాం
శ్రీలక్ష్మీ వల్లభారంభాం, విఖనోమునిమధ్యమాం
అస్మదాచార్య పర్యంతాం, వందేగురుపరం పరామ్.

శ్రియః కాన్తాయ కళ్యాణ నిధయే నిధయేఽర్థినాం
శ్రీ వేంకటనివాసాయ, శ్రీనివాసాయమంగళమ్.

గద్యము. ఇది శ్రీమద్వైఖానససూత్ర పవిత్ర గౌతమసగోత్ర నృసింహాచార్య పుత్ర, వాడపల్యన్వయ సకలసజ్జన విధేయ కృష్ణమాచార్య నామధేయ ప్రణీతంబైన పూర్వాచార్య చారిత్రమను నామాంతరము గలశ్రీ వైఖానస చరిత్రము, నందుత్తర భాగము.

-- సమాప్తము --

శ్రియై నమః

శ్రీ శ్రీనివాసాయ నమః

# చోరసంవాదమ్

శ్లో. అస్తి చోళమహీభాగే దివ్యోద్యాన పరిష్కృతే
శ్రీమత్కొరయులూ రాఖ్యం పట్టణం దేవనిర్మితమ్. 1

తాత్పర్యము : సదుద్యానవన సంయుతంబగు చోళధరాస్థలిపై దేవతలచే కట్టబడి సంపత్సంపన్నమైన 'కొరయులూరు' అను పేరుగల నగరము కలదు.

తస్మిన్ శ్రీ నగరే దివ్యే హరేశ్శార్ఙ్గాంశ సంభవః
పరకాల ఇతి ఖ్యాతో మహానాసీత్కలౌ యుగే. 2

శిరుల కాటపట్టగు యాయోగ్య పట్టణమున కలియుగము నందు శ్రీ శ్రీనివాసమూర్తి యొక్క శార్ఙ్గాంశచే జనించి పరకాలుడని కీర్తి గాంచిన గొప్పవాడుండెను.

నోకపిబాహుబలేనైవ జిత్వా దుష్టాన్న రాధిపాన్
ప్రకృష్టం ధనమాకృష్య స్థితస్సర్వాధికస్తథా. 3

అతడు తన బాహుబలముచేతనే దుర్మార్గులగు రాజులను జయించి విశేషముగ ధనమును సంపాదించి యసమానుడై యుండెను.

తతో లక్ష్మ్యంశజాం కన్యాం కళ్యాణగుణశాలినీం
వివాహం కర్తుముద్యుక్తో తయేత్థమపి భాషితః. 4

అనంతరమందు లక్ష్మీదేవి యొక్క అంశచే జనించి సౌభాగ్య శీల శాలినియగు కన్యకను వివాహమును చేసికొనుటకు నుద్యుక్తుడై ఆమెతో సంభాషించెను.

స్వామిన్ భాగవతానాంతు పూజాం పంచసహస్రకం
కృత్వా మాముద్వహేత్యేకం సాకవోచద్బాలికా వచః. 5

స్వామి ! అయిదువేల మంది భాగవతోత్తములకు (విష్ణుభక్తులకు) పూజనొనర్చి నన్ను పరిణయ మాడవలసినదని యా బాలిక పలికెను.

తదాజ్ఞయా పూర్ణగురోః పదాన్తికే
సుపఞ్చసంస్కారహితో దృఢవ్రతః

కృతోద్వహో భాగవతార్చనావిధిం
సదాకరోమ్యేతదితీవ నిశ్చయః. 6

ఆకన్యకామణి యిష్ట ప్రకారము గర్భవైష్ణవ జన్మలగు పూర్ణగురులగు శ్రీ వైష్ణవాచార్యుల సన్నిధి కేగి భక్తితో నాయన పదాబ్జముల కెరగి నిశ్చలమగు భగవద్భక్తియుతుడై చేయబడిన వివాహము కలిగినవాడై భాగవతార్చనమును సదాకావింప నిశ్చయించిన వాడై ఎల్లప్పుడును చేయుచుండెను.

శ్రీమద్భాగవతానాంతు నిత్యపూజావిధేర్ధనం
న్యాయార్జితం భవేన్నాలమితి చౌర్యమతాకరోత్. 7

పరమభాగవతోత్తముల యొక్క నిత్య సేవాక్రమమునకు ధర్మముగ సంపాదించిన ధనము చాలనిదగునని చౌర్యోత్సాహముతో నుపక్రమించెను.

మార్గేగతాన్భాగవతాన్వినాన్యా
స్సంపీడ్య భూషాంబర వస్తుజాతం
హృత్వా హరేర్దా సజనార్చనావిధిం
కుర్వన్భటైశ్చౌర్యకళాప్రవీణైః 8

దారి వెంట పోవుచున్న పరమ భాగవతోత్తములు కాని వారలను చోరవిద్యానిపుణులగు సేవకులచే పీడించి ఆభరణములు చీన చీనాంబరములు మున్నగు వస్తువులను హరించి శ్రీనివాసమూర్తి యొక్క భక్త జన పూజనను గావించుచుండెను.

ఏకస్మిన్దివసే శౌరిర్దాసస్వా న్తజిఘృక్షయా
పన్థానం నిర్జనం చక్రే శ్రీనాథో భక్తవత్సలః. 9

దాసపోషకుడును రమాకాంతుడునగు శ్రీనివాసమూర్తి యొకానొక దినమందు భక్త చిత్త పరీక్ష నొనర్ప వలెనను ఇచ్ఛచేత మార్గమును జనశూన్యమైనదిగ గావించెను.

తతో వైష్ణవ పూజార్థం ద్రవ్యాభావాద్దినత్రయం
సోపోష్యాంగ మగాగ్రామ్నేచ యామీతినగాగ్రగః. 10

అనంతరమం దా పర్వతాగ్ర చరుండు వైష్ణవపూజకు ధనము లేకపోవుటచే మూడు దినము లుపవసించి అతడవయవముల పీడ నొందించెను.

ఆరుహ్య జాత్యశ్వమథాబ్జలోచనః
శ్రీగన్ధ మాల్యామ్బరదివ్యవిగ్రహః
వై వాహలాక్షాంసవాసనావృతః
ప్రాగావిరాసేదిప రాజపుత్రః. 11

అనంతరమందు పద్మముల వలె గుండ్రములై మనోహరములై యొప్పుచున్న నేత్రములు కలవాడును చందనమలందికొని నిరుపమాన పరమళభరితములగు పుష్పమాలికల ధరించి కనక మయచేలముల దాల్చి దివ్యమంగళ స్వరూపుండై వెలయు వాడును పరిణయ సంబంధలాక్షారస సుగంధ పరివృతుండునై యొప్పారుచు శ్రీనివాసమూర్తి సర్వలక్షణ లక్షితంబై యుచ్చైశ్రవంబు ననుకరించు హయము నధిరోహించి మహారాజ కుమారుని వలె తూర్పు దిక్కుగ సాక్షాత్కరించెను. 12

నందాయాం మృగయోత్సుకః పరిచరన్ దుష్టాన్మృగాన్మర్దయన్
చైత్రే మాసి విపక్షపక్ష విజయః పీతామ్బరాలఙ్కృతః
కేయూరాంగదహారకుణ్డల యుతశ్శిష్టాన్ జనాన్పాలయన్
భూలోకే సురనాయకో విజయతే శ్రీరమ్యయాత్రోత్సవే.
దివ్యం మహార్ఘమణి రాజితభూషణాఢ్యం
శ్రీశాలికజ్జలవిభాసుర కంజనేత్రం
వైవాహమంగళసువర్ణ మృదూపవీతం
దృష్ట్వా సుధామివ తృషాతమవాప చోరః. 13

ప్రకాశించు చున్నటువంటిన్ని, ధగద్ధగాయ మానములగు వజ్ర వైడూర్యాది నవరత్న ఖచిత దివ్యాభరణ ధరుడైనటువంటిన్నీ, వైవాహికన్యస్త హిరణ్మయ వికార జన్నిదుండైన నయ్యబ్జలోచనుని గాంచి పిపాసాతురుడై జలార్థియై పరితపించుచున్న వాని కమృతంబు లభ్యమైన వాడెట్టు లపరిమితానంద కందళిత హృదయూర విందుండగునో యట్లే పరకాలుండును ముదమందెను.

సాక్షాన్నారాయణో దేవో మదర్థం సగతో వనం
ఇతి స్మృత్వా నమస్కృత్య సంజహార ధనాదికం. 14

నానిమిత్తమై ఆ శ్రీమన్నారాయణ మూర్తియే వనమున కరుదెంచినాడని తలపోసి దేవునకు నమస్కరించి యా మహనీయుని చెంతన నుండు వస్త్రాభరణాది ధన నిచయమును అపహరించెను.

చోరేణ కేన హృతహారసువర్ణ చేల
కేయూర కంకణ మణీ ద్ర రాంగుళీయః
భక్తప్రియస్సకలలోక విభుస్తదాభూ
ల్లజ్జాన్వితః పరిధృతాంశుక యుగ్మశేషః. 15

సమస్త ప్రపంచాధి నాయకుండును, దాసజనాభీష్ట ఫలప్రదుండును, నగు శ్రీ రమాకాంతుడు మణిమయహారమ్ములు కనకవికారసనములు, రత్నకంకణమ్ములు మున్నగు దివ్యాభరణములన్నియు చోరు లపహరింప వస్త్రద్వయముతో నాదేవ దేవుండు లజ్జాన్వితుండై యుండెను.

అథతత్రనిరీక్ష చస్వదాసా న్ప్రియసేనాపతి వీశశేషముఖ్యాన్
అవదత్కరుణానిధిః కథంహృతవిత్తాన్ పరిశోధయన్తి చోరాన్. 16

అనంతరమందు విష్వక్సేన గరుడ శేషాదులగు నిజసేవకుల జూచి తన ధనము నపహరించిన చోరుల నెట్లుగనుకొన గలుగుదుమని దయాసముద్రుడగు శ్రీనివాసమూర్తి పలికెను.

ఊచుస్తమాలోక్య ఫణీశ్వరాద్యా
శ్చోరం మహీధ్రాగ్రవరాసనస్థం,
యత్సఇృతం విత్తమతీవ గృహ్య
శీఘ్రం తమాగచ్ఛ విభోస్సురాణాం. 17

పర్వతశిఖరస్థితుడై యున్న యా పరకాలుని శేషుడు మొదలగు వారుగాంచి సంపాదించిన ద్రవ్యము నంతయు దీసికొని దేవ ప్రభువైన శ్రీనివాసమూర్తి కడకు రావలసినదని పల్కిరి.

ప్రచ్ఛాద్యమానవధనాన్పరివీక్ష్య తాంస్త్రీ
న్ప్రోవాచతస్కరజనోప్యభయస్సహాసం
గచ్ఛంతు యత్ర భవదీశ్వర సన్నిధిర్మాం
సంప్రాపయన్త్వితి విహాయ ధనేన యుక్తః. 18

విన్నవైన మోముతో ఆ ముష్వురను పరకాలుడు గాంచి తాను ధన్యుడై నప్పటికి నిర్భయముతో మందహాస మొనర్చుచు ధనసహితుడై మీ ప్రభుసన్నిధికి నన్ను దీసికొని పొండని పలికెను.

నీలామ్బరేణ నిబిడేన నిబద్ధకచ్ఛః
కున్తం సుతీక్ష్ణవరలోహమయం చ ధృత్వా
పాషాణభేదమపి భిత్తివిదారణాఖ్య
ముష్ణాతి సంచితధనం పృథివీశ్వరాద్యైః 19

దట్టమైన నల్లని వస్త్రమును ధరించినవాడై నిశితమును లోహమయమును పాషాణముల సయితము ఖేదింప దగినదియును ధనసంపాదనమునకు సాధనము నైనటువంటి 'భిత్తివిదారణ' మను నామాంతరము గల ఆయుధమును ధరించి పరకాలుడు బయలుదేరి వెళ్లెను.

కోయం చోరగి కుత్ర వా కాచ భూమిః
కింవా స్థానంకస్య పుత్రో దురాత్మా
మాతా కావా కస్య భూపస్య భృత్యు
స్సర్వం వ్యక్తం బ్రూహి మే శంసతోద్య. 20

ఈ దొంగ యెవడు ? వీని నివాస మెక్కడ ? ఏ దేశము ? దుర్మార్గుడగు వీడెవని కుమారుడు ? వీని తల్లి యెవరు ? చోరుడగు వీడు యేరాజు యొక్క భృత్యుడు? ఈ సకల వృత్తాంతము నెరిగింపుడని శ్రీనివాసమూర్తి తమ సేవకుల యాజ్ఞాపించెను.

మాతా చ కమలా దేవీ పితా దేవో జనార్దనః
బాన్ధవా విష్ణుభక్తాశ్చ స్వదేశం భువనత్రయం. 21

నాతల్లి క్షీరసాగర తనయ యగు లక్ష్మీదేవి. దేవదేవుడైన శ్రీమన్నారాయణుడు నా తండ్రి. పరమైకాన్తులగు శ్రీ వైష్ణవులు నాబంధువులు. స్వర్గమర్త్య పాతాళములు మూడు లోకములు నా నివాసభూమియని పరకాలుడు విన్నవించుకొనెను.

కస్త్వం చోర బలం తవాస్తి బహుళం హర్తుం మదీ
యం ధనం, స్వర్ణం రత్నయుతం చ చామరయుగం
ఛత్రం చ కేయూరకం క్రోధోనాస్తి మమ త్వయీా
హ విపినే పూర్వం రఘూణాం పతేః మానోస్వస్య
కుశే లవే యుధి యథా ప్రోవాచ తం సత్కృపః 22

ఓరీ చోరుడా ! సర్వాబద్ధములాడు నీవెవడవు ? నీకు విస్తారమైన బలము కలదా? నా సంబంధమైనవియు హిరణ్మయుములను, రత్న ఖచితములగు చామరములు ఛత్రములు భుజకీర్తులు మున్నగునవి అపహరించుటకు నీకు విస్తారమైన బలము కలదా ? చెప్పుము. నీ విషయమైనాకు ఇసుమంతయు కోపము లేదు. అని భగవంతుడు పలికెను.

స్థిత్వాద్రిదేశ గహనే నగసాను భూమౌ
మార్గే తృణద్రుమయుతే దృఢవృక్షజాలే,
నిమ్నోన్నతే వనతలేపరకాలనామా
కుంజే ధనం హరతి మార్గగతా గతానాం. 23

పర్వతములతోను మహోన్నతములై దృఢములై యొప్పారు వృక్షములతోను భయంకరముగ నున్న ఘోరారణ్యమున నుండి మార్గస్థుల నుండి ధనమును హరించు చున్నాను. నా పేరు పరకాలుడని యాతడు పలికెను.

ధర్మస్య మార్గః బహవః ప్రశస్తా
ధర్మో నచాయం భవతా కృతో యః
చోరాస్తు దాతుం సహరన్తి విత్తం
సంభోక్తుమేవాపహరన్తిలోకే. 24

ధర్మముగ ధనమునార్జించుటకు ప్రశస్తములగు విధానము లనేకములు గలవు. నీ చేత చేయుబడుచున్న కృత్యము ధర్మము కాదు. చోరులొకరికిచ్చుట కొరకు ధనము నపహరించుట లేదు. తామనుభవించుటకే ప్రపంచమున ధన్యులు ధనాపహరణ మొనర్చు చున్నారు.

సఛార్య ధర్మో నవనీత చోరః భక్తేషు భక్తిం పరమాంవినా మే
చౌర్యార్జిత ద్రవ్యతదీయ పూజామతః పరంనాస్తి పరో హి ధర్మః. 25

నీవు చేయు యీ కృత్యము సత్పురుషులు చేయతగినది కాదు. నా భక్తులయందు పవిత్రమైన భక్తిని జూపుట దక్క దొంగ తనముచే సంపాదించిన ద్రవ్యముతో యొనర్చు పూజ యోగ్యమైన ధర్మము కాదు.

అద్య త్యజ త్వం భవః ప్రతిజ్ఞాం
చోరోసి నూనం మమవాక్యతుష్టః
హృతంతు విత్తం భవతాయదస్తు
స్వస్త్యస్తుతే తత్పునరేవ దేవా. 26

బాటసారుల నుండి బాధించి సంగ్రహించిన ద్రవ్యముచే భాగవతోత్తముల తృప్తినందింప వలెనను నీ ప్రతిష్ఠ నిపుడు విడచిపెట్టుము. నా యొుక్క వాక్యములచే సంతోషించిన వాడవగుము. నీ చేత యిదివర కపహరింపబడిన ద్రవ్యము మంగళప్రదమైన దగుగాక. అని శ్రీభగవానులు సెలవిచ్చిరి.

చౌర్యార్జితేన సకలేన ధనేన సోహం
సంతర్ప్య సంశ్రయపరో మురవైరిభక్తాన్
ఆరాధనేన మమ జన్మఫలవ్రతం తం
కింవా త్యజామి తనురప్యధవాహమద్య. 27

నేను దొంగతనముచే సంపాదించిన ద్రవ్యము చేత భగవద్భక్తులను తృప్తి నొందించి నా యొుక్క జన్మఫలమైన వ్రతమును త్యజించు చున్నాను. అని పరకాలుండనియెను.

హృత్వా పరద్రవ్యమనేకధా త్వం
దానేనకిన్తే పరమస్తి చోర
దోషః పరస్వాపహరం వదంతి
నన్తః కథం చాస్య గుణేన తుష్టః. 28

ఇతరుల ద్రవ్యమును అపహరించి అనేక విధములుగా దానము చేయుట చేత నేమి లాభము కలుగును ? లోకమున సత్పురుషులు పరద్రవ్యమును దొంగలించినచో మహత్తరమగు పాపము సంభవించునని నుడివెదరు. కావున నీకావని యుచితమా ?

శ్రీమద్భాగవతార్చనం భగవతః పూజావిధే రుత్తమం,
శ్రీ విష్ణోరవమాననాద్గురుతరం శ్రీవైష్ణవోల్లంఘనం
తీర్థాదచ్యుతపాద జాద్గురుతరం తీర్థం తదీయాంఘ్రిజం
తస్మాన్నిత్యమతంద్రితో భవసతాం తేషాం సమారాధనే. 29

భగవంతుని పూజించుట కంటె పరమై కాంతులగు భాగవతులనర్చించుట యుత్తమము. భగవంతునకు కలిగించిన యవమానము కంటె శ్రీవైష్ణవాజ్ఞ నతిక్రమించుట మహాదోషము. భగవత్పాదతీర్థమున కంటె భాగవతాంఘ్రిజోదకము ఫలాధికమైనది. ఆ హేతువుచే నెల్లప్పుడు పరమభాగవతోత్తముల సేవించుట యందు శ్రద్ధకలవాడవు కమ్మని శ్రీనివాసమూర్తి వాక్రుచ్చెను.

శ్లోకార్థేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రన్థకోటిభిః
పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనం. 30

గ్రంథ సహస్రములచేత యే ధర్మము చెప్పబడినదో అట్టి దానిని అర్థ శ్లోకములచే వక్కాణించు చున్నాను. భగవద్భక్తులును, పరమైకాంతులును, సచ్ఛీలురునగు వారలకు జేయునుపకారము పుణ్యము కలుగుటకును, ఇతరుల పీడించుట పాపము పై బడుటకును హేతువులగుచున్నవి. అని భగవంతుడాజ్ఞాపించెను.

కథం త్యజేహం వ్రతమద్య సత్యం
జిత్వా హరేమాం బలమస్తి తే వా
అథగృహీత్వా సకలం ధనమ్మే
సుఖేన గచ్ఛేదితి వాచమూచే. 31

నేనిపు డీ భాగవతారాధన స్వరూపమగు వ్రతమును విడచి పెట్టజాలను. ఓ యఘవినాశా ! నీకు బలమున్నట్లయితే నన్ను జయించి నా ద్రవ్యమంతయు గ్రహించి సుఖముగా వెళ్లవచ్చునని పరకాలుడు పలికెను.

పృథ్వీభాగవతోత్తమాదిమహతీత ద్వేష్టనం వారిభిః
పీతోయం కలశోద్భవేన మునినా స వ్యోమ్ని ఖద్యోతవత్
తద్విష్టోర్ధనుజేట్ర్ర ధ్వనజితః పూర్ణాం పదం స్వాభవత్
సోయం విష్ణురపి త్వదీయహృదయే త్వత్తోధికో నాపరః. 32

హరేర్ధృఢాం భక్తిమపేక్షితస్య సశఙ్ఖచక్ర స్స్వయమేవ తత్ర
ప్రత్యక్షతస్తం కృపయా నిరీక్ష్య మనోహితం తేద్య వరం వృణీష్వ. 33

శ్రీ హరి యెడ నిశ్చల భక్తినభిలషించుచున్న పరకాలునకు ప్రచ్ఛన్న వేషుడై ఉన్న శ్రీనివాసమూర్తి శంఖచక్రధరుడై సాక్షాత్కరించి వానిని అనుగ్రహముతో జూచి నీకు యిష్టమైన వరమును గోరికొనుమని సెలవిచ్చెను.

విష్ణోః పాదామ్బుజన్తత్ర ప్రణామమకరోద్భువి
బద్ధాంజలి యుతశ్శ్రీరో వచనం చేదమబ్రవీత్. 34

శ్రీనివాసమూర్తి యొక్క చరణనళిన యుగళమునకు నమస్కారం బొనర్చి బద్ధాంజలితో నిలువబడి పరకాలు డిట్లు విన్నవించెను.

అపూర్వ దృష్టం తవపాదపద్మం
దృష్ట్వా దృఢం నాధనహిత్య జామి
కామాన్న యాచే నహి కోపి మూఢో
యః కల్పవృక్షస్తుషయాత్రమిచ్ఛేత్. 35

ఎన్నడును జూడని తమ పాదపద్మముల సేవించుకొని ధన్యుడనైతిని. నా జన్మసార్ధకమైనది. దేవదేవుండవగు నిన్నెవడు కల్పవృక్షమును సైతము కాంక్షింప నిచ్ఛగించెను.

అతోనయాచే వరమీశయుష్మ
త్పాదాబ్జభక్తిం సతతం మమాస్తు
ఇమం వరం దేవ మమ ప్రయచ్ఛ
పునః పునస్త్వామిమమేవయాచే. 36

అందువలన నోశ్రియఃపతీ ! ఐహికసుఖలంపటునిగ నొనర్చు యెట్టివరము నయినను ప్రసాదింపవలెనని వేడుకొనను. ముక్తి సాధనంబును, భగవదనుగ్రహ కారణంబును పరమ పద నివాసనాయకంయును, అగు భవదీయచరణ కమల ద్వయముపై మరపు గల్గని భక్తినను గ్రహింపుము. ప్రభూ ! ఈ నా యభీష్టము ననుగ్రహముతో ప్రసాదింపుము.

తే ఛత్రచామరాదీని చాహృతానిమయా విభో
ప్రతిగృహ్ణీష్వ భగవన్పాహిమాం భక్తవత్సల. 37

ఓ సర్వలోకైక వంద్యా ! తమ ఛత్రచామరాదులు నాచే తీసికొని రాబడినవి. ఓ జగద్రక్షకా ! తండ్రీ ! వానిని తిరిగి దయతో స్వీకరింపుము. భక్తవత్సలుండవగు శ్రీనివాసప్రభో! నన్ను రక్షింపుము. రక్షింపుము. అని పరకాలుండు భక్తి పరవశుడై విన్నవించెను.

తతో విష్ణు ర్మహాతేజా భూషణాని బహూని చ
భగవాన్పరిసంతుష్టో ప్రోవాచ తిరుమంగకం. 38

అనంతరమందు శ్రీమన్నారాయణమూర్తి సమస్త భూషణముల స్వీకరించి సంతుష్ట హృదయుండై పరకాలుని 'తిరుమంగకుడా'? అని సంబోధించెను.

అద్య ప్రభృతి మద్దాసో మహా భాగవతోత్తమ
బ్రహ్మక్షత్రియవిట్చూద్రైః పూజాకర్తుత్వమర్హసి. 39

భాగవతోత్తమా! నేడు మొదలుకొని చాతుర్వర్ణ్యుల చేతను పూజలనందుట కర్హుడవైతివి.

ఇత్యుక్త్వా భగవాన్విష్ణుస్స్వగృహం పునరాయయౌ
శ్రీరంగామహాదివ్యదేశేషు చరితం తవ
వైవాహికోత్సవాన్తేషు వైష్ణవః పఠ్యతాం మమ. 40

శ్రీ రంగాది భగవత్సన్నిధుల యందు కల్యాణోత్సవాన్తమందు నీ చరిత్ర పఠింపబడుగాక. అని పలికి సర్వేశ్వరుండగు శ్రీనివాసమూర్తి స్వస్థానమును గూర్చి వెడలెను.

యావత్సు ధాంశురవి మేరుకులా ద్రిసింధు
తార గ్రహర్ధ్రువనదీవనభూమికల్పాః
తిష్ఠన్తిరామచరితంభువనేషుతావ
త్తిరుమంగయాళ్వర పితిష్ఠతి దాసదాసః.
స్వస్తి ప్రజాభ్యఃపరిపాలయన్తా
న్యాయేనమార్గేణ మహిమ్మహీశాః
గోబ్రాహ్మణేభ్యశ్శు భమస్తు నిత్యం
లోకాస్సమస్తాస్సుఖినోభవంతు. 41

సూర్యుడు, చంద్రుడు, మేరుపర్వతము సముద్రము నక్షత్రములు నవగ్రహములు గంగా కృష్ణవేణ్యాది నదీనదములు రామచరితము యెంతకాలము భూమిపై నిల్చియుండునో భగవద్దాస దాసుడైన తిరుమంగయాళ్వ చరితము నంతవరకు నుండుగాక. సమస్తలోకములును సుఖమును జెందుగాత.

చోరసంవాదమ్

స్సమాప్తమ్

## తిరుమల తిరుపతి దేవస్థానము వారిచే ప్రచురించబడిన శ్రీ వైఖానస శాస్త్ర గ్రంథములు

1. విమానార్చన కల్పము
2. ఖిలాధికారము
3. క్రియాధికారము
4. ప్రకీర్ణాధికారము
5. యజ్ఞాధికారము
6. కాశ్యప జ్ఞానకాండ
7. సమూర్తార్చనాధికరణం
8. వైఖనాస అగమము
9. అర్చనాతిలకము
10. అర్చనానవనీతము
11. శ్రీ వైఖానస సన్ధ్యావన్దనము
12. ఉత్తమ బ్రహ్మవిద్యాసారము
13. శ్రీ వైఖానస మహిమ మంజరి
14. శ్రీ వైఖానస సిద్ధాన్త లేశాదర్శము
15. శ్రీ వైఖానసోపాఖ్యానము
16. ఆనంద సంహిత
17. ధ్యానముక్తావళి
18. త్రిశతి
19. ఆహ్నికామృతము
20. వాసాధికారము
21. శ్రీ వైఖానస గృహ్య సూత్రము (రెండు భాగాలు)